# శుద్ధనిర్గుణతత్వ

# కందార్థ దరువులు

## (శ్రీబ్రహ్మానందీయ భావార్థసహితము)

వాఖ్యాత

## స్వామి శ్రీ బ్రహ్మానందగిరి

# షద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

( శ్రీ బ్రహ్మానందీయ వ్యాఖ్యానా సహితము )

వ్యాఖ్యాత :

స్వామి, శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహరాజ్

క్రీ. శ. 1973 సంవత్సరము



 [వెల : రు. 5/—

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

( శ్రీ బ్రహ్మానందీయ వ్యాఖ్యాన సహితము )

వ్యాఖ్యాత :
స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్

క్రీ. శ. 1973 సంవత్సరము



 [వెల : రు. 5/—

గమనిక :

ఈ గ్రంథము వెల అయిదు రూపాయలు
పోష్టుద్వారా తెప్పించుకొనగోరువారు
ముందుగా ఏడు రూపాయలు పంపి[illegible]
మా ఖర్చులతో మీ కీ గ్రంథము పంపెదము.

—వ్యాఖ్యాత.

దొరకుచోటు :

శ్రీ బ్రహ్మానంద నిలయము, తెనాలి, గుంటూరుజిల్లా.

లేక

శ్రీ బ్రహ్మవిద్యా గురుకులాశ్రమము, ఏలూరు,
పశ్చిమగోదావరిజిల్లా

# ముందుమాట

ఈ శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థ దరువులను గ్రంధమును శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువర్యులు శాలివాహన శకము 1765 సంవత్సరమునకు సరియగు చాంద్రమాన శోభకృతునామ▼సంవత్సర మార్గశిర బహుళ చవితి, క్రీస్తుశకము 1843 సంవత్సరము డిశంబరునాటికి వ్రాసి ముగించిరి. వారీ గ్రంధమును సామాన్య మానవులకుగూడ నర్థమగునటుల వ్యావహారిక భాషలో వ్రాసియుండిరి. ఇందు వారు భాషా విషయమును పాటింపక భావమును మాత్రమే ప్రధానముగ దీసికొనిరి.

కొంద ఱీ గ్రంధమునందలి భాషను మార్పుచేయుటయేకాక గ్రంధకర్త భావములకు భిన్నములైన నూతన భావములను బ్రవేశపెట్టి ముద్రింపించిరి. మఱికొంద ఱచ్చటచ్చట కొన్ని పదములను తీసివేసి, క్రొత్తపదములను జేర్చి ముద్రింపించిరి. వేఱుకొందఱు గ్రంధకర్త భావములకు భిన్నములుగానున్న తమభావముల నిందు జొప్పించుటయేకాక కొన్ని నూతన కందార్థదరువులను సృష్టించి యీ గ్రంధమున జేర్చి ముద్రింపించిరి. ఇవియన్నియు పరస్పర విరుద్ధభావములు కలిగియుండుటచే గ్రంధకర్త యభిప్రాయము తెలిసికొనుట కష్టముగా నుండెను.

ఈ గ్రంధకర్తగారి ముఖ్యశిష్యులలో నొకరగు శ్రీ ఆదిరాజు తిరుమలరావుగారు తమగురుదేవులు రచియించిన శుద్ధ

నిర్గుణ తత్త్వ కందార్థ దరువుల వ్రాతప్రతిని తమయొద్ద నుంచుకొని యుండిరి. ఆ తిరుమలరావుగారితో మాకు సన్నిహిత పరిచయ మున్నందుచే మేము వ్రాతప్రతి ననుసరించి మఱియొక ప్రతిని వ్రాసికొంటిమి. దానికి నే మిప్పుడు "భావార్థదీపిక" అను పేరితో వ్యాఖ్యానమును వ్రాసి ముద్రింపించితిమి. మేమీ గ్రంథవ్యాఖ్యానము నచిరకాలములో వ్రాసి ముగించి ముద్రణకిచ్చుటచే నిందు భ్రమ ప్రమాదాది దోషములు దొరలవచ్చును.

నీళ్ళతో కూడియుండిన పాలయందు నీటిని వేఱుచేసి పాలనే గ్రహించు హంసలవలె నిందలి మెప్పులను గ్రహించి, తప్పులను మాకు తెలిపెడి సుజనులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు. అత్తరు పన్నీరు మొదలగు సుగంధద్రవ్యములను విడిచి నిరంతరము దుర్గంధయుతమగు బురదగుంటలనే వెదకుచుండెడి పందులవలె నీర్ష్యాసూయలతో నిందలి మెప్పులను గ్రహింపక, నిరంతరము తప్పులనే వెదకుచుండెడి కుజనులకు మా ధిక్కారములు. ఈ గ్రంథవ్యాఖ్యాన రచనకు ప్రోత్సహించి, దీని ముద్రణకొఱకు ద్రవ్యము నొసంగిన వదాన్య శేఖరులకు మా శుభాశీర్వాదములు.

గ్రంథకర్త.

# విజ్ఞప్తి

కొందఱు అచలగురుపరంపరకు శ్రీమన్నారాయణుడు, సూర్యుడు, యాజ్ఞవల్క్యుడు వరుసగా నాదిగురువులని చెప్పుచున్నారు. అది సరి కాదు. సూర్యుడు యాజ్ఞవల్క్యునకు శుక్లయజుర్వేదమును బోధించినట్లు యాజ్ఞవల్క్య చరిత్రచెప్పుచున్నది. యాజ్ఞవల్క్యుడు జనకునకు, గార్గికి, మైత్రేయికి జ్ఞానమార్గమును బోధించినట్లు బృహదారణ్యకోపనిషత్తునందు గలదు. యాజ్ఞవల్క్యుడు రచియించిన శతపథబ్రాహ్మణము కర్మ కాండను ప్రతిపాదించుచున్నది. ఇంతకుమించి యాజ్ఞవల్క్య డెచ్చట నచలపరిపూర్ణ భావమును బోధించినట్లు కనబడదు. అచలగురుపరంపరకు శ్రీమన్నారాయణు డాదిగురువని చెప్పుచు, గురుపరంపరాస్తోత్రములో "ఓంనమో బ్రహ్మాదిభ్యో" అని ప్రారంభించుట యనుచితముకాదా! ఇంతకు శ్రీమన్నారాయణు డాదిగురువా? బ్రహ్మదేవు డాదిగురువా? మారి బృహద్వాశిష్ఠ సిద్ధాంతమని చెప్పుకొనుచు, గురుపరంపరలో నా వశిష్ఠుని పేరును విస్మరించుట కృతఘ్నతకాదా!

పరమశివు డచలపరిపూర్ణ సిద్ధాంతమును బ్రహ్మదేవునకు బోధించిన ట్లనంతోపనిషత్తునందుగలదు. బ్రహ్మ తన మానసపుత్రుడైన వశిష్ఠున కద్దానిని బోధించెను. వశిష్ఠుడు శ్రీరామచంద్రున కజాతసిద్ధాంతమును బోధించినట్లు బృహద్యోగ వాశిష్ఠమునందుగలదు. అతడే జనకునకుకూడ బోధించెను. అందువలన నిది బృహద్వాశిష్ఠ సిద్ధాంత గురుపరంపర యన బడుచున్నది. మేమీ యాధారములతో గురుపరంపరను నిర్ణయించి, యుందుపొందుపఱచితిమి. పాఠకు లిందలి యుక్తాయుక్తములు నరసి తెలిసికొందురుగాక!

# సద్గురు పరంపరా స్తోత్రము

ఓం నమశ్శివాదిభ్య, శ్శివప్రబోధి తానంతోపనిష చ్ఛిద్ధాంత ప్రబోధక సంప్రదాయ కర్తృభ్యో, వంశర్షిభ్యో, మహద్భ్యో, నమో గురుభ్యః ॥

నిరస్త సమస్త సంసారోపప్లవ కళంక, సచ్చిదానం దాతీతాచల పరిపూర్ణ పరమ శివ శాన్తి ప్రద, శ్రీ మనచల పరిపూర్ణ సద్గురు పరంపరా స్తోత్రం కరిష్యే.

ఈశ్వరం పరమేష్ఠిం చ, వశిష్ఠం జనక ప్రభుం ।
శుకం సాందీపనిం కృష్ణం, చోద్ధవం చ సదాభజే ॥ 1

బ్రహ్మానందాఖ్య యోగీంద్రం, రామానంద గురూత్తమం ।
కబీరుం వేమనార్యం చ, శ్రీధర స్వామినం భజే ॥ 2

దీక్షితం శివరామాఖ్యం, రామకృష్ణయ్య సద్గురుం ।
శ్రీ వీరయ్య మహేశార్యం, కోటప్ప దేవరం భజే ॥ 3

శేషాచల గురుం నార, సింహార్యం రంగయ ప్రభుం ।
బ్రహ్మానంద యతీంద్రంచ, సద్గురు ప్రవరాన్ భజే॥ 4

సర్వేశ్వర సమారంభాం, శ్రీకృష్ణోద్ధవ మధ్యమాం ।
బ్రహ్మానందార్య పర్యంతాం, వందే గురుపరంపరాం ॥ 5

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

(శ్రీ బ్రహ్మానందీయ భావార్థదీపికాసహితము.)

## 1. స భా వి జ్ఞా ప న

కం॥ జనులార ! జనన మరణము । లను దొలగం
ద్రోయజాలు - లక్షణయుతమై । వినువారికి గనువారికి ।
తన లావెరిగించు దీన్ని - తప్పకవింటే * అప్పుడెవార
లెప్పుడుగంటే * కనుక వినబుద్ధయితే - వినుడు చదివెద
మీకే । కనుగొన మనసైతె - కనుడీ పుస్తకమంత । తప్పక
వింటే* అప్పుడెవార - లెప్పుడుగంటే * 1

భా॥ శిష్యుడు :- అయ్యా ! "నిర్విఘ్న పరిసమాప్తి కామో మంగళ మాచరేత్" గ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తి నొందవలయునని కోరువాడు గ్రంథారంభమున మంగళాచరణము చేయవలయునని శ్రుతి చెప్పుచున్నది. ఆ శ్రుతి ననుసరించి శిష్టులు ప్రవర్తించుచున్నారు. ఆ మంగళాచరణము కూడ "ఆశీ ర్నమ స్క్రియా వస్తు నిర్దేశో వాఽపి తన్ముఖమ్" "ఆశీర్వాదము, నమస్కారము, వస్తునిర్దేశము" అని మూడువిధములు. ఇందు తన యిష్టదైవ మీగ్రంథమును నిర్విఘ్నముగ పరిసమాప్తిని పొందించునుగాక ! అని కోరుట ఆశీర్వాదము. ఇష్టదైవమునకు నమస్కారమును తెలుపుట

నమస్కారము. "సగుణవస్తు నిర్దేశము, నిర్గుణవస్తు నిర్దేశము" అని వస్తునిర్దేశము రెండువిధములు. ఇందు ఈశ్వరుడు సృష్టి స్థితి లయములకు కారణభూతుడని ప్రతిపాదించుట సగుణవస్తు నిర్దేశము. పరమాత్మయే ప్రత్యగాత్మయని ప్రతిపాదించుట నిర్గుణవస్తు నిర్దేశము. ఈ త్రివిధ మంగళాచరణములలో దేనినైనను గ్రంథారంభమున జేయుట శిష్టాచారము, శ్రుతి సమ్మతము నగును. ఈ గ్రంథకర్త శ్రుతిని, శిష్టాచారమును పాటింపక, జనులార! అని మానవ సంబోధనముతో గ్రంథమును ప్రారంభించుట అనుచితముకాదా!

గురు:—బిడ్డా! మానవుల కమంగళకరము, ననర్థదాయకము నగునది జననమరణాది సంసారము. ఈ యమంగళకర సంసారము నేదేవుడు నివృత్తి చేయజాలడు. సగుణ నిర్గుణ రూపులగు దేవుళ్లందఱీ యమంగళకర సంసారమునం దభ్యుదయమును కలిగింతురే కాని, దీని నివృత్తి చేయజాలరు. ఈ గ్రంథ మా జనన మరణాది యమంగళకర సంసారమును నివృత్తిచేసి పరమశాంతిని చేకూర్చెడి లక్షణము కలిగి యున్నది. ఇట్టి యుత్తమగ్రంథ శ్రవణమే మంగళప్రదమని తలంచి, గ్రంథకర్త జనులారా! అనగా—జననమరణములుగల వారలారా! ఈ యుత్తమ గ్రంథము మీ జనన మరణాది సమస్త సంసారదుఃఖములను బోగొట్టి, శాశ్వత శాంతిని కలిగించెడి లక్షణము కలిగి యున్నదని ప్రారంభించినారు.

ఈ లక్షణ మను విశేషణము 'వినువారికి' అను పదముతో చేర్చినచో లక్షణయుక్తులై వినువారికి అను

సర్థము వచ్చును. శ్రవణరూపమగు నంగికి 'స్వరూపోప కార్యంగము, ఫలోప కార్యంగము' అని రెండంగములు గలవు. ఇందు స్వరూపోప కార్యంగమును శ్రవణమునకు పూర్వము సంపాదింపవలయును. ఫలోప కార్యంగము శ్రవణానంతర మనుష్ఠింపవలయును. పాపకర్మ వాసనారూప మగు మలదోషమును, కామ్యకర్మ వాసనాజన్యమగు విక్షేప దోషమును లేనివారై, సాధనచతుష్టయ సంపత్తిని సంపా దించుట శ్రవణరూపాంగికి స్వరూపోప కార్యంగము. ఈ యంగమును సంపాదించిన వానికి శ్రవణము సిద్ధించును. శ్రవణముచేసిన యర్థమును బాగుగా మననముచేసి, నిశ్చిత మైన దానిని చింతించుట నిదిధ్యాస యనబడును. మనన నిది ధ్యాసలు రెండును శ్రవణరూపాంగికి ఫలోప కార్యంగము. దీనివలన శ్రవణఫలము సిద్ధించును. ఇందు శ్రవణముయొక్క స్వరూపోప కార్యంగమును సంపాదించిన యుత్తమాధి కారులు లక్షణయుతులు. లక్షణయుతులైన యుత్తమాధికారు లీ యుత్తమ గ్రంథము నచలపరిపూర్ణులైన సద్గురువునలన శ్రవణముచేసినచో నిది వారి జనన మరణభ్రాంతిని తొల గించును. ఈ గ్రంథముయొక్క యథార్థ తాత్పర్యమును సద్గురునివలన తెలిసికొనినచో నీగ్రంథముయొక్క గొప్ప దనము తెలియగలదు.

ప్రత్యక్షముగ కనిపించెడి నేను నేనులు రెండును తానుకాదు. నేను నేనుల భ్రాంతివలననే సమస్త సంసార దుఃఖములు సంభవించుచున్నవి. నేను నేనులభ్రాంతిని విడు

నగా స్వతస్సిద్ధమై శేషించియున్న అచలపరిపూర్ణ బ్రహ్మమే తాను. తనకు దేశ కాల వస్తుకృత పరిచ్ఛేదములు గాని, సజాతీయ విజాతీయ స్వగతభేదములుగాని లేవు. సర్వదేశములయందును, సర్వ కాలములయందును, సమస్త వస్తువులయందును స్వతస్సిద్ధమై సంపూర్ణముగ నిండియున్న తన గొప్పదనము నీ గ్రంథ మెఱిగించుచున్నది. ఇట్టి సుప్రసిద్ధమైన యీ యుత్తమ గ్రంథమును మీరు వినదలంచినచో నేను చదివెదను. మీరు దీనిని శ్రద్ధగా వినుడు. ఈ గ్రంథమునందు ప్రతిపాదింపబడిన అచలపరిపూర్ణ బ్రహ్మమును, ఎఱుక జగములను, వాసిని విడిచెడి మార్గమును నెఱుగదలచినచో పూర్ణగురువుల నాశ్రయించి తెలిసికొనుడు. అట్లు తెలిసికొనినచో మీ జనన మరణరూపముగు సమస్త సంసార దుఃఖములు నశించి, శాశ్వత శాంతి చేకూరును. 1

కం॥ వినవలెనని కనవలెనని। మనసందున కోర్కెగల్గు - మనుజులె వినుడీ। వినజేసెద కనజేసెద। ఘనమగు నీబోధ విన - కననొల్లనట్టీ * మనుజులచను దొ - చ్చిన త్రోవబట్టి* తినుమంటె పులియొల్ల - దని లోకు లనవింటి। గనుకనే వినవలె - నన నోరాడదు విన । కననొల్లనట్టీ * మనుజులుచను దొ - చ్చినత్రోవబట్టి * 2

తా॥ మానవులారా! మీకీ గ్రంథమును వినవలయునని కోర్కె కలిగినచో దీనిని శ్రద్ధగా మీరు వినుడు. నేను

మీకు చక్కగా వినిపించెదను. వినిన పిదప నీ గ్రంథము నందు ప్రతిపాదింపబడిన యర్థమును మీకు తెలియ దలంచి నచో మీకు నేను సమగ్రముగ దెలిపెదను. తెలిసికొనుటకు గొప్పదియగు నీ పరిపూర్ణబోధను వినవలయునని కాని, దీని యర్థమును తెలిసికొన వలయునని కాని మీకు కోర్కి జనింప నిచో మీరు వచ్చినత్రోవనే యింటికి వెళ్లి, మీరిదివఱకు చేయుచుండినట్లే నిషిద్ధ కామ్యకర్మోపాసనాదులను జేయుచు, జననమరణములను కలిగించెడి మార్గమునే యనుసరింపుడు. అట్లుకాక నిష్కామముగ విహిత కర్మోపాసనాదుల నొనర్చి మలవిక్షేపములు లేనివారై, సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించినచో నా యొద్దకువచ్చి ఈ యుత్తమ గ్రంథమును వినుడు. నేను మీకు చక్కగా వినిపించెదను.

పూర్వ మొకానొక యరణ్యములో నొక పెద్దపులి యొక ఆవును బట్టుకొని దానినిచంపి తినుటకు ప్రయత్నించినదట. అప్పు డాయావు పెద్దపులిని ప్రార్థించి, నేనింటికివెళ్ళి నాబిడ్డకు పాలిచ్చి, దాని నితరగోవుల కప్పగించి వెంటనేతిరిగివచ్చి మీ కాహార మయ్యెదనని నచ్చజెప్పినదట. అంత నా పెద్దపులి ఆ యావునందు విశ్వాసముంచి యట్లేపోయిరమ్మని చెప్పగా, నది త్వరగా నింటికేగి, తనబిడ్డకు పాలిచ్చి, దానికి కొన్ని నీతులు బోధించి, దానిని తోడియావుల కప్పగించి, మరలనరణ్యము నకు తిరిగివచ్చి, పెద్దపులి కెదురుగా నిలువబడి, అయ్యా! ఇక నన్నుభక్షించి నీయాకలి తీర్చుకొనుమని ప్రార్థించినదట. అంత నాపెద్దపులి ఆ యావుయొక్క సత్యసంధతకు మెచ్చి,

నిన్ను తినుటకు నా మనస్సొప్పుటలేదు. నీవు నీ యింటికివెళ్ళి నీ బిడ్డతో సుఖముగా నుండుమని చెప్పి పంపినదట. ఈ విషయమును లోకు లనుకొనుచుండగా నేనువింటిని. అట్లే నేను మిమ్ములను ఈగొప్పదియగు పరిపూర్ణబోధను వినుడనియు, దీని యథార్థ తాత్పర్యమును గాంచుడనియు ప్రార్థించినను మీకు ఇష్టములేనిచో దీనిని మీరు విననే వినరు. దీని యథార్థ తాత్పర్యమును గాంచవలయుననియు తలంపకుగదా !

కం॥ నను మిము నేగని పుస్తక । మును జేసితి
దీన్ని మీరు - ముదమున వినుడం । చనుటయు మిము
ననుమీరలు। గనుగొని వినిపించుమనుట - కలయిట్టిమాట*
బోధను మేల్కొ - గనలేదెచ్చోట * ఘనులార యిటువంటి -
కలలోముచ్చటలాడి । గొనకొని మీరు మే - ల్కొని
మేల్కొల్పుడునన్ను । కల యిట్టిమాట * బోధనుమేల్కొ-
గనలేదెచ్చోట * 3

తా॥ పరిపూర్ణస్థితియే పరమార్థజాగ్రత్త. దానియందు మూలములేకయే నామరూపనటనాత్మక ప్రపంచ, ప్రపంచ జ్ఞానములుగా తోచెడి యొుక భ్రాంతియే స్వప్నము. ఆస్వప్న ప్రపంచములో నేను, నీవు, వాడు, వీడు, అది, ఇది అనెడి భేదములు తెలియవచ్చుచున్నవి. ఆ స్వప్నములో తోచిన నేను; నన్నును, మిమ్ములను వేఱు వేఱుగాజూచి, నేను చావుపుట్టుకలులేని మార్గమును దెలిపెడి యొుక గొప్ప గ్రంథ

మును రచియించితిని. దానిని నేను చక్కగా చదివి విని పించెదను. మీరు సంతోషముతో దానిని శ్రద్ధగా వినుడను చుంటిని. ఆకలలోనే తోచిన మీరుకూడ, మిమ్ములను, నన్ను ను వేలు వేలుగాచూచి మీరు మాశాగ్రంథమును చక్కగా వినిపింపుడు. మేము దానిని శ్రద్ధగా వినెద మను చుంటిరి. ఇట్లు నేనీ గ్రంథమును మీరు వినుడనుటయు, మీరు వినిపించుడనుటయు కల. పరిపూర్ణ స్థితి యనెడి జాగ్రత్తయందు బోధించెడి గురువుగాని, బోధించుమనెడి శిష్యుడుగాని, బోధ గాని లేవు. ఎఱుకయనెడి కలలోపలనే మనము గురుశిష్యులుగా తోచి, నావలన మీరు పరిపూర్ణ బోధను పొంది, ఎఱుక జగ ములనెడి కలను వీడి, పరిపూర్ణ స్థితియనెడి మెలకువను గని నచో మీరును, మీకలలో దోచిన నేనును, బోధయు మటు మాయమై పోవును. అప్పు డచలపరిపూర్ణ జాగ్రత్తయందు గురుశిష్యులుగాని, వారి బోధలుగాని లేవు. 3

కం॥ ఒరు లొరులు నేను నేనని । యొరులను తన నెన్న దెరుగ-కున్న బయలులో । నరుదెంచి తన్ను తాగని । పరులనుగని తెస్ప నేను - పరులని యనుచు* ఎరిగే యెరుకే - బయలుండ గనుచు * నిరతము తానెందు - నిలువ కుండుటకునై । విరచి స్తి దీన్నెరుక - వినెనా నిల్వడునేను। పరులని యనుచు * ఎరిగే యెరుకే - బయలుండ గనుచు*4

తా॥ తన్నుగాని, ఇతరులనుగాని యెఱుగక, రూప

నామ గుణ క్రియలులేక స్వతస్సిద్ధముగా నిండియున్న బట్ట బయలులో, రూప నామ గుణ క్రియాత్మకమగు జగత్తుతో గూడి, తనకై తానేతోచి, దేహేంద్రియాది జడసంఘాతమే తాననియు, దేహసంబంధులైన పుత్ర మిత్ర కళత్రాది బంధువులు తనవారనియు, ధన ధాన్య గృహారామ క్షేత్రాదులు తనవనియు, యితరదేహధారులు పరులనియు, యితరములగు ధనధాన్య గృహారామక్షేత్రాదులు పరులవనియు తలంచుచు, నేను, నాది, నీవు, నీదియని తగవులాడుచు, తనవని తలంచెడి వానికి కలిగెడి హానివృద్ధులు తనకే కలిగినట్లు భావించుచు, నానావిధ సుఖదుఃఖముల ననుభవించుచు నుండెడి యొుక నిరాశ్రయముగ నుండజాలదు. అది తనచే కల్పింపబడిన రూప నామముల నాశ్రయించుకొని యుండును. ఎటుకతోవచ్చి, యొుకచే తెలియబడెడి రూపనామములే యొుక కాశ్రయములు. ఆశ్రయములగు రూపనామములను విడిచినచో రూప నామములులేని యచల పరిపూర్ణబ్రహ్మమునందీ యొుక నిరాశ్రయముగ నిలువనేరదు. స్వతస్సిద్ధముగ నిండియున్న బట్ట బయలగు కేవలాత్మయునికి నెఱింగినచో మూలము లేకయే తోచుచున్న ఎటుక జగంబులెందును నిలువజాలవని యొుకుగుట కొఱకే నేనీ గ్రంథమును రచియించితిని. 4

కం॥ ఎరుకను కలలోపల నే । నరుదెంచితి మీర లట్టు - లరుదెంచితి రీ । యెరుకజన నేను మీరలు । ఎరుకతొ జనువారమనుచు - నెరిగేటికొరకు * గ్రంథముజేస్తి -

నెరిగియీావరకు * గురుబోధంచనుమేల్కొ - నరులార చే
కొంటె। నెరుకానె కలజోలి - నెరిగిన నిల్వాదం। చెరిగేటి
కొరకు * గ్రంథముజేస్తి - నెరిగి యీావరకు * 5

భా॥ ఎఱుకతోవచ్చిన ప్రపంచ మెఱుకవలననే తోచుచున్నది. ఆ యెఱుకకు ప్రపంచ మాశ్రయ మగుచున్నది. మరల ఎఱుకతోనే ప్రపంచము పోవుచున్నది. ఎఱుక ప్రపంచములు రెండున్ను ఒకదానిని విడిచి మఱియొకటి యుండనేరవు. ఆ యెఱుకయనెడి కలలోపలనే నేను తోచుచుంటిని. అటులనే మీారును తోచుచుంటిరి. కావున నేనును, మీారును నెఱుకతోనే వచ్చితిమి. మరల నెఱుకతోనే పోవుదుము. శ్రీసద్గురుని బోధవలన నచలపరిపూర్ణ కేవలాత్మ స్థితియనెడి మెలకువను గనినచో నెఱుకయను కలగాని, ఆ కలలోదోచెడి నేనుగాని, మీారుగాని యుండమని విస్పష్టముగా దెలియుటకొఱకే యీా గ్రంథమును రచియించితిని. ౫

కం॥ శ్రీమించు నచలబోధను। నేమహానీయుండు
జేసి - యెగజల్లెనొ యీా। భూమిన్ సుజనులకొర కా।
రాముడు గన్వయజశివ - రామదీక్షితులన్ * తలచి యప్పా-
రావు గుణతతులఁ * ప్రేమతొబాగడీ నే - భూమి నిర్జర
పరశు। రామా సీతారామ - స్వామికి మ్రొక్కి శివ। రామ
దీక్షితులఁ * తలచి యప్పా - రావు గుణతతులఁ * 6

భా॥ అధికారులైన సత్పురుషులు సంసారసాగరమును

తరించునిమిత్త మనాదిసిద్ధము, నత్యుత్తమమునగు నచల పరిపూర్ణబోధను లోకమున విశేషముగా ప్రచారమొనర్చిన శ్రీ రామడుగు శివరామదీక్షితులవారిని మనంబునదలంచి, శ్రీవారి శిష్యులలో నొకరగు శ్రీకంబాలూరి అప్పారావుగారి సుగుణములను ప్రేమతో వినుతించి, వారి శిష్యాగ్రగణ్యులును, భూసురశ్రేష్ఠులును నగు శ్రీ పరశురామ సీతారామస్వామివారికి సాష్టాంగ దండప్రణామము లాచరించి యీ గ్రంథమును రచియింప బూనితిని. 6

కం॥ శ్రీమ త్సీతారామ । స్వామికృపస్ జెప్పనయ్యే – సదసద్రహితం । బేమిపదార్థమొ దానిని । ఈ మహి కందార్థములుగా – నివివినరయ్యా * ఓజనులారా – యిటుగనరయ్యా * వేమారు నేమిమ్ము – వేడేదింతియ సుమ్మి । నామీద కృపజేసి – ననుజదువుమని మీర । లివి వినరయ్యా * ఓజనులారా – యిటుగనరయ్యా * 7

భా॥ ఈ ప్రపంచమునగల మానవులలో పరమార్థమును కొందఱు సత్తనుచున్నారు. కొంద ఱసత్తనుచున్నారు. మఱికొందఱు సదసత్తనుచున్నారు. వేఱుకొంద అనుభయమనుచున్నారు. నేను శ్రీసీతారామస్వామివారి కృపచే సత్తు, అసత్తు, సదసత్తు, అనుభయముకాని యచల పరిపూర్ణ బ్రహ్మమును కందార్థదరువులతో బోధించుచున్నాను. కావున నోమానవులారా ! నేను మిమ్మేమియు కోరుటలేదు. మీరు

నాయందు దయయుంచి నన్ను చదువుమని దీ ని ని మీ రు శ్రద్ధగావినుడు. వినినపిదప నిందు తెలుపబడిన యచలపరిపూర్ణ బ్రహ్మమును తెలియవలయునని కోరికగలిగినచో తెలిసి కొనుడు. 7

కం॥ శివరామదీక్షితుల శి । ష్యవరుం డప్పయ్య
మంత్రి - యతనిసిసువు డీ । భువి పరశురామ వంశో ।
ద్భవ సీతారాము లతని - భ క్తుడనుమ్మి * తద్బోధ ప్ర -
యు క్తుడనుమ్మి * స్తవనీయులగు మీ రు - త్సాహముతో
నీబోధ । వినుకీ నేనిది కందా - ర్థములచే వినిపింతు ।
భ క్తుడనుమ్మి * తద్బోధ ప్ర - యు క్తుడనుమ్మి * 8

భా॥ ఈ యచల పరిపూర్ణ బోధను ప్రపంచమున విస్తారముగా వ్యాపింపజేసినవారు శ్రీమద్రామడుగు శివరామ దీక్షితులవారు. వారిశిష్యులలో నొకరు కంబాలూరి అప్పారావుగారు. వారిశిష్యులలో నగ్రగణ్యుడు పరశురామ సీతారామ స్వాములవారు. ఆ సీతారామ స్వాములవారికి నేను భ క్తుడను. ప్రియశిష్యుండను. శ్రీవారిచే బడసిన యచల పరిపూర్ణ బోధయందు ప్రవ ర్తించువాడను. స్తవనీయులైన మీరు సంతోషముతో నీయచలపరిపూర్ణ బోధనువినుడు. నేను మీకు కందార్థదరువులుగా వినిపింతును. 8

కం॥ మనసిచ్చి వినుడి యిక నొక । మన విది నా
పాలిగురుని - మదిలోపల నే । నునుచుకొని పెద్దలా

జ్ఞను । పనిబూనుక చేస్తినిట్టి - పద్యములిన్ని * తప్పొ
ప్పు లేర్పడదిద్దుడన్ని * ఘనమతిమంతులు - గనుక నే
ప్రార్థిస్తి । నను మీకటాక్షేక్ష - ణముల వీక్షింపుచు ।
పద్యములిన్ని * తప్పొప్పు లే - ర్పడదిద్దుడన్ని * 9

భా॥ సుగుణసంపన్నులారా ! మీరు నాయందు భేద బుద్ధినుంచక మనసారవినినచో నేను మీకొక మనవిచేసి కొనెదను. నేను సద్గురుస్వామిని హృదయకమలమునందు నిలుపుకొని, పెద్దల యాజ్ఞానుసార మీ శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థదరువులను రచియించితిని. బుద్ధిమంతులు వీని నా మూలాగ్రము చదివి, నా మీద మీకరుణాకటాక్షవీక్షణము నుల బఱపి, యీగ్రంథమునందలి తప్పులను, ఒప్పులను వేఱు పఱచి, తప్పులను ఒప్పులుగా దిద్దెదరని ప్రార్థించుచున్నాను.9

కం॥ విని మీరివి దిద్దుండని । పనిబడి ప్రార్థింప
నేల - పరుసము నిను మి । ట్లనునే స్వర్ణముజై మని ।
తనకై తానౌను సన్ని - ధానమందుండె * తెల్పుడి యను
- మానమిందుండె * మనవిజేయునె పాలి - మ్మని లేగ
తల్లికి । తనకై తానిచ్చును - దయచేసి తాసన్ని - ధాన
ముందుండె * తెల్పుడి యను - మానమిందుండె * 10

భా॥ ఈకందార్థదరువులను మీరు చక్కగావిని సరి దిద్దవలయునని నేను ప్రయత్నపూర్వకముగా మిమ్ములను ప్రార్థించుటెందులకు ? ఇనుము తన్ను బంగారముగా జేయు

మని పరుసవేదిని ప్రార్థించవలసిన పనిలేదుగదా ! పరుసవేది సమీపమునందున్న ఇనుము తనకుతానే బంగారమగుచున్నది. మఱియు లేగదూడ తనకు పాలిమ్మని తల్లిని ప్రార్థింపక పోయినను తన సమీపమునందున్న లేగకు ఆవు తానే స్వయముగా పాలిచ్చుచున్నది. అట్లే బుద్ధిమంతులైన నహారు నేను కోరకపోయినను దీనినిజూచి వారే దయతో తప్పులను వేలుపజచి సరిదిద్దుదురు. 10

కం॥ అప్పకవీ యాద్యాంధ్రము । లొప్పగు మాఘాది కావ్య - మొగిచదివి కృతిన్ । తప్పని కవులను సమముగ । తప్పులు లేకుండ జెప్ప - తరమౌన కృతిని * ఊహాను జేస్తి - మరి నేనీకృతిని * గొప్పాపక్షులతోటి - కొదువ పక్షులు సాగె । సప్పురవీథిని - కూయ్యాపె టందుకు । తరమౌన కృతినీ * ఊహానుజేస్తి - మరినేనీకృతినీ * 11

భా॥ వసుచరిత్ర, మనుచరిత్ర మొదలగు తెలుగు కావ్యములు, మాఘాది సంస్కృతకావ్యములు, అప్పకవీయాది లక్షణ గ్రంథములు, బాలప్రౌఢాది వ్యాకరణ గ్రంథములు మొదలగువానిని చదివి కవిత్వము చెప్పెడి పండిత కవులతో సమముగ తప్పులులేకుండ కవిత్వముచెప్పుటకు నా తరము కాదు. నాకు సంపూర్ణమగు భాషాజ్ఞానము లేకపోయినను నేను నాసద్గురునివలన గ్రహించిన పరిపూర్ణబోధనూహించి యీ గ్రంథమును రచియించితిని. హంస, గరుడపక్షి మొద

లగు గొప్పపక్షులు ఆకాశమునందు సంచరించెడి విధమున, కాకి, పిచ్చుక మొదలగు అల్పపక్షులు సంచరించుటకు సాధ్య ముకానట్లు, కావ్య వ్యాకరణాది గ్రంథములను చదివిన పండిత కవులవలె భాషాజ్ఞానములేని నేను కృతిని రచియించుటకు సమర్థుడను కాను. 11

కం॥ ఛందంబెరుగర పద్యము । లెందున జేసెద వటంచు - నెందరనిన నే । సందేహింపక చేసితి । నెం దుల తప్పుంటె మీర - లివి సైదేరనుచు * నేజదివితే - చెవియొగ్గి వినుచు * అందముగా చి త్త - మందిట్లు రల పోసి । కందార్థములను మీ - ముందర పెట్టితి । నివి దిద్దే రనుచు * నేజదివితే - చెవియొగ్గి వినుచు * 12

భా॥ కావ్య వ్యాకరణ ఛందో గ్రంథములను చదువక వానియందు చెప్పబడిన లక్షణములను డెలియక యీకందార్థ దరువులను నీవెందుకు రచియించుచుంటివని నన్నెంద ఱాక్షే పించినను, నేను సందేహింపక యీగ్రంథమును రచియించి తిని. బుద్ధిమంతులైనవారు నేనీగ్రంథమును చదువుచుండగా, శ్రద్ధగావిని, దీనియందున్న భాషాదోషములు, ఛందోదోష ములు మొదలగువానిని సరిదిద్దుదురని మనస్సునందు తలం చియే యీగ్రంథమును రచియించి మీముందర నుంచితిని. 12

కం॥ పునరు క్తి గలిగియుండిన । విని కోపము చేయ వలదు - వేడుకొనియెదఁ । వినువారు దూరపర్థము । గన

వలె దగ్గరనటంచు - గల్పించినాను ✱ తెలియకరాదీ - గ్రంథ
ములోను ✱ జననీజనకులు తమ - తనయుల పునరుక్తి -
వినగోరుదురు తప్పం - చ నక నేనది తెలిసి । కల్పించినాను
✱ తెలియకరాదీ - గ్రంథములోను ✱ 13

తా॥ ఒకపర్యాయము చెప్పిన శబ్దమును మరల మరల చెప్పుట శబ్దపునరుక్తి. అట్లే యొకపర్యాయము చెప్పిన అర్థమును మరల మరల చెప్పుట అర్థపునరుక్తి. ఈ రెండువిధములగు పునరుక్తులు గ్రంథములయందు వచ్చుట దోషములని పెద్దలనెదరు. శుద్ధనిర్గుణతత్త్వ కంబార్థ దరుపు లనెడి యీగ్రంథమునం దనేక తావులలో శబ్దపునరుక్తులు, అర్థపునరుక్తులు గలవు. ఈ పునరుక్తి దోషములను గూర్చి మీరు నామీద కోపము చేయవలదని నేను మిమ్ములను వేడుకొనుచున్నాను. ఈ పునరుక్తులు దోషములని తెలిసియే నేను చేసితిని. దుర్విజ్ఞేయమగు ఈ గ్రంథార్థమును జిజ్ఞాసువులు సులభముగా గ్రహించుటకొఱకే అట్లుకల్పించితిని కాని, తెలియక కల్పించలేదు. లోకములో తల్లిదండ్రులు తమ బిడ్డలు మరల మరల చెప్పెడి ముద్దుమాటలనువిని సంతోషింతురే కాని, వారి మాటలయందు పునరుక్తిదోష మున్నదని క్రోధపడ్చరుగదా ! 13

కం॥ ఇదియాంధ్ర కవిత్వంబని । మదిరోయంద
గదు దీని - మర్మమరయుడీ । పదియారు వన్నెపసిడిని ।
మునమున తోల్పెట్టెనుంచ - ముట్టనందురుగా ✱ లోకులు

చేత - బట్టకుండుదురా * ఇదిగాక కులహీను - డిచ్చిన
ద్రవ్యము । విదితముగా నెంత - వేత్తలైనను దాన్ని -
ముట్టకుండుదురా * లోకులు చేత - బట్టకుండుదురా * 14

భా॥ పండితులైన మీరు ఇది తెలుగు కవిత్వమని మనస్సులో నసహ్యభావమును పొందవలదు. మనకు దీనిలోని భావము ప్రధానముగాని, భాష ప్రధానముకాదు. తన హృదయములోనున్న భావమును లోకుల కర్థమగునటుల నేభాషలోనైనను జెప్పవచ్చును. మీరీ కందార్థములయందు భాషాదృష్టిని విడిచిపెట్టి, దీనిలోని భావమును మాత్రము చక్కగా గ్రహింపుడు. పదియాఱువన్నె బంగారమును తోలుపెట్టిలో నుంచినను దానివన్నె తఱిగిపోదుగదా! దానిని లోకులు గ్రహింపకుందురా? ఇచ్చట బంగారము ప్రధానముగాని, తోలుపెట్టె ప్రధానము కాదుగదా! ఇదియునుగాక, కులహీనుడిచ్చిన ద్రవ్యమును నెంతటి శ్రేష్ఠులైనను గ్రహింపకుందురా! ఇందు ద్రవ్యము ప్రధానముగాని, ద్రవ్యమునిచ్చువాడు ప్రధానుడు కాడుగదా! అట్లే యీ కందార్థములయందున్న భావము ప్రధానముగాని, భాష ప్రధానము కాదని తెలియవలెను. 14

కం॥ ఆసాంతం బీగ్రంథము । ప్రాస యతుల్ శబ్ద
గణము - భావము యుక్తుల్ । చూచి సరిపడనిచోటను ।
ఈసభలో పెద్దలెల్ల - నివి దిద్దవలెను * దిద్దినది నా -

మదికందవలెను * మీసాటివారికి - వేసాటలే దుండె।
నాసాటి వారి బ్ర - త్కేసాటి గాకుండు। ఏవిదిద్దవలెను *
దిద్దినది నా - మది కందవలెను * 15

భా॥ ఈసభయందుగల పెద్దలు ఈ గ్రంథమును సాంతముగావిని శ్రద్ధగాచదివి, దీనిభావమును చక్కగా గ్రహించిన పిదప నిందలి యతి గణ ప్రాసలను, శబ్దములను, భావములను యుక్తులను చక్కగా విమర్శించి సరిగా లేనిచోట వానిని దిద్దవలయును. ఆ దిద్దిన యంశము నా భావమునకు సరిపోవలెను. ఇట్లు దిద్దుటయందు పెద్దలైన మీరు విసుగు పొందకుడు. మీవంటి మహాత్ములకే విసుగు కలిగినయెడల నావంటివాని బ్రదుకేపాటిదగును ? 15

కం॥ తప్పొప్పులు రెండున్నరుగని। తప్పుతనం
దుండి దీన్ని - తప్పనికూసే। తప్పుతునరునకు జెప్పెద।
చప్పుడు చాలించుకునుచు - సభవారువినగ * సరెసరెనని -
సభవారిట్లనగ * చెప్పిన వినకుండె - తప్పువానిదె కు
మ్మి। తప్పుకలిగినవెనుక - గొప్పవాడెట్లౌను। సభవారు
వినగ * సరెసరెనని - సభవారిట్లనగ * 16

భా॥ తప్పులేవియో, యొప్పులేవియో యెఱుగని తప్పు తనయందుంచుకొని, ఈర్ష్యాసూయలతో నీకందార్థదరువుల యందు తప్పులున్నవని చెప్పెడు తప్పుడు జనులమాటలు తప్పుమాటలే యగునుకాని, సరియైనవికావు. అట్టి తప్పుడు

కూతలుకూసెడి తప్పుడు జనులతో, నీ సభలోనున్న పెద్ద లందఱు వినుచుండగా, ఇక నీతప్పుడు కూతలను చాలించుమని యెంతచెప్పినను వినక యింకను తప్పని కూయుచుండినచో నాతప్పు వానిదేయగును. తప్పుకలిగినవాడు గొప్పవాడెట్లగును ? కానేరడు. 16

కం॥ ఇలుజొచ్చి గ్రామసింహము । కలదొంతులు
గూల్చు నింటి - గరిత లొరుగుదొం । తులు చక్కఁజేతు ర
ట్లనె । ఇల సుకవిజనోక్తి తప్పు - లెంచు దుర్జనుడు *
తప్పొప్పు గా-వించు సజ్జనుడు * తులలేని బుద్ధిమం - తులు
సర్వజ్ఞులు మీరు । తెలియు నాతలపు నే-దెలిపేదేమిక తప్పు।
లెంచు దుర్జనుడు * తప్పొప్పు గా - వించు సజ్జనుడు * 17

భా॥ కుక్కలు ఇంటిలోదూరి దొంతిగానున్న కుండలను పడద్రోయుచుండును. ఆయింటిలోనున్న స్త్రీలు మరల వానిని జక్కఁబఱచుచుందురు. ఆవిధముగనే దుర్జనులు సత్కవుల గ్రంథములయందు ఒప్పులనువిడిచి, తప్పులనే వెదకుచుందురు. సజ్జనులు సద్గ్రంథములయందు ఒప్పులనే గ్రహించుచు, నెచ్చటనైన తప్పుకనిపించినచో దాని నొప్పుగా సవరింతురు. సాటిలేని బుద్ధిమంతులు, సర్వజ్ఞులునగు మీరు నా యభిప్రాయము తెలిసియే యుందురు. నేను మీకు వేఱుగా చెప్పవలసిన దేదియులేదు. నేను చెప్పకపోయినను సర్వజ్ఞులైన మీరే యెచ్చటనైనను ప్రమాదవశమున తప్పులు దొరలినచో నాభావము ననుసరించి వాని నొప్పులుగా సవరింతురు. 17

కం॥ తనగొప్ప నెంచరేమో । జనులని తలపోసి సా
ధు - జనకృత కవితల్ । విన డితరులు వినగోరిన ।
విన కనరాదనుచు మనసు - విరుచు దుర్జనుడు * విని విని
పించు - వేడ్క సజ్జనుడు * కనవచ్చే ముంజేతి - కంకణా
లను వేరె । ఘన నిల్వుటద్దము - గావలెనా మనసు ।
విరుచు దుర్జనుడు * విని వినిపించు - వేడ్క సజ్జనుడు * 18

భా॥ సత్కవుల కృతులను వినినచో జనులు తన్ను గొప్పవానినిగా దలంపరను నుద్దేశముతో దుర్జను డాకృతులను తాను వినడు. ఇతరులు వానిని వినగోరినచో నందులో విశేషమేమున్నది? దానిని వినినచో మీబుద్ధులుకూడ చెడిపోవునని దుర్బోధలుచేసి యితరులనుగూడ విననీయడు. సజ్జనులు సత్కవుల కృతులను శ్రద్ధగావిందురు. వారు వినుటయే కాక, ఆగ్రంథములను తాము చదివి యితరులకుకూడ వినిపింతురు. కనిపించెడి ముంజేతి కంకణములను జూచుకొనుటకొఱకు మెఱుగుటద్ద మవసరములేని విధమున, సజ్జనులయొక్కయు, దుర్జనులయొక్కయు భావము తెలుసుకొనుటకు వేఱు తార్కాణము లవసరములేదు. 18

కం॥ ఆగామి కథయెట్లన । బాగుగ వివరింతు చెవుల-
పండువుగాగన్ । ఆగమ నిగ మోపనిష । త్సాగర మథితార్థ
మెల్ల - సాంగోపాంగముగన్ * దయతో వినుమి - సాంగో
పాంగముగన్ * ప్రాగర్థ చరమార్థ - యోగములకును సం।

యోగము గావించి - నే గు ర్తెరిగినదంత । సాంగోపాంగ
ముగా * దయతోవినుడి - సాంగోపాంగముగా * 19

భా॥ ఇదివఱకు మీరు జననమరణరూపమగు సంసారమును గలిగించెడి కర్మోపాసనాది మార్గములను దెల్పెడి బోధలను వినియుంటిరి. ఇప్పుడు మీకు జనన మరణరూపమగు సంసారమును బోగొట్టెడి యచల పరిపూర్ణ బోధను మీమనస్సుల కానందము కలుగునట్లు వినిపించెదను. మీరు దీనిని శ్రద్ధగావినుడు. ఇది 'వేదములు, శాస్త్రములు, ఉపనిషత్తులు' అనెడి క్షీరమహాసముద్రమును చక్కగాతఱచి, వాని సారము ననుభవరూపముగ గ్రహించి, మీకానందము కలుగునటుల వేద శాస్త్రోపనిషత్సారమైన నాయనుభవమును సాంగోపాంగముగ మీకు వినిపించెదను. మీరు నాయందు దయయుంచి వినుడు. ఏ యచలపరిపూర్ణ బ్రహ్మము రూప నామ గుణక్రియాత్మకమగు జగద్భ్రాంతి కలుగకపూర్వమును, భ్రాంతి నశించినపిమ్మటను స్వతస్సిద్ధముగ నున్నదో, ఆ యచలపరిపూర్ణ బ్రహ్మమే భ్రాంతికాలము నందుకూడ దేశ కాల వస్తు కృత పరిచ్ఛేదములును, సజాతీయ విజాతీయ స్వగత భేదములు ను లేక స్వతస్సిద్ధమై యున్నది. ఆ యచలపరిపూర్ణ బ్రహ్మమే సర్వ వేద శాస్త్రోపనిషత్తులను మథించి నేను తెలిసికొనిన సారము. దానినే నేను మీకు విశదముగా తెల్పెదను. శ్రద్ధగా వినుడు. 19

కం॥ మోహమున బ్రొద్దుపోకకు । వాది ప్రతివాదు

లగుచు - వరగురుశిష్యుల్ । వాదించిరనుచు నొక సం ।
వాదము కల్పిస్తి కలగా - వదలక వినుడీ * మొదటినుండి -
తుదవెళ్లగనుడీ * వేదాంతార్థాతీత - వేత్తలు మీరింద ।
ఏదేని సవరించు - డిదె నావిజ్ఞాపన । వదలక వినుడీ *
మొదటినుండి - తుదవెళ్లగనుడీ * 20

భా॥ పొల్లుముచ్చటలతో ప్రొద్దుపుచ్చక, సంతోషము గా పరమార్థ విచారణతో కాలముగడుపుటకొఱకు ఉత్తము లైన గురుశిష్యులు వాది ప్రతివాదులుగానుండి ప్రశ్నోత్తర రూపముగ వాదమొనర్చిరని గురుశిష్య సంవాదరూపముగ నీ గ్రంథమును రచియించితిని. దీనిని కలయని వదలివేయక మొదటినుండి చివరవఱకు శ్రద్ధగావినుడు. వేద వేదాంతార్థాతీతు లైన మీరిందలి భావమును చక్కగా నెఱింగి, దీనిలో భ్రమ ప్రమాదాది దోషములేమైన నున్నచో వానిని సవరింపుడని కోరుచున్నాను. 20

కం॥ కొంచెముతో సరిపుచ్చక । పెంచితి నీగ్రంథ
మనుచు - పెద్ద లలుగక । మించినవేడ్కను వినుడీ ।
పెంచిన యర్థమును నేదె - ల్పెద లోపలెల్ల * అర్థము దె
లిసి - మదినుల్లసిల్ల * పెంచితి పెంచితి - కొంచెము వెత
లుపు । ఉంచుటకు నదిలోపం - చెంచి నామదిని దె । ల్పెద
కోపలెల్ల * అర్థముదెలిసి - మదినుల్లసిల్ల * 21

భా॥ ఈగ్రంథమును నేను కొంచెములో సరిపెట్టక, విపు

లముగా పెంచి వ్రాసితినని, పెద్దలు కోపగించుకొనవలదు. ఇం దు ప్రతిపాదింపబడిన యచలపరిపూర్ణ భావ మతిగంభీరము, ము ర్విజ్ఞేయము నగుటచే దీనిని సర్వమానవులు సులభముగ తెలిసి కొనుట కష్టసాధ్యమని తలంచి, దీనిని విశదముగ తెలిసికొని సంతోషించుటకొఱ కతిగూఢమైన యీ యచలపరిపూర్ణ భా వమును విపులముగా తెలియునట్లు విశేషముగా నీ గ్రంథమును పెంచి వ్రాసితిని. 21

ఇది, శ్రీమద్యాగవతోల కృష్ణదేశికప్రభు విరచిత శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దరువులయందు 'సభావిజ్ఞాపనము' ప్రథమాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకా చార్యవర్య, స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురుమహారాజ్ వారి చే రచియింపబడిన భావార్థదీపికా సహితము.



## 2. గురుశిష్యాన్యోన్య దర్శనము.

కం॥ సాధన సంపత్తియుగల । సాధకు డొకనరు డు ఘోర - సంసారమునఁ । బాధపడలేక తన పు । ణ్యోదయమున గురునిగాంచి - యురుతరభక్తిఁ * శర ణనిమ్రొక్కి - మరిమరియు భక్తిఁ * బోధజేయుము పుణ్య - పురుషా మాబోంట్లకు । సాధింపదగు ముఖ్య - సాధనము ని పల్కె । యురుతర భక్తిన్ * శరణనిమ్రొక్కి - మరి మరియు భక్తిన్ * 22

భా॥ తీవ్రమోక్షాపేక్షగల మానవుఁడొకఁడు నిషిద్ధ కామ్య కర్మోపాసనలను పరిత్యజించి, ఫలేచ్ఛారహితముగ విహిత కర్మోపాసనాదులను, యోగయోగాంగాభ్యాసమును నొనర్చి, పాపకర్మ వాసనారూపమగు మలమును, కామ్యకర్మ వాసనారూపమగు విక్షేపమును లేనివాఁడై, వేదాంతశాస్త్ర శ్రవణమునకు పూర్వమునందుగల స్వరూపోప కార్యాంగమైన "నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థఫల భోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము" అను సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించి, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడైన గురువర్యునిచే వేదాంతశాస్త్రమును శ్రవణముచేసి, శ్రవణోత్తరకాలమునందు ఫలోపకార్యాంగమైన మనననిదిధ్యాసల నొనర్చి, తత్త్వంపదార్థముల నన్వయవ్యతిరేక పూర్వకముగ శోధించి తెలిసికొనిన పిదప, సద్గురునివలన మహావాక్యములను శ్రవణముచేసి, యఖండబ్రహ్మాత్మతత్త్వ జ్ఞానమును పొందినప్పటికి, నతనికి వాసనాక్షయ మనోనాశనములు కలుగక పోవుటచే, నతనిమనస్సునందున్న వాసనలుద్బుద్ధములైనప్పు డా యుద్బుద్ధ వాసనానుసారముగ నతనిమనస్సు బాహ్యప్రపంచ, ప్రపంచజ్ఞానములుగ పరిణమించుచున్నది. జీవుఁడప్పుడీ దేహేంద్రియాది సంఘాతము తాననియు, దేహసంబంధులైన స్త్రీపుత్రమిత్ర ధనధాన్యాదిపదార్థములు తనవనియు, నవిసత్యములు, సుఖసాధనములనియు తలంచి, వానితో సంబంధపడి, వానియందుగల మోహపాశముతో వానికి బంధింపబడి, వానికికలిగెడి హానివృద్ధులు తనకేకలిగినట్లు భావించి, నానావిధములైన సం

సార దుఃఖముల ననుభవించుచున్నాడు.

ఇట్లుండగా ఒకానొకసమయమున తనపూర్వపుణ్య విశేషముచే నతనికి సమస్తసంసార దుఃఖములను నివృత్తిచేయగల పూర్ణగురుసార్వభౌముడు లభించెను. అప్పుడీఘోర సంసార దావానలతప్తుడైన జిజ్ఞాసు వాపూర్ణ గురుసార్వభౌముని గాంచి, యతనికి తనతనుమనధనములనర్పించి, చతుర్విధ శుశ్రూషలొనర్చి, భక్తిప్రపత్తులతో శరణాగతుడై, సాష్టాంగ దండప్రణామము లాచరించి; వినయవివేకవిధేయతలతో, మహాత్మా! నేనిదివఱకెందఱో గురువులనాశ్రయించి, యెన్నియోసాధనలు చేసితిని. చివరకు తత్త్వంపదార్థములను శోధించి, వాని లక్ష్యార్థములైన ప్రత్యక్పరమాత్మల యథార్థ స్వరూపములను తెలిసికొంటిని. అటుపిమ్మట శ్రోత్రియ బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడైన యద్వైతగురునివలన మహావాక్యములను శ్రవణముచేసి, యఖండ బ్రహ్మజ్ఞానమును పొందితిని. ఎన్నిసాధనలు చేసినను నామనస్సునకు శాంతికలుగలేదు. ఈ ఘోరమైన సంసారదుఃఖములు నశించుటలేదు. ఇదివఱకు నేనుచేసిన సాధనలుకాక, ఇంక నేనేసాధనలు చేసినచో నా సంసారదుఃఖములు నశించి, పరమశాంతికలుగునో అట్టి ముఖ్యమైన సాధనను నాకు బోధింపుడని యడిగెను. 22

కం॥ శరణాగతుడగు శిష్యుని । కరుణామృతదృష్టి చేల - గనిమోదము, ము । ప్పిరిగొన మృదువాక్యముల ను । పరమదయాళుండు గురుడు - భక్తవినుమనెను * సం

శయమింక - బాధింపదనెను * పరిపూర్ణమొకటిలే - నెఱు
వనేదొక్కటి। పరిపూర్ణమెరుకల - నెరిగి యెరుకనుమాను।
భక్తివినుమనెను * సంశయమింక - బాధింపదనెను * 23

భా॥ "శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము" అని భక్తితొమ్మిదివిధములు. వీనిలో దాస్యభక్తి, సఖ్యభక్తి, ఆత్మనివేదనభక్తి ప్రశస్తములు. ఆంజనేయుడు శ్రీరామచంద్రునియందు నెఱపినది దాస్యభక్తి. అర్జునుడు శ్రీకృష్ణభగవానునియందు నెఱపినది సఖ్యభక్తి. రాధ శ్రీకృష్ణభగవానునియందు నెఱపినది ఆత్మనివేదనభక్తి. భక్తులన్నిటికంటె నాత్మనివేదనభక్తి అత్యుత్తమము. దీనినాత్మార్పణము, శరణాగతి, ప్రపత్తియనియునందురు. గురునియొద్ద చేరెడిశిష్యులు "భక్తుడు, భాగ్రుతుడు, ప్రపన్నుడు" అని మూడువిధములుగ నుందురు. ఇందుమలవిక్షేపములు లేనివాడును, సాధనచతుష్టయ సంపత్తిగలవాడును, సమస్తసద్గుణ గణగరిష్ఠుడును, సద్గురుని వినయభయభక్తులతో సేవించువాడును, ఆంజనేయునివలె నతడుచెప్పిన కార్యముల నతిశ్రద్ధతో నాచరించువాడునునగు నుత్తమశిష్యుడు దాస్యభక్తుడు. అట్లే మలవిక్షేపములు లేనివాడై, సాధనచతుష్టయ సంపత్తిని సంపాదించి, సమస్తసద్గుణ గణగరిష్ఠుడై, సద్గురునియందు వినయభయభక్తి శ్రద్ధలతో, నతడు చెప్పకపూర్వమే యతనియుద్దేశములను గ్రహించి కార్యముల నెఱవేర్చుచు, సద్గురునిదోషంబుల నెంచక, వాని నితరుల

కు తెలుపక, వారికి మజ్జనభోజనశయ్యాసనాదులను సమర్పించి, వారివిసర్వవిధముల ఛత్రమునవలె కాపాడుచు, సజ్జనునివలెసఖ్య భక్తిగలవాఁడు సుగ్రీవుఁడు. అష్టమలవిక్షేపములులేనివాఁడై, సాధన చతుష్టయ సంపత్తికలిగి, సమస్త సద్గుణగణగరిష్ఠుఁడై, సద్గురుని వినయభయభక్తిశ్రద్ధలతో సేవింపుచు, నతనికి తనతనుమనధన ములనర్పించి, యతని సమస్తకార్యములు సమర్థతతో నెరవేర్చుచు రాధాదేవివలె నవవిధభక్తిగలవాఁడై, యతనికి చతుర్విధ శుశ్రూష లొనర్చుచు సర్వార్పణబుద్ధితో సేవించువాఁడు ప్రపన్నుఁడు. ఇట్టి సమస్తసద్గుణ గణగరిష్ఠులై, పరమార్థమును గోరెడి సచ్ఛిష్యులనే సద్గురువులు నిరంతరము కోరుచుందురు. ఆ కోరికయే వారికి ప్రియము. వారికోరికప్రకారమట్టి యుత్తమశిష్యులు లభించినప్పుడు వారికి కలిగెడి సంతోషము మోదము. అట్లులభించిన యుత్తమశిష్యులకు తాము పరమార్థమును బోధించునప్పుడు కలిగెడి సంతోషము ప్రమోదము. ఇట్టి యుత్తమశిష్యులు లభించినప్పుడు సద్గురువులకు ప్రియమోదప్రమోదములు మూడును ముప్పిరిగొని, వారిని పరవశులనుజేయును. ఆ సంతోషముతో వారాయుత్తమశిష్యులపై నమృతమయమగు ప్రేమరసమును వెదజల్లుచు, వారిని మనస్సుచేతను, దృక్కుచేతను స్పర్శచేతను తరింపజేయుదురు.

తాఁబేలు గ్రుడ్లనుపెట్టి, పిల్లలనుచేసినపిదప తానెచ్చట సంచరించుచున్నను నా పిల్లలమనస్సు తల్లియందే లగ్నమై యున్నచో నా తాఁబేలు తనమనస్సులో పిల్లలను తలంచినంత మాత్రముచే తనే వానియాకలి తీరిపోవుచున్నది. అట్లే యు

ఉత్తమశిష్యుడు తనకు జ్ఞానోపదేశముచేసిన సద్గురువు దేశమునం దుండినను నతని మనస్సెల్లప్పుడు సద్గురుని పాదపద్మముల యందులగ్నమై వారధిగా నిలిచియున్నదో, సద్గురుని యమృత సంకల్పమువలన, నతడమృతత్త్వమును పొందుచున్నాడు. దీనిని మనోదీక్ష యందురు. చేపలు గ్రుడ్లనుపెట్టి యాగ్రుడ్లను తదేక దృష్టితో వీక్షింపగనే యాగ్రుడ్లుచిట్టి పిల్లలగుచున్నవి. అట్లే యుత్తమ శిష్యుడు సద్గురుని సమీపమునందుండి నిరంతర మతని స్వరూపమును లక్షించుచు, నేకాగ్ర చిత్తముతో నున్నచో సద్గురు వతనిని కరుణామృత దృష్టితో వీక్షింపగనే యతడమృతత్త్వమును పొందుచున్నాడు. ఇది దృగ్దీక్ష యనబడును. పక్షులు గ్రుడ్లనుపెట్టి వానిని పొదుగుటచే నవి చిట్టి పిల్లలగుచున్నవి. అట్లే యుత్తముడైన సచ్ఛిష్యుడు గురుపాదములయందు లక్ష్యముంచి, యేకాగ్రచిత్తుడై యున్న సమయమున సద్గురుమూర్తి యతని మస్తకమునందు తన అమృతహస్తమునుంచి మంత్రోపదేశముచేయగనే యతడమృతత్త్వమును పొందుచున్నాడు. ఇది స్పర్శదీక్ష యనబడును.

సద్గురుమూర్తి తన్నాశ్రయించిన యుత్తమశిష్యునకీ త్రివిధ దీక్షల నొసంగించి, మృదుమధుర వాక్యములతో జననమరణరూపమగు సంసారసముద్రమును దాటించెడి పరమార్థబోధను చేయదలంచి, యతనితో, శిష్యా! నీవిక యీ ఘోరమైన సంసారదుఃఖము పోవునా? పోదా? యనెడి సంశయమును పొందకుము. నీవు నేనుచెప్పిన విధముగ మొదట స్వాత్మస్థమై నిలిచియున్న అచలపరిపూర్ణ బ్రహ్మము నెఱుంగుము.

ము. అటువిస్మృట మూలములేకయే నానావిధ నామరూప నట నలుగానొంచి, నానావిధ భ్రాంతులను గలిగించుచున్న యొుుక స్వరూపము నెఱుంగుము. ఈ యొుుక యున్నంతవఱకు దీని యందు సమ స్తవిషయ వాసనలుండును. ఆ వాసన లుద్బుద్ ములైనప్పుడా వాసనానుసారముగ నీ యొుుక సమస్త ప్రపం చముగను, ఆ ప్రపంచములోని నామరూపనటనలుగను, వాని నెతిగెడి జ్ఞానములుగను పరిణమించి, యనిసత్యములనియు, సుఖసాధనములనియు భ్రమించి, వానితోబంధ మేర్పఱచు కొని, నానావిధ సంసారదుఃఖములను పొందుచున్నది. కావున నా యొుుక లేకపోయెడి మార్గము నెఱుంగుము. అప్పుడు నీ సం శయములన్నియు పటాపంచలై పోవున నెను. 23

కం॥ ఏసాధన నీకెందుకు । వీసానికి పనికిరాదు - వినుమూ యయ్యా । నే సాధులచేవిన్నది । యేసాధనలేని బోధ - నెరిగింపుపోకు * సాధనలందు - మురిగితేరాకు * ఏ సాధనలజోలి - యేనొల్లనని నీవు । బాసచేసితి వేని - పరిపూర్ణబోధనే । నెరిగింతుపోకు * సాధనలందు - మరి గితేరాకు * 24

భా॥ బిడ్డా ! నీకు యమనియమాసన ప్రాణాయామ ప్ర త్యాహార ధారణాధ్యానసమాధుల నెడి యోగాంగముల వలన గాని; మంత్ర, లయ, హఠాదియోగముల వలనగాని; ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి అనెడి ముద్రలవలన

గాని; నాదానంద, కేవలానంద, కుండలీయోగములవలనగాని; అణిమ, గరిమ, లఘిమ, మహిమ మొదలగు సిద్ధులవలనగాని, పంచవిధ తారకాభ్యాసనులవలనగాని, దహరశాండిల్యాది విద్యలవలనగాని, సాంఖ్యవిచారణ, తత్త్వంపదార్థశోధన, మహావాక్యార్థబోధ మొదలగువాని వలనగాని, ఇంక నేవిధమునైన సాధనలవలనగాని ఘోరమైన యీ సంసారదుఃఖములు నశింప నేరవు. ఇవియన్నియు నీ విదివఱకే యాచరించి యుంటివి కావున నికనీకు వీనితో పనిలేదు. ఈ సంసారదుఃఖములు నశించుటకీ సాధన లేవియు పనికిరావు. నేను పెద్దలవలన నేసాధనలు లేని యచలపరిపూర్ణ బోధనువిని గ్రహించియుంటిని. ఆ యచల పరిపూర్ణ బోధను నేనునీకు తెలిపెదను. నీకు ఇంకను సాధనలు చేయవలయునను అపేక్షయుండినచో నీవు నా యొద్దకు రాకుము. సాధనలుచెప్పెడి గురువులయొద్దకే పొమ్ము. ఇకమీాద నీవేసాధనలజోలికి పోనని నాతో ప్రమాణము చేసినచో నేను నీకేసాధనలులేని యచలపరిపూర్ణ బోధనెఱిగించెదను. దాని నెఱుంగదలంచినచో నాయొద్దనుండుము. నీబుద్ధి సాధనలయందే మఱిగియున్నచో నాయొద్దకు రాకుము. వెళ్లిపొమ్ము. 24

కం॥ గురువరపరిపూర్ణంబన । నెరుకననివి రెండునెట్టి-వెరుకోద్భవమెం । దెరుకచనుచోటు నెయ్యది । యెరుకను నేనెట్లు విడిచే - దెరిగింపు మనెను * అట్ల నెగురు - దెరిగింతుననెను * చరణమూశిని రెంకు - కరములగొని తన ।

శిరమున ధరియించి - శరణని యాశిష్యు । డెరిగించు మ
నెను * అట్లనెగురు - డెరిగింతుననెను * 25

భా॥ గురుదేవా ! మీరు సెలవిచ్చిన అచలపరిపూర్ణ బ్రహ్మమెటువంటిది? దానియందు లేని యెఱుక యెటులదోచుచుండును ? దానిస్వరూప స్వభావములేమి ? ఈ లేనియెఱుక యెచ్చటనుండి పుట్టినది ? ఇది తిరిగి యెచ్చటికిబోవును ? ఈ లేనియెఱుకను నేనెట్లు విడువగలను ? ఈవిషయముల నన్నిటిని వివరముగ దెలుపుడని ప్రార్థించుచున్న శిష్యునిజూచి, శ్రీ సద్గురువు, బిడ్డా ! నీకీవిషయములన్నియు వివరముగా చెప్పెదను. సావధానచిత్తముతో వినుమనెను. ఆ మాటను వినినతోడనే యా శిష్యుడపరిమితానందముతో, సాష్టాంగ దండ ప్రణామము లాచరించి, శ్రీ గురుదేవుల పాదపద్మముల ధూళిని తనరెండుచేతులతో తీసికొని, కన్నులకద్దుకొని, శిరస్సున ధరియించి, స్వామీ ! మిమ్ములను శరణుపొందిన యీ శిష్యుని కటులనే యెఱిగించి, జననమరణ ప్రవాహమును దాటింపుడనెను. 25

కం॥ మొదలచలము నెరిగించెద । విదితముగాలేని
యెరుక - వివరింతుపయిన్ । తుదకెరుకను విడిపించెద ।
మదిలో నామాటనమ్మి - మరివింటివేని * చంచలబుద్ధి -
మానుంటివేని * పమగురునినుజూచి - భళి! సెబాసిత్రోవ ।
కెదురులేదనేటట్లు - లిదిగోనేజేసెద । మరివింటివేని * చం
చలబుద్ధి - మానుంటివేని * 26

భా॥ శిష్యా! నీవు చంచలబుద్ధిగలవాడవై యితరము లగు చిల్లరబోధలయందు నీ మనస్సును పోనీయక, దృఢ చిత్తముతో నామాటయందు విశ్వాసముంచి వినినచో నేను నీకు మొదట స్వతస్సిద్ధముగ నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మము నెఱిగించెదను. అటుపిమ్మట మూలములేకయే తోచెడి యెఱుక స్వరూపస్వభావములను తెలిపెదను. ఆపైన ఎఱుకను విడిచెడి మార్గమును బోధించెదను. నీవు నామాట యందు నమ్మకముంచి శ్రద్ధగావినుము. ఏ సంశయమును నీ మనస్సునందుంచకుము. ఈ పరిపూర్ణ బోధకంటె గొప్పది యగు బోధయెచ్చటనులేదు. చంచలబుద్ధిగల వాని కీబోధ తెలి యుటకష్టము. నిశ్చలచిత్తముతో నీవీబోధను వినినచో లోకు లందఱు నిన్నుజూచి, భళి! సెబాస్ ! ఈ యచలపరిపూర్ణ బోధతో సమానమైనదిగాని, గొప్పదిగాని యీ ప్రపంచమున లేదు. నీ పూర్వపుణ్య విశేషమునలన దుర్లభమైన పరిపూర్ణ బోధనుపొందితివని లోకులునిన్ను శ్లాఘించునట్లు చేసెదను.26

కం॥ మీరంతవారు గనుకనె । చేరితి మీపాద సేవ -
సిద్ధించుటకై । యేరింతవారు జగమున । లేరని నామదికి
దోచె - తెప్పగవినుడీ * ఆజ్ఞకుమీర - లేమకనుగొనుడీ *
ఏ రీతివినుమంటె - నారీతి వినియెద । మీరానతీయండి -
తోరాపు యీబోధ । తెప్పగ వినుడీ * ఆజ్ఞకు మీర - లేమ
కనుగొనుడీ * 27

భా॥ గురుదేవా ! దేవరవారంతటి ప్రభావముగలవారు గనుకనే నేను మీపాదసేవకుడనైతిని. లోకములో మీయం తటి గొప్పమహానుభావులు లేరని నామనస్సునకు చక్కగా తెలియవచ్చినది. మీ యాజ్ఞ కణమాత్రమైనను మీరను- మీరుచన్నే రీతిగా వినుమనిన నారీతిగానే వినెదను. దేవరవారు నాకాగొప్పదియగు పరిపూర్ణ భావమును చక్కగా బోధింపు డనెను. 27

కం॥ మొద్దులనైనను దొలుతురు । బద్ధుల బద్ధత్వ మడవి - పాల్పేతురుమీ । యొద్దకువచ్చిన గనిపని । శుద్ధపు బోధో క్తమైన - సూక్తులుగుప్పి * అందుకుతగిన - యు క్తులుజెప్పి * పెద్దలచే మీ ప్ర - సిద్ధిని వచ్చితి । దిద్దుడి నేవట్టి - బుద్ధిహీనుడ నన్ను । సూక్తులు గుప్పి * అందుకు తగిన - యుక్తులుజెప్పి * 28

భా॥ స్వామీ ! గొప్పపనితనముగల వడ్రంగి యెంత గట్టిగానున్న మొద్దులనైనను, బాడితతో చెక్కి, ఉలితో తొ లిచి, సుందరమైన దేవతావిగ్రహములను తయారుచేయునట్లు, దేవరవారెంతటి మందబుద్ధిగలవారినైనను, ఎట్టి బద్ధులనైనను తమ పరిశుద్ధమైన బోధచేత తీర్చిదిద్ది, వారిబంధములను త్రెం చివేసి, పరమశాంతిని కలిగించెదరు. లోకములో పశువు లొక్క త్రాటిచేత నొక్కకట్టుగొయ్యకు మానవులచే బంధిం పబడుచున్నవి. కాని అజ్ఞానులైన మానవ పశువులు స్వయ

ముగ ననేకవిధములగు బంధములను కలిగించుకొనుచున్నారు. ఆ బంధములవలన నానావిధములగు దుఃఖములను పొందుచున్నారు.

అందు ప్రధానముగ నజ్ఞానికి కలిగెడి బంధములు మూడువిధములు. కొందఱు స్థూలదేహమే తామని తలంచి, యాస్థూలదేహమనెడి స్తంభమునకు బంధింపబడి నేను స్త్రీని, పురుషుడను, నపుంసకుడను అని తలంచుచున్నారు. మఱియు నీ స్థూలశరీరమునందు గల వాతపైత్య శ్లేష్మములవలన సంభవించెడి సమస్తవ్యాధులును, ఇతరప్రాణుల వలనకలిగెడి క్లేశములును, దైవికముగా సంభవించెడి యుపద్రవములును తమకే కలుగుచున్నవని తలంచి, నానావిధ దుఃఖముల ననుభవించుచున్నారు. ఇంతియేకాక, యీ స్థూలదేహసంబంధులగు పుత్రమిత్ర కళత్రాది బంధువులు తమవారనియు, ధనధాన్య గృహారామ క్షేత్రాదులు తమవనియు తలంచి, వానితో బంధమేర్పఱచుకొని, అవివృద్ధి పొందుచున్నప్పుడు తామే వృద్ధిపొందుచున్నట్లు తలంచుచున్నారు. అవి క్షీణించుచున్నప్పుడును, నశించుచున్నప్పుడును తామే క్షీణించుచున్నట్లును, నశించుచున్నట్లును తలంచి నానావిధ దుఃఖముల ననుభవించుచున్నారు.

మఱికొందఱు స్థూలదేహము తాముకాదు. దానిలోనున్న జీవుడే తామనుకొని, యాజీవుడనెడి స్తంభమునకు బంధింపబడి, తాము పుణ్యపాపకర్మములను జేయుచు, వాని ఫలములైన సుఖదుఃఖముల ననుభవించుట కొఱకు స్వర్గనర

కాది లోకములకు పోవుచు, నా లోకములయం దనుభవింపగా మిగిలిన కర్మ శేషమునకు భూమియందు పుట్టుచు, నానావిధము లగు దుఃఖముల ననుభవించుచున్నారు.

ఇంకకొందఱు జడమగు దేహముగాని, పుణ్యపాపకర్మ ములు చేయు జీవుడుగాని తాముకాదనియు, వీనికిసాక్షి.గానున్న ప్రత్యగాత్మయే పరబ్రహ్మమనియు, నా ప్రత్యగభిన్న పరబ్ర హ్మమే తామనియు తలంచి, యాబ్రహ్మమను స్తంభమునకు బంధింపబడి, మరల తమయందున్న వాసనాను సారముగ బహిర్ముఖులై, బాహ్యపదార్థములతో బంధమేర్పఱచుకొని నానాదుఃఖముల ననుభవించుచున్నారు.

ఇందు దేహాత్మబుద్ధిగలవారు దేహమనెడి స్తంభము నకును, దేహసంబంధములైన స్త్రీపుత్ర ధనధాన్య గృహా రామక్షేత్రాదిరూప స్తంభములకును బంధింపబడుచున్నారు. జీవాత్మబుద్ధిగలవారు జీవుడనెడి స్తంభమునకు బంధింపబడు చు న్నారు. బ్రహ్మాత్మబుద్ధిగలవారు బ్రహ్మమనెడి స్తంభమునకు బంధింపబడుచున్నారు. ఇందు దేహాదిరూపములగు స్తంభ ములు ఇనుప స్తంభములవంటివి. జీవరూపమగు స్తంభము ఇత్తడి స్తంభమువంటిది. బ్రహ్మరూపమగు స్తంభము బంగా రపు స్తంభమువంటిది. ఇందు స్తంభములలో తారతమ్యము తెలియబడుచున్నదికాని, బంధమునందే తారతమ్యము కాన వచ్చుటలేదు.

దేవరవారు అనేకవిధములగు నుపమానములతోను, యుక్తులతోను, పరిశుద్ధమైన యచలపరిపూర్ణ బోధనుదెలిపి,

బద్ధులయొక్క సమస్తబంధములను పోగొట్టగల సామర్థ్యము
గల వారని పెద్దల వలన మీ గొప్పదనమును, మీ కీర్తినివిని,
మీ పాదసన్నిధికిచేరి, మిమ్ముల్లను శరణుపొందితిని. అత్యంత
మందబుద్ధి గల వాడనగు నన్ను కరుణించి, నాకాపరిపూర్ణ
బోధను ఉపమానములతోడను, యుక్తులతోడను బోధించి,
నా బంధములనన్నిటిని త్రెంచి, నన్నుకడతేర్చు భారము తమ
దే యని ప్రార్థించెను. 23

కం॥ సూటిగను బోధనాపుది । నాటినదిక చాలు
చాలు - ననినీకై నీ । నోటను బలికెడుదాకను । చాటువలను
జెప్పుచుందు - సరెనా నామాట * రాగోరుచు - మరి నేనీ
మాట * మాటికొక్కటి సేయు - మాటాని తెలియుము ।
మాటిమాటికి పట్టి - పాటలేమిటికింక । సరెనా నామాట *
రాగోరుచు - మరినేనీమాట * 29

భా॥ బిడ్డా! లోకములోనున్న మతబోధలన్నియు
డొంకతిరుగుడు మార్గములవలెను, బీరపీచు చిక్కువలెను నుం
డును. ఈ పరిపూర్ణబోధ అటువంటిదికాదు. ఇది సూటిగా
అచల పరిపూర్ణబ్రహ్మమును, సర్వదుఃఖముల కాలవాలమగు
నెఱుకను, ఆ యెఱుకను విడిచెడి మార్గమును దెలుపును. ఇట్టి
పరిపూర్ణబోధను నీకు నేననేకయుక్తులతోను, ఉపమానముల
తోను నీ బుద్ధికి చక్కగా దెలియునట్లు సూటిగా చెప్పెదను.
నీవు నాకీబోధ చక్కగా తెలిసినది, అనుభవమునకు కూడ
వచ్చినది. మీ కిక బోధింపవలసిన పనిలేదని నీయంతట నీవు

నీనోటితో చెప్పవలకు నీకు నేను బోధించుచుందును. ఈ పరి శుద్ధమైన పరిపూర్ణ బోధను విడిచిపెట్టి, శుష్క్రప్రియముల తోను, పాటలతోను, పద్యములతోను ప్రొద్దుపుచ్చి నందు వలన ప్రయోజనముండదు. నందలాదిగానున్న మేకలమంద నొక్క సింహము నాశము చేయగలుగునట్లు, నందలాదిగానున్న నీసమస్త సంశయము లొక్కపరిపూర్ణబోధ నాశము చేయ గలదు. కావున నీవు దీనిని శ్రద్ధగావినుము నేను. 29

కం॥ తానే నవకనునిండిన । దానికి పేరేమి ? బ
యలు - తానేననుచుణ । నేననియెడ నేనెవ్వరు । లేనెరు
కవు, వుంటె, వుంటే - లేనేలేననుమీ ✻ అంటిని, అంటే -
లేనేలేవునుమీ ✻ లేనేలేనని నేను - లేకపోయిన వెనుక ।
తానుండుగద, వుంటె - దాన్నెట్లెరిగెద వీవు । లేనేలేనను
మీ ✻ అంటిని, అంటె, - లేనేలేవు నుమీ ✻ 30

తా॥ (ఈకందార్థము ప్రశ్నోత్తర రూపముగనున్నది.)

ప్రశ్న :- "తాను, నేను, నీవు, వాడు, వీడు, అది, ఇది" అనియనక, దేశకృత, కాలకృత వస్తుకృత పరిచ్ఛేద ములుగాని, సజాతీయ విజాతీయ స్వగతభేదములుగాని లేక, సర్వత్ర స్వతస్సిద్ధముగ నిండియున్న దానిపేరేమి ?

ఉత్త :- అది నామరూప క్రియాత్మకమగు స్థూలప్ర పంచ ముండుటనకాశమిచ్చిన భూతాకాశముగాని, వాసనా రూపమగు సూక్ష్మప్రపంచము గల చిత్తాకాశముగాని, పుట్టి

నశించెడి సంకల్పములకును, పుట్టబోవు సంకల్పములకును మధ్యనుండి వానినెఱింగెడి చిదాకాశముగాని కాక, యేమియు లేక, యేగుణములను పొందక, యేపదార్థమునుగాక స్వత స్సిద్ధమై నిండియున్న నిరాకాశము. నిరాకాశమనగా ఏమియు లేని, ఏమియుకాని యుత్త బట్టబయలు.

ప్రశ్న :– "తాను, నేను, నీవు, వాడు, వీడు, అది, ఇది" అని నిరంతర మనుచుండెడి నేనెవ్వరు ?

ఉత్త :– నీవు మూలములేకయే నామరూప నటనలుగా తోచుచుండెడి లేనియొఱుకవు. నీకు మూలమెచ్చటను లేదు. అచల పరిపూర్ణ బ్రహ్మము నిర్వికారమగుటచే నది నీకు కారణము కాజాలదు. జీవేశ్వరజగత్తులు నీవలననే తోచుచుండుటచే నవియు నీకు కారణములు కాజాలవు. నీవలన దోచుచున్న ప్రపంచమే నీకాశ్రయము. నీవులేనిచో ప్రపంచము లేదు. ప్రపంచము లేనిచో నీవుండవు. నీవు నీవలన తోచిన ప్రపంచము నాశ్రయించుకొనియున్న ఎఱుకస్వరూపుడవు. ఎఱుకస్వరూపుడనగు నీవును, నీతోడనేవచ్చి, నీచేతనే ప్రకాశింపబడుచు, నీకాశ్రయమైయున్న ప్రపంచమును సర్వదా సర్వథా లేకయే తోచుచున్నవి. కావున నీవులేనియొఱుకవు.

ప్రశ్న - "తాను, నేను, నీవు, వాడు, వీడు, అది, ఇది" అనుచుండెడి నేనుంటినిగదా! ఇక నేను లేకపోవుటెట్లు ?

ఉత్త :– లేకయే ఉన్నట్లు తోచుచున్న నీకు మూలమెచ్చటనులేదు. మఱియు నిరాకార పదార్థము నాశ్రయించుకొని యుండువుగాని, నిరాశ్రయముగ నుండజాలవు. కావున నీవు

లేని దానవేయగుదువు. మూలము లేకయే తోచుచు, నిరాశ్రయముగా నుండజాలని పదార్థములెప్పుడు లేనివియేకదా !

ప్రశ్న :- మీరు చెప్పినట్లు నామూలమును విచారించితిని. కానినాకు మూలమెచ్చటను కనిపించుటలేదు. నేనచ్చటినుండి వచ్చితినో, తిరిగి యెచ్చటికి పోయెదనో తెలియుటలేదు. అదియునుగాక నేను తోచుచున్నప్పుడుకూడ నేదేనియొకపదార్థము నాశ్రయించుకొనియే యుండెదను. నిరాశ్రయముగనుండజాలను. కావున నేనెప్పుడు లేకనే తోచుచుంటినని మీబోధవలన నెఱింగితిని.

ఉత్త :- అట్లు తెలిసికొనిన పిదప నీవెచ్చటను, ఎప్పుడును లేనేలేవుగదా ?

ప్రశ్న :- నిజమే. నేను మూలము లేకయే తోచుచుంటిని. తోచినప్పుడుకూడ నిరాశ్రయముగ నుండజాలను. కావున నేనెప్పుడు లేనిదానవేయగుదును. ఇట్లు తెలిసికొని నేను లేకపోయినపిదప నచలపరిపూర్ణ బ్రహ్మము స్వతస్సిద్ధముగ నిండియుండును గదా !

ఉత్త :- అచలపరిపూర్ణ బ్రహ్మము స్వతస్సిద్ధముగనిండియున్నను నీలేమిని తెలిసికొని నీవు లేకపోయినపిమ్మటదానిని నీవెట్లెఱుగుదువు ? అది యున్నదనికాని, లేదనికాని యెఱుగునదిలేదు. అది "యున్నది, లేదు" అను నిర్ణయము లేక స్వతస్సిద్ధముగ నిండియున్నది. నీవు నీలేమి నెఱింగి లేకపోయినపిదప దాని నెఱుంగు వారెవ్వరు లేరు. 30

కం॥ మీరాజ్ఞయిచ్చియుంటిరి । నేరుపుతో బయలు

నెరుక - నెరిగించిపయిన్ । పేరణతునెరుకననియి । బ్లాలీం ని
నెరుకపరచు - మయ్యాబ్రెము క్కెదను * అనుమానము - జే
యకియ్యేడను * సాకెను మీపాద - జలజయుగ్మముహాహ్మా।
త్సారసమునవిల్పి - సల్పుదు పూజనో । యయ్యాబ్రెముకె
దను * అనుమానము - జేయకయ్యేడను * 31

తా॥ స్వామీ ! దేవరవారు బట్టబయలై స్వతస్సిద్ధ
ముగ నిండియున్న అచల పరిపూర్ణబ్రహ్మమును, మూలము
లేకయే స్వయముగ తోచుచు, సర్వమును తోపింపజేసెడి లేని
యెఱుకయొక్క స్వరూప స్వభావములను నెఱిగించి. అటు
పిమ్మట మూలములేకయే తోచుచున్న ఎఱుక నెచ్చటను
లేకుండ జేసెదనని సెలవిచ్చితిరి. మీరు సెలవిచ్చిన విధముగా
నాకు బోధచేయుడు. నేను త్రికరణశుద్ధిగా మిమ్ములనేనిమ్మ
శరణుపొందితిని. నన్ననుగ్రహింపుడు. నాయందు దేయనుమా
నమునుంచక బోధింపుడు. నేనేసంశయమును మనస్సునం
దుంచుకొనక శ్రద్ధగా వినెదను. నేను మీపాదపద్మములను
నా హృదయకమలమునందుంచుకొని నిరంతరము పూజించు
కొందునని పెక్కువిధముల వినుతించి సాష్టాంగ దండ ప్రణా
మము లాచరించెను. 31

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ
నిర్గుణతత్వానందార్థదమువులయందు గురుశిష్యానోన్యస్య దర్శన
మను ద్వితీయాధ్యాయమునకు శ్రీమత్పరమహంస పరివ్రాజ

కాచార్యవర్య స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్
వారిచే రచియింపబడిన భావార్థ దీపికాసహితము.



## 3. అచలలక్షణము

కం॥ పుట్టుటగిట్టుట లేకను । పుట్టేగిట్టేటి యెఱుక -
పొడిమెరుగకన్ । జట్టువలె కదలనుండును । బట్టబయల్
యిట్టిదెఱిగి - భావింపదగును * ఎఱుకలేక - సేవింపదగును *
వట్టియాశలచేత - పట్టుబడకను యీ । గుట్టుదేశపు నోట -
గట్టిగ తెలుసుక । భావింపదగును * ఎఱుకలేక - సేవింప
దగును * 32

భా॥ బిడ్డా! అచలపరిపూర్ణమగు కేవలాత్మ పుట్టుక
యును, చావునులేక, చట్టువలె కదలక మొదలక స్వతస్సిద్ధమై
నిండియున్నది. దానియందు మూలములేకయే పుట్టుచున్న
ట్లును, గిట్టుచున్నట్లును తోచుచున్న ఎఱుకనుగాని, దానిచే
కల్పింపబడిన నామరూపాత్మక ప్రపంచమునుగాని యాకేవ
లాత్మ యెన్నడు నెఱుగదు. అది నామరూప గుణక్రియాత్మక
మగు స్థూలప్రపంచముండుట కవకాశమిచ్చిన భూతాకాశము
గాని, వాసనారూపమగు సూక్ష్మప్రపంచముగల చిత్తాకాశము
గాని, పుట్టినశించెడి సంకల్పములకును, పుట్టబోవుసంకల్పము
లకును మధ్యనుండి వానిని ప్రకాశింపజేసెడి స్వయంప్రకాశ
మగు చిదాకాశముగాని కాక, యేగుణములునులేక, యేపదా

ర్థమునుగాక, నిష్ప్రతియోగియై స్వతస్సిద్ధముగ నిండియున్న నిరాకారశమము. ఈనిరాకారశమే బట్టబయలు. అది యవాఙ్మాన సగోచరమగుటచే విధిముఖ ప్రతీతికి విషయముకాదు. కావున దానినినిషేధముఖముగా తెలియుటకొఱకు మొదటదానియందు వాఙ్మనోగోచరమును, ప్రతియోగిసహితమును నగు సచ్చిదానందములు కల్పింపబడెను. కేవలాత్మకిది స్వరూపలక్షణము. ఈ సచ్చిదానందముల చలనశక్తియే మనస్సు. మనస్సు, మనోకల్పితమగు రూపనామ గుణక్రియాత్మకమగు ప్రపంచము కేవలాత్మకు తటస్థలక్షణము. కేవలాత్మకు స్వరూప లక్షణమైన సచ్చిదానందము లఖండోపాధి. తటస్థలక్షణమైన మనస్సు, మనోకల్పితప్రపంచము ఖండోపాధులు. ఈ ఖండాఖండోపాధులగు తటస్థ స్వరూపలక్షణములను రెంటిని విడువగా స్వతస్సిద్ధమై శేషించియుండిన అచలపరిపూర్ణ కేవలాత్మయే బట్టబయలని భావింపవలయును. అది యెఱుకచే నెఱుగబడదు. సర్వవికార సమన్వితమగు నెఱుకను విడిచినచో నది స్వతస్సిద్ధమై సంపూర్ణముగ నిండియుండును. ఎఱుకతనచే కల్పింపబడిన రూపనామ గుణక్రియాత్మకములగు పదార్థముల నాశ్రయించుకొనియుండి, వానినే విషయము చేయునుగాని, రూపనామగుణ క్రియాదులులేని యచలపరిపూర్ణ కేవలాత్మను విషయము చేయజాలదు. ఆ కేవలాత్మస్థితియే పరమశాంతి. ఇట్టి పరమశాంతిని పొందజాలక, మూలములేకయే తోచు చున్న ఎఱుకచే కల్పింపబడిన మిథ్యాపదార్థములుసత్యములు, సుఖసాధనములనడి యాశలకు జిక్కినచో నీకు సర్వదుఃఖ

ములు సంభవించును. కావున నీవచలపరిపూర్ణుడగు సద్గురువు నాశ్రయించి వారివలన పరిపూర్ణస్థితిని పొందెడి గుట్టును గట్టిగా తెలిసికొని పరమశాంతిని పొందుము. 32

కం॥ ఎరుకైన రీతి నెఱుఁగను । నెఱుగ నశక్యంబ
టంచు-నెన్నినయెఱుకే । యెఱుగుమనననను నెఱుకే । యెరు
గుట దుర్లభముసుమ్ము - యీయుత్తబయలు * ఎరుగనె
యెరుగ-దెరుక యీబయలు * పెరుగదు విరుగదు - నొరు
గదు తరుగదు । అరుగదు కరుగదు - తిరుగదు మొరుగదు ।
ఈయుత్తబయలు*ఎరుగనె యెరుగ-దెరుక యీబయలు* 33

భా॥ అచలపరిపూర్ణ కేవలాత్మ యెఱుగబడినట్లున్న దనినను, అది యెఱుగుటకు శక్యముకానిదనినను, దానిని నేనె అగుదుననినను ఎఱుకయే యగును. అది యెఱుకచే నెఱుగబడదు. అవాఙ్మానస గోచరము, నిష్ప్రతియోగి యగుటచే దాని నెఱుక విధిముఖముగ నెఱుగఁజాలదు. ఆబట్ట బయలగు కేవలాత్మపదమ్మున వికారములు లేనిదగుటచే ద్రవ్యమువలెతరుగదు. నది చెర్వువలె పెరుగదు. కట్టెవలె విరుగదు. దొంతివలె నొరుగదు. గంధపుచెక్కవలె నఱుగదు. ఉప్పువలె కరుగదు. చక్రమువలె తిరుగదు. కుక్కవలె మొఱుగదు. అది యేవికారములును లేక యేకమై స్వతస్సిద్ధముగనున్నది. 33

కం॥ పలుకున పలుకగరాకను । తలపోయుటమునిన
మదికి - దగులకయెప్పుడు । ముఱగుచ్చ సందులేకను ।

గలిగియున్నది బట్టబయలు - గదరామాయన్నా * ఇదిగో చూ
డు - కదలదోయన్నా * పలుకన్న పలుకక - తలపన్న దెరు
గక । చలి యెండ వానల - కలయక నిలచుండు । గదరా
మాయన్న * ఇదిగో చూడు - కదలదోయన్న * 34

భా॥ ఆబట్టబయలైన కేవలాత్మ యవాఙ్మానస గోచరమగుటచే దానిని తెలిపెడి శబ్దములుగాని, శాస్త్రములుగాని లేవు. అది నామరూపగుణక్రియాది ధర్మములు లేనిదగుటచే దానిని మనస్సూహింపజాలదు. అదిసర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగ నిండి నిబిడీకృతమై కదలక ముల్లు గ్రుచ్చుటకుకూడసందు లేక స్వతస్సిద్ధముగ నున్నది. దానికివాగాదీంద్రియములకువలె శబ్దాది విషయములుగాని, మనస్సునకువలె సంకల్పవికల్పములు గానిలేవు. అది చలికి వణకదు. ఎండకెండదు. వానకు తడియదు. దేనిచేతను చలనమును పొందక స్వతస్సిద్ధమై నిండియున్నది. 34

కం॥ సామర్థ్యమేమిజూపదు । కామక్రోధాదికముల-
గలయదనిశమే । బామలెరుంగదు నితరులు। ఏమనిననుమా
రు పల్కు - దీబట్టబయలు * దీనికి మ్రొక్కె - రితర జేజేలు *
నామరూపక్రియ - నటనలన్నియు మీరి । యేమని యన
రాక - యేకమైయున్నది । యీ బట్టబయలు * దీనిక్రిమ్రొ
క్కె రితర జేజేలు * 35

తా॥ సామర్థ్యమనగాశక్తి. ఆ శక్తియొక్కటియే యైనను, దాని యాశ్రయములగు పదార్థములనుబట్టి భిన్నభిన్నములుగ తెలియబడుచున్నది. భూమియందు కఠినశక్తి, ఉదకమునందు ద్రవశక్తి, అగ్నియందు దాహకశక్తి, వాయువునందు చలనశక్తి, ఆకాశమునందు శబ్దోత్పాదకశక్తి, శబ్దమునందు శబ్దార్థజ్ఞాన జనకశక్తి, చైతన్యమునందు స్వయంప్రకాశకశక్తి తెలియబడుచున్నవి. ఇట్లే ప్రపంచమునగల సమస్త పదార్థములు తమతమశక్తులను కలిగియున్నవి. కాని, బట్టబయలగు కేవలాత్మయందు దేశక్తియు తెలియబడుటలేదు అది తన సామర్థ్యము నేవిధముగను తెలుపుటలేదు. జీవులయందు సత్త్వరజస్తమోగుణముల వలన కలిగెడి రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము, దర్పము, అహంకారము, ఇచ్ఛ, శ్రద్ధ, భక్తి మొదలయినవిగాని, వానివలన గలిగెడి సుఖదుఃఖములుగాని కేవలాత్మకు సంభవింపవు. దీనిసిగూర్చి మానవులు సగుణమనిగాని, నిర్గుణమనిగాని, సగుణనిర్గుణాతీతమనిగాని, ఎవరేవిధముగ చెప్పుకొనుచున్నను నేమియుబదులు చెప్పక, స్వతస్సిద్ధమై నిండియున్నది. ఇది బ్రహ్మవిష్ణుమహేశ్వరాది సమస్తదేవతలు పుట్టకపూర్వమే స్వతస్సిద్ధమైయుండుటచే దీనికితర దేవతలందఱు మ్రొక్కుచున్నారు. ఇది నామరూప గుణక్రియాది వటవలుగల సమస్త చిజ్జడాత్మక జగత్తునకతీతమై యుట్టి, దట్టిదని నిర్ణయింపబడక యేకమై స్వతస్సిద్ధముగ నిండియున్నది. ౪౫

కం॥ దానము ధర్మము సగుణ । ధ్యానము ప్రతిమార్చనంబు - తపజపతీర్థ । స్నానములు ముక్తిదములని । మానవులొనరింప బయలు - మాటాడదేమి * యెరుకేలేదు - మాటాడెదేమి * ఔను కాదనక నీ - వనక నేననకొక్క । మేనైనతాగాక - మితిమీరియున్నది । మాటాడదేమి * యెరుకేలేదు - మాటాడెదేమి * 36

భా॥ ప్రపంచములోని మానవులు నిజమగు ఋజుమార్గము నెఱుంగక గోభూహిరణ్యాది దానములు చేయుటచేతను, ధర్మమార్గమునవర్తించుటచేతను, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సగుణ దైవముల నారాధించుటచేతను, ఆసగుణ దైవముల ప్రతిమల నర్చించుటచేతను, వానికి పెండ్లి పేరంటములు, పవళింపుసేవలు చేయుటచేతను, ఆదైవనామముల జపించుటచేతను, కాయికవాచక మానసికతపస్సులొనర్చుటచేతను, తీర్థయాత్రలకు తిరుగుటచేతను, గంగాయమునా సరస్వతీ మొదలగు నదులలో స్నానములు చేయుటచేతను మోక్షముకలుగునని తలంచి; యనేకపాట్లు పడుచున్నను, బట్టబయలైన కేవలాత్మ యేమియుననక స్వతస్సిద్ధమై నిండియున్నది. దానియం దెఱుకయేలేదు. కావున నదియేమి యెఱిగి మాట్లాడగలదు ? మానవులు నిజము నెఱుగక మోక్షముకొఱకు కెన్ని పాట్లుపడుచున్నను, అచలపరిపూర్ణ కేవలాత్మ ఔననికాని, కాదనికాని, నీవనికాని, నేననికానియనక, వ్యష్టిసమిష్టి స్థూల సూక్ష్మకారణ మహాకారణ కైవల్య శరీరములలో, నేదియుకాక, స్వస్ని

7)

కన్నింటి కలితమై స్వతస్సిద్ధముగ నిండియున్నది. 36

కం॥ ఇంతింతని యనరానిది । వింతయుచేయనిది యెన్ని - విధముల గనినన్ । చింతలెరుంగనిదీ బయి । లెంతని వినిపింతునేనీ - కేమిర పృథుకా * తెల్పుట వినుట - మిక పెద్దకథకా * సంతతమొకరీతి - సంకలదేశముల యం । దంతటనిండున్న - దదిగోపరిపూర్ణ ము । ఏమిర పృథుకా * తెల్పుట వినుట - మిక పెద్దకథకా * 37

భా॥ ఆ యచల పరిపూర్ణ కేవలాత్మ అణుపరిమాణము కాదు. అంగుష్ఠపరిమాణముకాదు. మధ్యమపరిమాణముకాదు. మహత్పరిమాణముకాదు. అది యే పరిమాణమునుగాక యేక మై నిండియున్నది. రూపనామ గుణక్రియాది వికారములేవియు లేనిదగుటచే దానియం దేవింతలులేవు. అది యేవింతలు చే యదు. ఎన్నివిధముల చూచినను దానికేచింతలునులేవు. ఎటు కను కలిగెడి చింతలనెన్నడిది యెఱుగదు. బిడ్డా ! ఇట్టి యచల పరిపూర్ణ కేవలాత్మను గూర్చి నేనెంతని నీకు వర్ణించిచెప్ప దును ? నేను చెప్పుటకు, నీవు వినుటకు ఇదియొక పెద్ద కథ కాదుగదా ! ఈ యచల పరిపూర్ణ కేవలాత్మ సర్వదేశముల యందును, సర్వకాలములయందును, సమస్తవస్తువుల యందు ను నిండి నిబిడీకృతమై స్వతస్సిద్ధముగ నున్నది. 37

కం॥ ఆకాశాదికభూతా । నీకాత్మకమగుచు నెరుక - యీజగమయ్యెన్ । రాకడపోకడ దీనికి । ప్రాకటముగదేని

లోనో - బట్టబయలదిరా * కాదనియంటే - వట్టి పల్కిదిరా * లోకత్రయము తన - లోపల తిరుగగ। జోకతోడు తదాని - జోలెరుగనిది యేదో। బట్టబయలదిరా * కాదనియంటె - వట్టి పల్కిదిరా * 38

భా॥ ఎటుకతనయందున్న వాసనానుసారముగ "ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, భూమి" అనెడి పంచ భూతములుగను, ఆభూత పరిణామములగు రూపనామగుణ క్రియాత్మక భౌతిక ప్రపంచముగను, దానినెఱిగెడి జ్ఞానముగను పరిణమించుచున్నది. ఇట్టిమూలము లేకయే యచలపరిపూర్ణ కేవలాత్మయందు తోచెడి యెఱుకయును, ఎఱుకచే నెఱుగబడెడి సమస్త ప్రపంచమును బట్టబయలగు కేవలాత్మయందే తోచుచు, మరల మటుమాయమై పోవుచున్నవి. కేవలాత్మయందు లేకయే తోచెడి యెఱుక జగములు సత్యములని చెప్పినచో నదివట్టిమాట. స్వర్గమర్త్య పాతాళలోకములుగపరిణమించిన యెఱుక కేవలాత్మయందు తోచుచు, మటుమాయమై పోవుచున్నను, నాయచలపరిపూర్ణ కేవలాత్మ దానిరాకడపోకడల నెంతమాత్రమెఱుగక స్వతస్సిద్ధముగనుండియున్నది.38

దం॥ తండోపతండములుగా। దండిదుషాదికము లన్ని - తనలోపల ను। ద్దండతనుండిన పోయిన। నుండు సముద్రంబు నెరుగ - కుండునెప్పటికి * పరిపూర్ణమి - ట్లుండు నెప్పటికి * ఎండమావులరీతి - నుండేటి బ్రహ్మాండ।

ముండిన పోయిన - రెండు గు ర్తెరుగని । దుండు నెప్పటి
కి * పరిపూర్ణ మి - ట్లుండునెప్పటికి * 39

భా॥ సముద్రమునందు పెద్ద పెద్ద చేపలు, తిమింగిలములు, తాబేళ్లు, మొసళ్లు మొదలగు జలచరములు తండోపతండములుగనుండివ్యవహరించుచున్నను, అవియన్నియునశించి పోయినను వానియునికి లేముల నాసముద్రమెన్నడు నెఱుగదు. అట్లే యచలపరిపూర్ణ కేవలాత్మయందు ఎండమావులలోని జలమువలె లేకయే తోచుచుండెడి యెఱుక, ఎఱుకచే కల్పింపబడిన బ్రహ్మాండము తోచుచున్నను, తోచకున్నను వాని రాకడపోకడలను రెంటిని యెఱుగని యచలపరిపూర్ణ కేవలాత్మ స్వతస్సిద్ధముగ నిండియున్నది. 39

కం॥ ఎఱుకతో వచ్చిన విశ్వం । బెఱుకతో జనుగాని
నిల్వ - దీబయలైతే । యెఱుకతోరా వెఱుకతోడో । వెఱుక
తనంచేమిలేదు - ఇది నిశ్చయమురా * ఉండుంపెయా -
యెఱుకెత్తానోరా * ఎఱుక యెరిగినవస్తు - వెఱుకని తెలి
యుము । ఎఱుక యెఱుగదు బయలు * నిట్టి దట్టిదియని ।
ఇది నిశ్చయమురా * ఉండుంపేయా - యెఱుకేత్తానోరా *40

తా॥ రూపనామగుణ క్రియాత్మకమగు సమస్త ప్రపంచము మూలములేని యెఱుక తోచినప్పుడు తోచుచున్నది. మరల నాయెఱుక పోవునప్పుడీప్రపంచముకూడ దానితోడనే పోవుచున్నది. ఎఱుకజగము లొకపర్యాయమే తోచుచు,నొక

పశ్యాయనే పోవుచున్నను, ఎఱుకచేతనే జగమెఱుగ బడుచున్నది. జగమెఱుకకాశ్రయము. ఎఱుక లేనిచో దానికాశ్రియమగు జగమెఱుగబడదు. జగములేనిచో నెఱుక నిరాశ్రయముగ నిలువజాలదు. ఈ రెండును పరస్పరాపేక్షితములై యొక కాలమున తోచుచు, నేక కాలమున నశించి పోవుచున్నవి. అచలపరిపూర్ణ కేవలాత్మ యెఱుకతోచినప్పుడు దానితోనచ్చునదికాదు. ఎఱుకపోవునప్పుడు దానితో పోవునదియుకాదు. దానియం దెఱుక యే కాలమునందును లేదు. దానియందెఱుక యుండినచో నదియు నెఱుక యేయగును. ఎఱుక దాని నెప్పుడు నెఱుగజాలదు. ఎఱుకచే నెఱుగబడునవస్తువులన్నియు నెఱుకయే యని తెలిసికొనుము. ఎఱుక యే కాలమునందును బట్టబయలగు కేవలాత్మ నిట్టి, దట్టి, దని యెఱుగజాలదు. 40

కం॥ రవి తమసమున్న దెరుగునె । ప్రవిమల దా
వాగ్ని చదలు - బట్టు నెరుగునా । దివమును రాత్రియు, రా
త్రిని । దివమెరుగునె లేమిలక్ష్మి - దేవి యెరుగునా * అ
న్నమును భూ-దేవి యెరుగునా * భవనాశస్థితుల రా - సొదే
టి యెరుకను । భవనాశ స్థితిలేని - బయల్గెరుగదు లక్ష్మి ।
దేవియెరుగునా * అన్నమును భూ - దేవియెరుగునా * 41

భా॥ ప్రకాశించుచున్న సూర్యుడు చీకటినెఱుగనట్లును, మండుచున్న దావాగ్ని తన్ను చదలుపట్టు టెఱుగనట్లును, పగలును రాత్రియు, రాత్రినిపగలు నెఱుగనట్లును, దరిద్రదేవత లక్ష్మీదేవి నెఱుగనట్లును, తనయందు సత్యరూపముగ

నుత్పన్నమైన అన్నమును భూదేవి యెఱుగనట్లును, ఉత్పత్తి స్థితి లయాది వికారములతో రాపాడెడి యెఱుకను ఉత్పత్తి స్థితిలయాది వికారములులేని బట్టబయలైన కేవలాత్మ యెఱుగదు. 41

కం॥ ఎరుకైన భూతపంచక । మెరుకను చరణములు కటియు - హృదయము గళమున్ । శిరమునునయ్యె నుక్రమమున । దరణి మొదల్జేసి యిట్లు - తనయాగుర్తెరుగు * గగనము బయలం - చనరాదీ మరుగు * ఎరుగ రాకాశమే - పరిపూర్ణ మనుచు కొం । దరు పల్కి-రిది విని - గురితప్పియుండేవు । తనయా గుర్తెరుగు * గగనము బయలం - చనరాదీ మరుగు * 42

భా॥ బిడ్డా ! ఎఱుకచే నెఱుగబడెడి ఆకాశాది పంచ భూతములు ఎఱుక కవయవములగును. ఇందు ఎఱుకకు భూమి పాదములు, ఉదకము కటిప్రదేశము. అగ్ని హృదయము. వాయువుకంఠము. ఆకాశము శిరస్సనగునని తెలిసికొనుము. ఎఱుకస్వరూపమైన భూతాకాశముగాని, చిత్తాకాశముగాని, చిదాకాశముగాని, నిరాకాశమైన కేవలాత్మ కాజాలవు. నిరాకాశమగు కేవలాత్మను తెలియజాలని యజ్ఞానులు కొందఱు భూతాకాశమును, మఱికొందఱు చిత్తాకాశమును, వేఱు కొందఱు చిదాకాశమును బట్టబయలైన కేవలాత్మ యను చున్నారు. ఇందు భూతాకాశము శబ్దగుణమును, ఉత్పత్తినాశ

ములనుగలిగి, వాయ్వాదీతర భూతభౌతిక పదార్థములుంచుటకవకాశమిచ్చుచున్నది. చిత్తాకాశము సత్వరజస్తమో గుణాత్మకమై, యుత్పత్తినాశములు గలిగి, యవిద్యా కామకర్మాది వాసనలకు, రాగద్వేషాది గుణములకు, అణవాది మలములు మొదలగువాని కాలవాలమై యున్నది. చిదాకాశము పుట్టినశించెడి సంకల్పములను, పుట్టబోవు సంకల్పములను నెఱిగెడి యొఱుక స్వరూపమై స్వయముగా మనస్సును, మనస్సుతో గూడి సమస్త ప్రపంచమును నెఱుగుచున్నది. ఇట్టి వికారవంతములైన భూతాకాశ చిత్తాకాశ చిదాకాశములేవియు నిరాకాశమైన కేవలాత్మ కాజాలవు. నీ వాయజ్ఞానుల మాటలను విని మోసపోకుము. 42

కం॥ విత్తే చెట్టయి పుట్టును । వి త్తేవి త్తనమురీతి - వెలయును ధరపై । విత్తుకు చెట్టుకు వేరే । వి త్తనమొకటున్నదనిన - వినగూడదోయి * తనకుదా బు-ట్టును వినబోయి* విత్తు చెట్టులరెంటి-విధమీ భూమెరుగన। బ్బుత్తబయెరుగడు - సత్తు చిత్తులరెంట్ని । వినగూడదోయి * తనకు దాబు - ట్టును వినవోయి * 43

భా ॥ విత్తేచెట్టుగా పుట్టుచున్నది. కావున చెట్టునకు విత్తనము కారణము. చెట్టు లేనిచో విత్తనము కలుగదు. కావున విత్తనమునకు చెట్టు కారణము. ఈ చెట్టు, విత్తులరెంటికి వేఱుగా మఱియొక విత్తనమున్నదనినచో నామాట వినకూ

డదు. విత్తనము మూలము లేకయే తనంతట తాను పుట్టు చున్నది. అది పుట్టిన తరువాత దానినుండి వృక్షము పుట్టు చున్నది. భూమియందీ విధముగా విత్తనము చెట్టుగా పుట్టు చున్నను ఆ విత్తనమునుగాని, దానినుండి పుట్టినవృక్షమునుగాని భూమి యెఱుగుటలేదు. అట్లే యుత్తబట్ట బయలునందు మూలము లేకయే యెఱుకయనెడి విత్తనము తోచుచున్నది. ఆయెఱుకయనెడి విత్తనమువలన నీ బ్రహ్మాండరూపమగు వృక్షము తోచుచున్నది. ఈ యెఱుక జగములురెండును బట్టబయలగు కేవలాత్మయందు తోచుచున్నను, వాని నాబట్టబయలగు కేవలాత్మ యెన్నడు నెఱుగదు. 43

కం॥ చెట్టేమూలము విత్తుకు । చెట్టుకు మూలంబు విత్తు - క్షితిపై రెండున్ । పుట్టిన చచ్చిన రెంటిని । గట్టిగ తానెరుగకుండు - గదరా యూ నేల * నీ పీఠి - కను గొనవేల * పుట్టుచు గిట్టుచు - పొలుపొందు తనువెరుక । లిట్టివిచిత్రము - లెన్నడెరుగదు బయలు । గదరా యీ నేల * నీ పీఠి - కనుగొనవేల * 44

భా॥ చెట్టునుండి విత్తనము పుట్టుచున్నది. కావున విత్తనమునకు చెట్టు కారణము. ఆ చెట్టు విత్తనమునుండి పుట్టుటచే చెట్టునకు విత్తనము కారణము. ఈ విధముగ పరస్పరము కారణ కార్యములుగ కనిపించుచున్న విత్తు చెట్టులు రెండును పుట్టుచున్నను, గిట్టుచున్నను నీరెంటి వికారములను భూమి

యెఱుగడు. అజ్ఞయజ్ఞానులు(కొందఱు కర్మమువలన జన్మము వచ్చుచున్నదందురు. జన్మములేనిదే కర్మమెట్లు చేయబడును? కర్మము చేయకపోయినచో జన్మమెట్లు కలుగును ? ఇవియొక దానినుండి మఱియొకటి పుట్టినదనిన దో తండ్రివలన కొడుకు, కొడుకువలన తండ్రి పుట్టనలయును. అట్లు పుట్టుననుట సమంజసముకాదు. గోశృంగములవలె కర్మజన్మము లోకేపరా యము కలుగుచున్నవని చెప్పినచో వానికి కార్యకారణత్వ సంబంధము కలుగనేరదు. కార్యకారణత్వ సంబంధము కలుగనిచో వానికి పుట్టుక లేదని యంగీకరింపవలయును. పుట్టుక లేని వానికి కార్యకారణ సంబంధము కలుగనేరదు. కార్యకారణ భావసంబంధావేశమే సంసార హేతువు. ఆ యావేశము నశింప నంతవఱకు జననమరణ రూపమగు సంసారము సాగుచునే యుండును. వాస్తవముగా దేనికేదియు కారణముకాదు. దేనికేదియు కార్యముకాదు. బట్టబయలగు కేవలాత్మయందు మూలములేకయే యెఱుక తోచుచున్నది. ఆ యెఱుక తోచగనే దానితోపాటు దేహేంద్రియాది సమస్తప్రపంచము తోచుచున్నది. ఈ దేహేంద్రియాది సమస్తప్రపంచము ఎఱుకకాశ్రయము. ఆ యెఱుకచేతనే దేహేంద్రియాది సమస్త ప్రపంచము తెలియబడుచున్నది. ఈ విధముగ పరస్పరాపేక్షితములై తోచుచు, మఱుమాయమై పోవుచున్న ఎఱుకప్రపంచములను, వాని నానావిధ నటనాది వికారములను బట్టబయలగు కేవలాత్మ యెన్నడెఱుగడు. 44

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ

నిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు అచలలక్షణమను తృతీయాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే రచియింపబడిన భావార్థదీపికా సహితము.



# 4. ఎ ఱు క ల క్ష ణ ము

కం॥ ఎఱుకేదేహేంద్రియములు । ఎఱుకే వర్ణాశ్రమ
ములు - ఎఱుకేశ్రుతులు౼ । ఎఱుకే నీవునునేనును । ఎఱుకే
సతిసోదరాదు - లెఱుగుమువత్సా * నేదీర్చెద - నిదిగో
నీయిచ్చా * హరిహరబ్రహ్మాది - సురనరగిరిసరి । త్తరు
మృగముఖచరా - చరములు నెఱుకని । యెఱుగుమువత్సా*
నేదీర్చెద - నిదిగో నీయిచ్చా * 43

భా॥ వత్సా ! అచలపరిపూర్ణ కేవలాత్మయందు మూలములేని యెఱుక తోచినతోడనే మొదటదేహేంద్రియాది సంఘాతము తోచుచున్నది. అటుపిమ్మట నా సంఘాతము తాననెడి భ్రాంతి కలుగుచున్నది. తరువాత తనయందు "నేను బ్రాహ్మణుడను, క్షత్రియుడను, వైశ్యుడను, శూద్రుడను, చండాలుడను"అనువర్ణములును,"నేనుబ్రహ్మచారిని, గృహస్థుడను,వానప్రస్థుడను,సన్న్యాసిని, అవధూతను"అను ఆశ్రమములును కల్పింపబడుచున్నవి. తదుపరి ఆవర్ణాశ్రమములకు తగిన ఆచారములు కల్పింపబడుచున్నవి. పిదప ఆవర్ణాశ్రమ ధర్మము

లను ప్రతిపాదించెడి శ్రుతులు కల్పింపబడుచున్నవి. ఆవల "నీవు, నేను, వాడు, వీడు, అది, ఇది" అనెడి భేదభానములు కల్పింపబడుచున్నవి. తరువాత "నా భార్య, నాబిడ్డలు, నా సోదరులు, నా బంధువులు, నా ధనధాన్య గృహారామక్షేత్రాదులు" అనెడి భ్రాంతి కలుగుచున్నది. తరువాత బ్రహ్మ విష్ణు మహేశ్వరాది ప్రముఖ దేవతలు, ఇంద్రాది సామాన్య దేవతలు, మానవులు, మృగములు, పశువులు, పక్షులు, క్రిమికీటకాదులు, పంచభూతములు, పర్వతములు, నదులు, తరుగుల్మలతాదులు మొదలగు సమస్త చరాచర ప్రపంచము తోచుచున్నది. ఇవియన్నియు నెఱుకచేతనే యెఱుగ బడుచున్నవి. ఎఱుకచే నెఱుగబడెడి సమస్తము నెఱుకయేయని నీవెఱుగుము. 45

కం॥ ఎరుకే విద్యావిద్యలు । ఎరుకే ప్రణవంబునాద-
మెరుకే కళయుఁ । నెరుకేబిందువు చిత్స । త్తెరుకేయా
నందమనినీ - వెరుగు సద్బుద్ధీ * నీనామాట - లెరుకేని
బద్ధి * ఎరుకే నిర్గుణ సగుణా - లెరుకే యెరుకకునెంత ।
యెరుకోనేనివి యంత - నెరుగజేసితినీవి । లెరుగుసద్బుద్ధీ*
నీనామాట - లెరుకేనిబద్ధీ * 46

భా॥ ఓ బుద్ధిమంతుఁడా ! విద్యావిద్యలు, ప్రణవము, నాదబిందుకళలు, సత్తుచిత్తుఆనందములు, సగుణ నిర్గుణములు, నీవు నేను చెప్పుకొనెడి మాటలు మొదలగునవన్నియు నెఱు

కయే యని యెఱుంగుము. ఇవి యెవి అననేల! ఎఱుకచే నెఱుగబడని యచల పరిపూర్ణ బ్రహ్మమొక్కటితప్ప, ఎఱుకచే నెఱుగబడు సమస్త పదార్థము నెఱుకయే యని యెఱుంగుము. 46

కం॥ ఎరుకేయిహపరసౌఖ్యము । లెరుకేజ్ఞానంబు జ్ఞేయ - మెరుకేమోక్షం । బెరుకేభక్తి విరక్తుల । ఎరుకేసంకల్పమనినీ - వెరుగుసత్కీర్తి * ఎక్కడికౌర - యెరుకసంపూర్తి * ఎరుకేజీవుండీశు - డెరుకేతద్వైక్యత । యెరుకే సర్వము నే గు - ర్తెరిగి చెప్పితినీకీ । లెరుగుసత్కీర్తి * ఎక్కడికౌర - యెరుకసంపూర్తి * 47

భా॥ ఓ సత్కీర్తిమంతుఁడా! ఇహపరలోకములు, ఆ లోకములలోని భోగములు, జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములు, బంధమోక్షములు, భక్తివిరక్తులు, సంకల్ప వికల్పములు, జీవేశ్వరులు, జీవేశ్వరైక్యము మొదలగునవన్నియు నెఱుకయే యని నేను సర్వము గుర్తెరిగి నీకు చెప్పితిని. నే నెంత నీకు చెప్పినను ఎఱుకలోని పదార్థములు సంపూర్తికాజాలవు. ఎఱుకచే నెఱుగబడెడి పదార్థములన్నియు నెఱుకయే యని తెలిసికొనుము. 47

కం॥ చింతలకోటన నెరుకే । వింతలపుట్టిల్ల నంగ - వెలసిన దెరుకే । రంతులపేటన నెరుకే । పంతములకు చూడ మూల - బలమన్న నెరుకే * జగజ్జనన స్థలమన్న

నెరుకే * భ్రాంతులకెల్లను - పట్టణమన జెల్లి । కాంతాది
రూపుల - గల్పించుటకు మూల । బలమన్న నెరుకే *
జగజ్జనన - స్థలమన్న నెరుకే * 48

తా॥ ఈ యెఱుక చిత్తమునందుగలిగెడి చింతలన్నిటికి తోటవంటిది. వింతలసముదాయమునకిది పుట్టినిల్లు. తంతు లన్నిటికిది యొకపేట. పంతములకు మూలబలము. తనగొప్ప తనమును ప్రకటించుకొనుటకిది పంతములాడును. ఈ యెఱుక తోచినప్పుడే దానితోపాటే సమస్త ప్రపంచము తోచుచు న్నది. కావున నిదిజగజ్జనన కారణము. దీనియందున్న వాస నానుసారము రూపనామక్రియాత్మక జగత్తును, ఆజగత్తులోని స్త్రీ పుత్ర గృహారామక్షేత్ర ధనధాన్యాది పదార్థములను కల్పించి, యవి సత్యములనియు, సుఖసాధనములనియు భ్రాం తినిపొంది నానావిధదుఃఖముల ననుభవించుచున్నది.

కం॥ అన్నియు తానై తనకవి । పన్నుగ వేరనుచు
నోట - బలుకుచు మరితా । నన్నిటినెరిగే యెరుకై ।యున్నా
నని యెరుకే యెరుక - నూహింపుచుండు * తనలోతానే-
మోహింపుచుండు * ఎన్నో విచిత్రా లీ - యెరుక చేతలు
వింటే । యున్నదిలేదులే - కున్నది కలదని । యూహిం
పుచుండు * తనలో తానె - మోహింపుచుండు * 49

భా॥ ఈ ప్రపంచమునగల సమస్త పదార్థములు నెఱు కయే. దానికంటె నన్యముగనే పదార్థములేదు. అది తోచి

నప్పుడే సమస్త ప్రపంచము తోచుచున్నది. అదిపోవునప్పుడే ప్రపంచమంతయు దానితోనే మటుమాయమై పోవుచున్నది. కావున సమస్త ప్రపంచము తానే యగును. అయినను ఈ యెఱుక సమస్త ప్రపంచము, దానిలోని నామరూపములు తనకంటే వేఱుగానున్నట్లును, తనచే నెఱుగబడుచున్నవి కావున నవి తనకు దృశ్యములైనట్లును, తాను వాని నెఱిగెడి ద్రష్ట యైనట్లును నూహింపుచు మోహము చెందుచుండును. ఈయెఱుకయొక్క పనులన్నియు చిత్ర విచిత్రములుగానుండును. ఇది స్వతస్సిద్ధముగనున్న కేవలాత్మను లేనిదానిగను, లేని నామరూపనటనాత్మక జగత్తును ఉన్నదానిగను నూహింపుచు, ఆనామరూప నటనాత్మక జగత్తును జూచి తనలో తానేమోహము చెందుచుండును. 49

కం॥ వినుమూర్ధనాభితాబు । ట్టిన మీదట సృజన జేయు - దినము హరించుక । మనమగు పటశతకోట్లను । తనలోపలి దారమునను - తానట్టేచనును * అట్టులెయెరుక - తాబుట్టికనును * పనిబూని బ్రహ్మాండ - భాండానంతము లను । క్షణములోపల ద్రుంచి - కనరాక వేవేగ । తానట్టె చనును * అట్టులె యెరుక - తాబుట్టి కనును * 50

భా॥ సాలెపురుగు తాను పుట్టినపిదప తనలోపలనున్న జిగురుతో ప్రతిదిన మనంతములగు పటములనల్లుచు, మరల వానిని పాడుచేయు చునుండి, తుదకదియూదారమునందే చిక్కుకొని నాశమగుచున్నది. అట్లే యెఱుక తాను తోచునప్పుడు

తనయందున్న వాసనానుసారము అంతులేని బ్రహ్మాండభాండములను తోపింపజేయుచు, అవి "సత్యములు, సుఖసాధనములు" అని భావించుచు, వానివృద్ధిక్షీణములననుసరించి నానావిధ సుఖదుఃఖముల ననుభవించుచు, క్షణములో తానును, తనచే కల్పింపబడిన బ్రహ్మాండ భాండములును మటుమాయములై పోవుచున్నవి. కావున నీ యెఱుక జగములెప్పుడులేనియగును. 50

కం ॥ తలిదండ్రులు జీవేశులు । ఇలవ్యోమములేను
మేను - లెరుకమరుపులున్ । కలమేల్కొలు శుక్లాస్రం ।
బులు నీరన్నములు ప్రకృతి - పురుషులాల్మగలు * గానై
యెరుక - కెరుకెకొనబడు * తెలిసిబయలున్నది - తెలిసిన
తెలివిని । తెలివిచేతనెపట్టి - తీసివేయును ప్రకృతి । పురు
షులాల్మగలు * గానై యెరుక - కెరుకెకొనబడు * 51

భా॥ ఈ యెఱుకయే తల్లిదండ్రులు, జీవేశ్వరులు, భూవ్యాకాశములు, నేను మేనులు, ఎఱుక మఱపులు, కలమెలకువలు, శుక్లశోణితములు, అన్నపానములు, ప్రకృతి పురుషులు, భార్యాభర్తలు మొదలగు సమస్తద్వంద్వములుగానయి వానినన్నిటిని తానే యెఱుగుచున్నది. ఈ యెఱుకను, ఎఱుకచే నెఱుగబడు ద్వైతప్రపంచమును విడువగా శేషించియున్న బట్టబయలే కేవలాత్మయని తెలిసి, ఆ తెలిసిన తెలివినికూడ విడిచినచో సమస్త ద్వంద్వములు మటుమాయమై పోవుచున్నవి. 51

కం॥ ఒకదేహధారి తనువున । సకలావస్థలు జనిం
చి - చనినవిధమునన్ । అకలంకమైన బయలున । ప్రక
టంబై లేనియెరుక - బయలుండజూచి * తనముచ్చట -
పరికించిలేచి * యొకకొంత సేపైన - నుండేటందుకు లే
క । సకలము తనవెంట - జనుచేర జనుబట్టి । బయలుంత
జూచి * తనముచ్చట - పరికించిలేచి * 52

భా॥ దేహధారి తాను ధరించిన దేహమునకు పద్మాధన వికారములు, బాల్యకౌమార యౌవనవృద్ధావస్థలు కలుగుచున్నవి. ఆయవస్థలయందు దేహమునకు వాతపైత్యశ్లేష్మములచే ననేక వ్యాధులు కలుగుచు పోవుచున్నవి. అట్లే నిష్కళంకమైన బట్టబయలులో మూలము లేనియెఱుకతోచి, నామరూపములను ప్రకటింపజేసి, వానితోగూడి నానావిధ నటనలు సల్పి, తనమూలమును విచారింపగా నెచ్చటను లేకపోవుటచే తాను, తనతో తోచిన నామరూపములు లేనివేయని యెఱింగినచో, బట్టబయలైన కేవలాత్మ స్వతస్సిద్ధమై నిండియుండును. అట్లు స్వతస్సిద్ధమై నిండియున్న కేవలాత్మయునికి నెఱింగినచో లేని యెఱుకతనయందుతోచిన లేని నామరూపములతో తానే లేకపోవుచున్నది. 52

కం॥ మేలుక సుషుప్తిలోపల । నేలీల తనకు
తానె - యేమెంచునొ గు । ర్తౌలీల బయలులోపల । వాలా
యము తనకువానే - వచ్చునోయన్న * వచ్చి పెచ్చి -

వచ్చుచోయున్న * తిరోహితమైనట్టి - మరుఁగున్నట్టి యెఱిఁగిరే ।
యేపోకయునులేక - చాలదైనగుయుండె - వచ్చుచోయున్న *
వచ్చిపోచ్చు - వచ్చుచోయున్న * 53

భా॥ నిద్రనుండి మేలుకొన్న తనంతటతానే నిచ్చునిట్టి బట్టబయలుతో మూలములేని యొరుక తనంతటతానేవచ్చి, తనతోపాటు సమస్త రూపనామములను తోపింపజేసి, వాని యందు స్వపరభేదములను కల్పించుకొని, అందు కొన్నిటి యందు మమకారము పెంచుకొని, నాభార్య, నాబిడ్డలు, నా గృహక్షేత్రాదులు, నాధనధాన్యవస్తువాహనాదులని వాని యందు మమత్వబుద్ధితో వానికికలిగెడి వృద్ధిక్షయములను తన యందు కల్పించుకొని నానావిధ సుఖదుఃఖముల ననుభవించి, ఏదవు తాను, తనతోవచ్చి తనకు నానావిధ దుఃఖములను కలుగజేసిన తనపరివారమును మటుమాయమై పోవుచున్నది. మూలములేని ఈ యొరుకయొక్క మిథ్యాత్వమును, బట్టబయలై స్వతస్సిద్ధముగ నిండియున్న కేవలాత్మయొక్క సత్యత్వమును తెలిసికొనిన వారికి ఈ యొరుక యెచ్చటను నిలువజాలక మటుమాయమై పోవుచున్నది. అటుల తెలియకున్నవారికి ఈ యొరుక నానాభ్రాంతులను, కలిగించి, దుఃఖములపాలు చేయుచున్నది. 53

కం॥ ఆటాడి యూడచుకొను । ఆటాడిన తోలు
బొమ్మ - యాడాడకయే । యాటాడు నెఱుకయదియెడి ।
యాటాడించేటివాడు - సతడేకర్త * అంతటికిని - యచల

మకర్త * చేటుపాటులరెంటి - చే వచ్చు ఫలము ను ।
మ్మాటి కనుభవించి - మరణ జననములొంద । నకర్తేర
కర్త * అంతటికి నీ - యచలమకర్త * 54

భా॥ బుట్టబొమ్మ జడమగుటచే నదిస్వయముగా నాడజాలదు. దానిలో చేతనుడైన మానవుడు దూరి దానినాడించుచున్నాడు. అట్లే బుట్టబొమ్మవలె జడమైన దేహముకూడ స్వయముగ నే కార్యము చేయజాలదు. దానిలో చైతన్యాత్మ ప్రవేశించి, యా శరీరముతో నానావిధములగు పుణ్యపాప కర్మములను చేయించుచున్నది. కావున సమస్త పుణ్య పాప కర్మములకు ఎఱుకస్వరూపుడగు నాత్మయేకర్త. ఆ కర్మఫలములైన సుఖదుఃఖము లనుభవించుటకొఱకు స్వర్గనరకములకు, జన్మజన్మాంతరములకు పోయెడి భోక్తయు నతడే కాని, యచలపరిపూర్ణమగు కేవలాత్మ యే కర్మములకు కర్తగాని, కర్మఫలములైన సుఖదుఃఖములకు భోక్తగానికాదు. 54

కం॥ దేహమును జూచుకన్నులు । దేహమునకు వేరు
గాని - తీరున నెఱుతే । కోహంకస్త్వం తవదా । సోహం
సోహంబటంచు - చూచుచుండుసుమి * తనకు తానె -
తోచుచుండుసుమి * దేహిదేహములను - తెరగునబ్రప
రించి । దేహముగాని వి - దేహిగతననుతా । జూచుచుండు
సుమి * తనకుతానె - తోచుచుండుసుమి * 55

భా॥ ఈ దేహమును జూచుచున్న కన్నులు దేహమున

కంటె వేఱుగాలేని విధమున దేహముతోఁ గూడియున్న ఎఱుక కూడ దేహమునకంటె వేఱుకాదు. దేహాభిన్నమగు నీ యెఱుక భ్రాంతిచే నొకప్పుడు "నేనెవ్వడను ? దేహమునకంటె భిన్నుడనా ? అభిన్నుడనా ?" అని విచారించును. మఱి యొకప్పుడు నీవెవ్వడవు? నాకంటె భిన్నుడవా? అభిన్నుడవా? అని తలపోయును. ఇంకొకప్పుడు "నీవు సర్వజ్ఞుడవగు నీశ్వరుడవు. నేను కించజ్ఞుడనగు జీవుడను. కావున నేను నీకు దాసుడనని తలంచును. మఱియొకప్పుడు "నేను నీకంటె వేఱుకాను. నీవే నేను, నేనే నీవు. మనమఖండ బ్రహ్మస్వరూపులము" అని తలంచును. ఈ విధముగ నీయెఱుక తన వాస్తవ స్వరూపము నెఱుంగక ఒకప్పుడు దేహమే తాననియు, మఱియొకప్పుడు తాను దేహమునకంటె భిన్నుడననియు, ఇంకొకప్పుడీశ్వరుడు తనకంటె భిన్నుడనియు, వేఱొకప్పుడు నేనేయీశ్వరుడననియు తలంచును. ఈవిధముగ నొక్క యెఱుకే నానావిధములగు భ్రాంతులను పొందుచు, నానావిధములుగ దోచుచుండును. 55

కం॥ పిండబ్రహ్మాండంబులు । రెండును నారెంటిలోని-
రెండహములును నీ । ఖండము నాల్గుగూడియ । ఖండంబగు
నే నఖండరూప - గనరా మాతండ్రీ * యని తెల్పిన - ఘనుడే
తలిదండ్రీ * ఖండాఖండములుగ - గనిపించె యెఱుకనె ।
దండిదనేటియు - ద్వంద్వము కలవారు । గనరా మాతండ్రీ *
యని తెల్పిన - ఘనుడే తలిదండ్రీ * 56

తా॥ వ్యష్టిస్థూల సూక్ష్మకారణ మహాకారణ కైవల్య శరీరము లైదునుగూడి పిండము. సమష్టి స్థూల సూక్ష్మకారణ మహాకారణ కైవల్య శరీరములైదునుగూడి బ్రహ్మాండము. కరచరణాద్యవయవ సముదాయమైన వ్యష్టిస్థూల దేహాభిమానియగు విశ్వుడు, ఇంద్రియ ప్రాణాంతఃకరణ రూపమగువ్యష్టి సూక్ష్మ దేహాభిమానియగు తైజసుడు, అజ్ఞాన రూపమగు వ్యష్టికారణశరీరాభిమానియైనప్రాజ్ఞుడు, పరాపరజ్ఞానస్వరూపమగు వ్యష్టి మహాకారణ దేహాభిమానియైన ప్రజ్ఞుడు, సచ్చిదానందరూపమగు వ్యష్టికైవల్య దేహాభిమానియైన ప్రత్యగాత్మకూడి పిండాహంకారము. స్థూల ప్రపంచరూపమగు సమిష్టిస్థూల దేహాభిమానియైన విరాట్టు, అధిదేవతారూపమగు సమిష్టి సూక్ష్మదేహాభిమానియైన హిరణ్యగర్భుడు, మాయారూపమగు సమష్టికారణ దేహాభిమానియైన అవ్యాకృతుడు, సాభాసమాయావృత్తి రూపమగు సమిష్టి మహాకారణ శరీరాభిమానియైనఅఖండజ్ఞుడు, సచ్చిదానందరూపమగుసమష్టికైవల్య శరీరాభిమానియైన పరమాత్మకూడి బ్రహ్మాండాహంకారము. ఈ పిండ, బ్రహ్మాండములు, పిండ బ్రహ్మాండాహంకారములు నాల్గును గూడి యఖండమగు నొకటి యనబడును. ఈయొకటియొక్క వాస్తవ స్వరూపమును దెలిపెడి సద్గురు వేతల్లియు, తండ్రియు, రక్షకుడునగును. జననమరణ రూపమగు సంసార సముద్రమును దాటించి, రక్షించుట కతనికంటె వేఱగు రక్షకు లెవరులేరు. వ్యష్టి సమష్టిస్థూల సూక్ష్మకారణ మహాకారణ శరీరములు, వానియభిమానులు ఎఱుకయొక్క ఖండరూప

ములు. వ్యష్టి, సమష్టి, కైవల్య శరీరములు, వానియభిమానులైన ప్రత్యక్పరమాత్మలు అఖండ స్వరూపము. ఈ ఖండాఖండములుగ గనిపించుచున్న ఎఱుక కేవలాత్మ నావరించి మఱుగు పఱచుచున్నది. కేవలాత్మ నెఱుంగని యజ్ఞానులుదాని నావరించి ఖండాఖండములుగ గనిపించుచున్న ఎఱుకయే గొప్పదనుచున్నారు. అట్టి దురహంకారు లెఱుక యనెడికల లోనివారని తెలిసికొనుము. 56

కం॥ పరిపూర్ణ మొకటి చక్కని । శరమైన ప్రపంచమెల్ల - తగదెలియుముసీ । వెరుకేయని మదిలోపల । నెరుకే పరిపూర్ణ మెరిగే - దెరుకనెరిగేది * ఇంకోటిలే దీ - రెంటినెరిగేది * యెరుకపుట్టువుమూల - మెరుగని దీయెరుకే । యెరుకేతాముట్టిన - దెరుగబోయితె లేదం । చెరుక నెరిగేది * యింకోటిలేదీ - రెంటినెరిగేది * 57

భా॥ స్వతస్సిద్ధముగా నిండియున్న అచలపరిపూర్ణ కేవలాత్మ తప్ప తక్కిన సమస్తప్రపంచము ఎఱుకయేయని తెలిసికొనుము. ఎఱుక తోచినప్పుడు దానియందున్న వాసనానుసారముగ సమస్తప్రపంచము తోచుచున్నది. ఆ ప్రపంచమే యెఱుక కాశ్రయము. తనకాశ్రయమైన ప్రపంచమును తానే యెఱుగుచున్నది. ఎఱుక తనమూలమును విచారించి, యొచ్చటను లేదని తెలిసికొని, తాను తనతోవచ్చిన ప్రపంచముతో గూడ లేకపోయినచో నచలపరిపూర్ణ కేవలాత్మ స్వతస్సిద్ధమై నిండియుండునని యదియే యెఱుగుచున్నది. ఈ యెఱుకను,

పరిపూర్ణమును నెఱిగెడి మఱియొక యెఱుక లేదు. ఈ యెఱుకకు మూలములేదు. ఇది తనమూలము నెఱుగబోయినచో తానే లేకపోవుచున్నది. 57

కం॥ పాపములు పుణ్యములు భువి । ప్రాపించును
నెరుకచేత - భ్రమసినవారిన్ । బ్రాపింప వెరుకనెడసిన ।
తాపసులను చిత్తమందు - తగదెలిసికొనుమీ * ఆగామి
దో - ధను లెస్సవినుమీ * పాపలతోశుద్ధ - స్ఫటికసన్ని
భమైన । యాపోజ్యోతిని ప్రత్య - గాత్మని మదిలోన ।
తగదెలిసికొనుమీ * ఆగామి దో - ధను లెస్సవినుమీ * 58

భా॥ ప్రత్యగాత్మ భ్రూమధ్యస్థానములో నంతఃకరణము నందు ప్రతిబింబించుచున్నది. ప్రత్యగాత్మ, అంతఃకరణము, అంతఃకరణమునందలి ప్రతిబింబముకూడి యెఱుక యనబడును. ఈ యెఱుక జ్ఞానేంద్రియములతో గూడి సర్వవిషయముల నెఱుగుచున్నది. కర్మేంద్రియములతో గూడి సమస్తకర్మములు చేయుచున్నది. ఆ కర్మఫలముల నదిస్వయముగా ననుభవించుచున్నది. అది సర్వేంద్రియములతో గూడి సర్వకార్యములాచరించుచుండినను, నేత్రమునందు గల యెఱుపు తెలుపు నలుపురంగుల మధ్యనున్న సు నీలమైన పాపలోకళారూపమున శుద్ధస్ఫటికాకారముతో విశేషముగా ప్రకాశించుచున్నది. ఆదియే యూపోజ్యోతి. ఆ యూపోజ్యోతి ప్రత్యగాత్మకంటె భిన్నముకాదు. ఆపోజ్యోతిరూపమైన యెఱుకయే దేహేంద్రియములతో గూడి పుణ్యపాపకర్మములు చేయుచున్నది. వాని

ఫలములైన సుఖదుఃఖముల ననుభవించుచున్నది. అచల పరిపూర్ణ కేవలాత్మ పుణ్యపాపకర్మములు చేసెడికర్తకాదు. సుఖదుఃఖ రూపఫలముల ననుభవించెడి భోక్తకాదు. కర్తృత్వభోక్తృత్వములుగల యెఱుకయే తానని భ్రమసిన యజ్ఞానులకే పుణ్యపాపములు, సుఖదుఃఖములు సంభవించును. గాని, యెఱుకనువిడిచి యచలపరిపూర్ణ కేవలాత్మ స్థితియందున్నవారికి పుణ్యపాపములుగాని, వానిఫలములైన సుఖదుఃఖములుగాని సంభవింపవు. 53

కం॥ ఎరుకన్నను మరపన్నను। నెరుకకు నెరుకన్నదేహి - యనమాయయనన్। గురుతన సాక్ష్యనజ్ఞప్త్యన। స్ఫురణయనన్ ద్రష్టయనిన - చూడుమొక్కటిగ * ఇదిలేకుంటె - చూడమొక్కటిగా * మరిచలాచలముల - మర్మమెరిగెడిదన్న। నెరిగితాలేనని - యెగిరి పోయెడిదన్న। చూడుమొక్కటిగ * ఇదిలేకుంటె - చూడమొక్కటిగ * 54

భా॥ ఎఱుకయనినను, మఱపనినను, ఎఱుకను నెఱిగెడియెఱుకయనినను, దేహియనినను, మాయయనినను, గురుతనినను, సాక్షియనినను, జ్ఞప్తియనినను, స్ఫురణయనినను, ద్రష్టయనినను, ఒక్కయెఱుకయనియే తెలిసికొనుము. ఈ యెఱుక లేనిచో మనము దేనిని చూడజాలము. అచలపరిపూర్ణమైన కేవలాత్మయొక్కయు, చలనరూపమగు నెఱుకయొక్కయు మర్మముల నెఱుగునదియు, నామర్మముల నెఱిగినచో తానెచ్చటను నుండక యెగిరిపోవునదియు నెఱుకయే

భా॥ కొందఱీ యెఱుకను సాక్షియనుచున్నారు. ఆసాక్షికి "ఉదాసీనత్వము, నిర్వికారత్వము, స్వయంప్రకాశత్వము, వ్యవహారానుకూలత్వము" అను నాలుగు లక్షణములు గలవందురు. నేనా సాక్షిని అహమని నీతో చెప్పుచున్నాను. సాక్షి, అహము వేఱుకావు. ఈ రెండు నొక్కటియేయగును. మాటల భేదమేకాని, వస్తువునందే భేదములేదు. నోటితో చెప్పరానిదియు, చెవులతో వినరానిదియు, కనులతో కనరానిదియునగు బట్టబయలునందు తనకై తానేతోచి, తనకై తానే మటుమాయమైపోవు నీమాయ యెఱుకయే సాక్షియని, అహమని యనబడుచున్నది. 61

కం॥ వన్నియలై దొరకపోటను । పన్నగగలసినది
హృదయ - పద్మంబనుచున్ । నెన్నుదురుజనులు నెరుకం ।
దున్నాదని శ్రుతులుబల్కు - చున్నవినుమ్మీ * తెలియుచే
మోక్షః - మున్నవినుమ్మీ * వన్నెలన్నియు మీరి - యున్న
వస్తువుజాడ । నెన్నదెఱుంగక - యెన్నోరీతుల బల్కు ।
చున్నవినుమ్మీ * తెలియుటె మోక్ష - మున్నవినుమ్మీ * 62

భా॥ కొందఱు "ఎఱుపు, తెలుపు, పసుపు, నలుపు, సునీలము" అను నైదురంగులు కలిసిన కన్నుగ్రుడ్డే హృదయకమలమనియు, దానియందె ఱుక యున్నదనియు చెప్పుచున్నారు. శ్రుతులుకూడ నట్లే చెప్పుచు, దాని నెఱింగినచో మోక్షము కలుగునను చున్నవి. సర్వవర్ణములను, సమస్తకళలను మీరి స్వతస్సిద్ధమై నిండియున్న కేవలాత్మజాడ నెన్నడు

నెఱుగని మందబుద్ధులగు పామరుల నుద్దేశించి శ్రుతులనేక విధములుగ జెప్పుచున్నవి. వానినినమ్మి మూఢమానవులు నానా విధభ్రాంతులను పొందుచున్నారు. 62

కం॥ చులకనియు క్తిగ నొక్కటి । తెలిపెద విను సందియంబు - దీరుసుదీనన్ । పలుకున గలిగినయర్థము । పలుకును విడనాడిఏల్ల - బయటోటింకేది * రెండును నొక్క - పలుకే యైనాది * తెలియు మీలాగున - తెలివి దేహములయ్యె । తెలివే తనువునుబాసి - తెలివిస్థిరముగని ల్వ । బయటోటింకేది * రెండునునొక్క - పలుకేయైనాది * 63

భా॥ నీకు సులభముగా తెలియుటకొఱకు ఒక యుక్తిని చెప్పెదను వినుము. దీనిని నీవు గ్రహించినచో దీనితో నీసంశయములన్నియు దీఱిపోవును. లోకములోగల శబ్దములన్నియు నర్థముతో కూడియున్నవి. శబ్దమును విడిచి శబ్దార్థము వేఱుగానుండజాలదు. లోకులకవి వేఱుగా కనిపించినను, శబ్దము, శబ్దార్థము నొక్కటియే యగును. అట్లే దేహము, దేహములోనున్న తెలివి రెండును లోకులకు వేఱువేఱుగా కనిపించుచున్నను, రెండునునొక్కటియేయగును కాని వేఱు కావు. వేఱనిచెప్పినచో తెలివి దేహమును విడిచి వేఱుగా తెలియబడవలయునుగదా! అట్లు చ్చటను తెలియబడుటలేదు. తెలివిలేనిచో దేహము తెలియబడదు. కావున తెలివి దేహములు రెండును నొక్కటియనియే తెలిసికొనుము. 63

కం॥ ఎరుకై సభూతములనీ । వెరుగుము నారసము
గాద్పు - నింగిలమునునీ । క్లిరువంద నేలయనినే । నెరి
గిన పద్ధతిని నీకు - నెరిగించినాను * ముజ్జగముల - య్యే
ను వీనితోను * పరిపూర్ణమందు క - న్పడుచు తమకుదామె।
మరికానరావిట్టి - మార్గము కల వీని । నెరిగించినాను* ముజ్జ
గముల - య్యేను వీనితోను * 64

తా॥ ఎఱుకయే "ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి" అనునవైదుభూతములుగా నైనది. మరల నా పంచభూతము లెఱుకచేతనే యెఱుగబడుచున్నవి. ఎఱుకచే నెఱుగబడెడి యీపంచభూతములే స్వర్గమర్త్యపాతాళ లోకము లైనవి. బట్టబయలగు కేవలాత్మయందు మూలములేని యెఱుక, ఎఱుకలోని పంచభూతములు, వానివికారములైన స్వర్గమర్త్య పాతాళలోకములు ఎండమావులలోని జలమువలె కనిపించుచు, మటుమాయమై పోవుచున్నవి. కావున నిది యెఱుక యనెడి కలయని నీ కెఱిగించుచున్నాను. 64

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభు విరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కంజార్థదమువులయందు ఎఱుకలక్షణమను చతుర్థాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్య వర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురుమహరాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.



# 5. ఎఱుకోత్పత్తి లక్షణము

కం॥ ఎఱుకోత్పత్తిని దెలియగ । సరసిజగర్భాము
లైన - జాలరనెడిచో । నరుడెంతవాడు, వాడధి । యెరు
గుమనవట్టి మాట - లివి వింతగాక * తప్పను వాని - కిక
రాకపోక * అరసురలేక స - ద్గురుమూర్తి చరణపం । క
రుహ ద్వయార్చన - నెరుగని నరుమాట । లివివింతగాక *
తప్పదు వాని - కికరాకపోక * 65

భా॥ బ్రహ్మా విష్ణు మహేశ్వరాది దేవతలుకూడ నెఱుకయొక్క పుట్టుక నెఱుగజాలనప్పుడిక మానవుడెఱుగునని చెప్పుట హాస్యాస్పదము. దాని పుట్టుక నెవ్వడు నెఱుగజాలడు. దానికి పుట్టుకయున్నగదా! యెఱుగుటకు. పుట్టుకయేలేనిదాని పుట్టుక నెవ్వడెఱుగగలడు ? ఎవడైన నెఱుకయొక్క పుట్టుకను నేనెఱుగుదునని చెప్పినచో నది నిజమెఱుగనివాని విచిత్రమైన బూటకపుమాట. నిష్కల్మషహృదయముతో సద్గురుమూర్తి పాదపద్మములను సేవించి, వారివలన నిజము నెఱుంగనిమూఢుడే యెఱుక పుట్టువు నేనెఱుగుదునని మొఱుగును. అట్టివానికి రాకడపోకడలు తప్పవు. 65

కం॥ లేనెఱుకబయలులోపల । తానెట్లు జనించె
నని - తగవినువంధ్యా । సూనునిగతి, వియద్వల్లి ।ధానం
బున, యక్షరాజ - ధానివిధమున * రజ్జువుసర్ప - మైన

విధమునఁ * స్థాణుపురుషుని - చందాసమృగజల । శశ
విషాణము నరుస్వ - ప్నానందము గరాజ । చానివిధము
నఁ * రజ్జువుసర్ప - మైనవిధమునఁ * 66

భా॥ లేనియొఱుక బట్టబయలులో నెట్లు పుట్టిననియఁడి గెదవేమో చెప్పెదను. సావధానచిత్తముతో వినుము. గొడ్రాలునకు బిడ్డ, ఆకాశమునందు పుష్పము, యక్షులరాజధాని, త్రాటియందుపాము, మోడుచెట్టునందు దొంగ, ఎండమావులయందు జలము, కుందేటికి కొమ్ము, మానవుల స్వప్నము నం దానందము నా స్తనముగ పుట్టకపోయినను తోచుచున్నట్లు బట్టబయలునందు మూలములేని యొఱుక వా స్తనముగ పుట్టకపోయినను ఉన్నట్లు తోచుచున్నది. 66

కం॥ లేనెరుకను నెరుకనియన । లేనెరుకెట్లాయెన
నిన - తెస్సగ వినుమా । లేనిమృగ జలము వంధ్యా ।
సూనులు గలిగుండివెదకి - చూడలేనట్లు * ఈ లేనెరుక -
యేకలేదిట్లు * స్థాణువు పురుషుడు - శశవిషాణముగగన ।
సూనము నరునిస్వ - ప్నానందమువివెదకి । చూడలేనట్లు *
ఈ లేనెరుక - యేకలేదిట్లు * 67

భా॥ లేనియొఱుకను నెఱుకయని యెటుల చెప్పవచ్చునని యెదవేమో చెప్పెద వినుము. వా స్తవముగా ఎండమావులలో జలము లేకపోయినను, మరుమరీచికా జలమని పేరు వచ్చినది. గొడ్రాలికిబిడ్డ లేకపోయినను, గొడ్రాలిబిడ్డయని పేరు

వచ్చినది. దారువునందు పురుషుడు లేకపోయినను, దారుపురుషుడని పేరు వచ్చినది. కుందేటికి కొమ్ములు లేకపోయినను, కుందేటికొమ్మని పేరువచ్చినది. ఆకాశమునందు పుష్పములేకపోయినను, ఆకాశపుష్పమని పేరువచ్చినది. మనుజుల స్వప్నమునందానందము లేకపోయినను, స్వప్నానందమని పేరు వచ్చినది. ఇవియన్నియు నబద్ధములైనను చెప్పబడుచున్నట్లు, బట్టబయలగు కేవలాత్మయందు మూలములేని యెఱుక లేకపోయినను, నాలేని యెఱుకకే యెఱుకలోని నామరూప నటనలు తోచుచున్నవి. దీనిమూలమును విచారించినచో నిది యెచ్చటను నిలువక మటుమాయమైపోవును. 67

కం॥ ఎరుకోద్భవమెట్లన్నను। సరళంబగు నారికేళ - సలిలంబు భంగిన్। ఎరుకెట్లు పోవునన్నను। కరిమ్రింగిన వెలగపండు - కరణిగ నెరుగు * తిరిగిరాని - కరణియునెరుగు * పరిపూర్ణమున్నది - యెరుక తానెరిగితే। ఎరుకేమ్రుగ్గును భస్మా - సురుడు మ్రగ్గిననాటి। కరణిగ నెరుగు * తిరిగిరాని - కరణియునెరుగు * 68

తా॥ కొబ్బరికాయలోనికి నీరు వచ్చేడివిధముగా మూలములేని యెఱుక పరిపూర్ణమై నిండియున్న కేవలాత్మయందు తోచుచున్నది. ఏనుగుమ్రింగిన వెలగపండులోని గుజ్జువలెనది మరల మటుమాయమై పోవుచున్నది. ఈ యెఱుక తనమూలమును విచారించి, యెచ్చటనులేదనియు, అచలపరిపూర్ణ కేవలాత్మ అంతటను స్వతస్సిద్ధమై నిండియున్నదనియు తెలిసి

కొనిన వెంటనే నది భస్మాసురునివలె నాశమొందుచున్నది. పూర్వము భస్మాసురుడను రాక్షసుడు తపస్సుచేసి, శివుని మెప్పించి, యతనివలన తనచేతులను నెత్తినపెట్టినవాడు భస్మమైపోవునట్లు వరమునుపొంది, యావరమును పరీక్షించుటకొఱకా శివుని నెత్తిమీదనే తనచేతులను పెట్టబోగా నతడు భయపడి పలాయనము చిత్తగించెను. ఇంతలో విష్ణుమూర్తి ప్రత్యక్షమై నీవు స్నానముచేసివచ్చినచో నతడునీకిచ్చిన వరము ఫలించునని చెప్పగా, నా భస్మాసురుడు సమీపమందున్న నొక చిన్న మడుగులోదిగి స్నానముచేయుచు, తన నెత్తిన తానే చేతులు పెట్టుకొని భస్మమైపోయెను. అట్లే యొుక తనకుమాాల మెచ్చటను లేదనియు, అచలపరిపూర్ణ కేవలాత్మఅంతటను స్వతసిద్ధమై నిండియున్నదనియు తెలిసికొనగనే తానెచ్చటను నిలువక మటుమాయమై పోవుచున్నది. 86

కం॥ సంతోషాసంతోషము । లంతలొగనవచ్చి పిదప - నరుగునెచటికో । వింతై యున్నది చూచితె । ఇంతియెనుమియెరుకపుట్టు - వికతెలిసికోరా ॥ సంశయమేల- యిదినమ్ముకోరా ॥ యెంతని తెలుపుదు - నీ దేవపూర్గము। నంతట బహావన్నె - లగుపడి యగుపడ । వికతెలిసికోరా॥ సంశయమేల - యిదినమ్ముకోరా ॥ 69

భా॥ మానవుల కొకక్షణములో సంతోషము గలుగుచున్నది. మఱియొక క్షణములో నా సంతోషముపోయి దుఃఖము కలుగుచున్నది. ఇంకొకక్షణములో మరల దుఃఖము

పోయి సంతోషము కలుగుచున్నది, ఈ సంతోషా సంతోషముల రాకడపోకడ లతి విచిత్రములుగా నుండును. వినివలెనే యెఱుకయొక్క రాకడపోకడలుకూడ నతివిచిత్రములుగా నుండును. స్వతస్సిద్ధమైయున్న అచలపరిపూర్ణ బ్రహ్మమునందీ మూలములేని యెఱుకతోచి, యెన్నియో వన్నెచిన్నెలను జూపి, తుదకు తనమూలమును తాను విచారించగనే తనవన్నెచిన్నెలతో తానే మటుమాయమై పోవుచున్నది. ఇట్టి దేవ మార్గమును నేను నీకెంతని బోధింపగలను ? దీనినిబట్టి నీవే తెలిసికొనుము. 69

కం॥ రాకడపోకడలేకయె । యేకస్థితినుండునట్టి - యూబయలంచున్ । రాకడపోకడగలిగియ । నేకముగా బో చులేని - యెరుకసుశీల * ప్రతిమలోలేని - పెరుమాళ్ళ లీల * లేకతోచినయెరుక - లేనేలేదనుచు నీ । కీకీలుగురు నిచే - నెరుకై తేచాలుళ్ల । క్కెరుకానుశీల * ప్రతిమలోలేని- పెరుమాళ్లలీలా * 70

భా॥ శిల్పులచే చేయబడి, మనచే దేవాలయములలో ప్రతిష్ఠింపబడి, పూజింపబడుచున్నదారు లోహపాషాణాది ప్రతిమలలో నిజముగా పెరుమాళ్లు లేకపోయినను భ్రాంతులు పెరుమాళ్లని భావించి పూజించుచున్నట్లు, రాకడపోకడలు లేక యొకేవిధముగ స్వతస్సిద్ధమైయున్న బట్టబయలులో రాకడపోకడలు కలిగి యనేక నామరూప నటనాది వికారములతో గూడియున్న మూలములేని మాయయెఱుక భ్రాంతులకుసత్య

ముగా దోచుచున్నది. లేకయేయున్నట్లు తోచుచున్న నీ మాయయొక్క యెన్నడును లేనే లేదనెడి రహస్యమును సద్గురుస్వామివలన నెఱింగినచో నీమాయయొక్క యుళ్ళిక్కయై యెచ్చటను నిలువక మటుమాయమై పోవును. 70

కం॥ వనిగల్గు చకముతోపల । తనకై తావచ్చితనకు-
తానేగువిధం । బునపరిపూర్ణముతోపల । తనకై తావచ్చి
యెరుక - తనకై తాజనును * అచలంబున్న - దని తానెరి
గినను * తనలేమి నిజమని - తనకే తోచునుతోచి । తన
కల్మిమృషగథా - వసచేసి నిలువక । తనకై తాజనును *
అచలంబున్న - దని తానెరిగినను * 71

భా॥ ఒక్కొక్క సమయములో వర్షముకురియునప్పుడా వర్షముతోపాటు నడగండ్లుకూడ తమంతటతామే వచ్చుచుండును. మఱికొంతసేపటికవి తమంతటతామే నశించిపోవుచుండును. అదేవిధముగ నచలపరిపూర్ణ బ్రహ్మమునందెఱుక నొక్కొక్కప్పుడు తనంతటతానే వచ్చుచున్నది. తానువచ్చునప్పుడు తనయందున్న వాసనానుసారముగ నామరూపనటనాత్మక ప్రపంచమును కూడ తనతో తీసికొని వచ్చుచున్నది. మరల తనంతటతానే తనసంపదతో మటుమాయమై పోవుచున్నది. తాను తనసంపదతోకూడి రాకపూర్వమును,వచ్చిన పిదపను, పోయిన తరువాతను, సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందు నచలపరిపూర్ణ బ్రహ్మము స్వతస్సిద్ధముగనున్నదని యెఱింగినచో నది తనం

తలతానే తనలేమిని, తనతో తీసికొనివచ్చిన నామరూపనట నాత్మక ప్రపంచముయొక్క మిథ్యాత్వమును తెలిసికొని తన సంపదతో తాను మటుమాయమై పోవుచున్నది. 71

కం॥ పరిపూర్ణములో దోచుచు । నెరుకేచను తనకు తానె - యేర్పడవినుమీ । తొరటలు తొమ్మిదిగలదై । తరి తీపులనొందుచుండి - తనువనదగుచు * అచలంబున్న - దనితాలేననుచు * మరుగిల్లెరుకను దెలియ - యెరుకేనిలు వదుగాని । పరిపూర్ణముంకుదా - న్నెరిగేదెట్లికగుర్తు । తను వనదగుచు * అచలంబున్న - దనితాలేనను చు * 72

భా॥ అచలపరిపూర్ణ బ్రహ్మమునందు మూలములేని గుర్తెటిగెడి యెఱుక తనకుతానే తోచుచున్నది. మరల తనకు తానేమటుమ్మాయమై పోవుచున్నది. శ్రోత్రరంధ్రములురెండు, నేత్రరంధ్రములు రెండు, నాశికారంధ్రములు రెండు, రసనా రంధ్రమొకట, గుదగుహ్య రంధ్రములు రెండు మొత్తము తొమ్మిది రంధ్రములుగల మేనుతోగూడి "నేను, నేను" అని వ్యవహరించెడి యెఱుక మేనుకంటె వేఱుకాదు. నేను మేను లొకదానినివిడిచి మఱొకటి యుండజాలవు. ఈనేను మేనుల రూపముగనున్న ఎఱుక తనతోవచ్చిన స్త్రీపుత్రధనాదిసమస్త సంపదనుజూచి మురిసిపోవుచుండును. వానికికలిగెడి హానివృద్ధు లకు ఖేదమోదములను పొందుచుండును. ఆ యెఱుక కేవ లాత్మయొక్క యునికిని, తనలేమిని గుర్తెఱిగినచో తానేలేక పోవుచున్నదిగాని, సర్వకాలములయందును, సర్వదేశముల

యందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగానిండి నిబిడీకృతమైయున్న కేవలాత్మ స్వతస్సిద్ధముగనుండును. దాని నెఱుగున దేదియు లేదు. 72

కం॥ తొలకరి మెరుపులకై వడి । పొయుపుగనీళ్లందు దోచు-బుగ్గలరీతిఁ । నలసూర్యకిరణమందున । గలనీరము వలెనె యెరుక - గనిపించునయ్యా * అంతలోనెచట - గని పించదయ్యా * కలకాలమొకరీతి - గలిగుండదీయెరుక । తిల కింప పవలురా - తిరితిరుగు విధమున గనిపించునయ్యా * అంతలోనెచట - గనిపించదయ్యా * 73

భా॥ తొలకరిలోని మెఱుపులవలెను, నీటిలోనిబుడగల వలెను, ఎండమావులలోని జలమువలెను నీ యెఱుక కనిపించుచు, మరల వెంటనే మాయమాయమై పోవుచున్నది. అచల పరిపూర్ణ బ్రహ్మమువలె నిది స్థిరముగా నిలిచియుండ జాలదు. నిరంతరము రాత్రింబవళ్ళు మారిమారి తిరుగుచున్న విధముగా నీయెఱుక రాకడపోకడలు కలిగి చంచలముగానుండును. దీనికి స్థిరమైన నిలకడలేదు. 73

కం॥ కట్టెందు నిప్పులేకయె । కట్టియ నొకపమయ మందు - గనుపడిబహుగా । మిట్టిపడి తుదకు గనుపడ । దట్టిదెనుమి యెరుకపుట్టు - వమలవిచార * తనకుదానె - యరుదెంచెనౌర * పుట్టు గిట్టుటలను - నట్టేటనిలిచుండి । బట్టబయలుపొవ - గట్టిన కనుపడ । దమలవిచార * తనకు

వానె - యనుదెంచెనౌర * 74

భా॥ నిర్మల విచారముగల శిష్యా ! సహజముగా కట్టె యందు నిప్పు కనపించదు. ఆకట్టెపైన మఱియొకకట్టెనుంచి మథించినచో నిప్పుపుట్టును. ఆ నిప్పుపైన కట్టెలను వేసినచో పెద్దమంటమండి, యాకట్టెలనన్నిటిని కాల్చివేసి, తుదకుతాను కూడ సమసిపోవుచున్నది. అటులనే మూలములేని యొటుక తనంతటతానే తన పరిహారముతోవచ్చి, తనకుతానే సంసారమును వృద్ధిపఱచి, తుదకు తన సంసారముతోకూడ తానే నశించిపోవుచున్నది. ఇట్టి చావుపుట్టువులుగల సంసార సముద్రమునందుండి, గురుదేవుని యనుగ్రహమువలన చావుపుట్టుకలులేని బట్టబయలగు కేవలాత్మ స్వతస్సిద్ధముగ నిండియున్నదని యెఱింగినచో చావుపుట్టువులుగల యొటుక దానిమాయ సంసారముతో మటుమాయమై పోవుచున్నది. 74

కం॥ తనమూలము తలిదంద్రులు । తనవలెనేవారు
వారి - తలిదండ్రులకును । తనవలెనెగానియన్యము । గన
జననస్థానమొకటి - గలదనతరమా * బ్రహ్మాదుల - కది
తెలియతరమా * వినుము నీ బ్రహ్మాండ - జననము నీ
నాయం । దునసై నదిదియుగా - దని వేరేయింకోటి । గల
దనతరమా * బ్రహ్మాదుల - కదితెలియతరమా * 75

భా॥ ఈ యొటుక స్వప్నమునం దుద్బుద్ధ స్వప్నభోగ దాయకవాసనల ననుసరించి స్వప్న పదార్థ పదార్థజ్ఞానములుగా నొకేపర్యాయము తోచి, తోచినపిదప వానియందు

కార్యకారణ భావసంబంధము కల్పించుచున్నట్లు, జాగ్రత్త యందుకూడ నా యొక్క యే యున్నద్ధ జాగ్రద్భోగదాయక వాసనల ననుసరించి, జాగ్రత్ప్రకాశ విజ్ఞానములుగా నొక్కొ పర్యాయము తోచి, తోచినపిదప వానియందు కార్యకారణ భావ సంబంధము కల్పించుచున్నది. వాస్తవముగ దేనికేదియు కారణముకాదు. దేనికేదియు కార్యముకాదు. అయినను మన ము భ్రాంతిచే మనకు కారణము మన తలిదండ్రులైనట్లును, వారికి కారణము వారితలిదండ్రులైనట్లునుతలంచుచున్నాము. ఇట్లు తలంచినచో సనవస్థాదోషము సంభవించును. మఱియు నీవిధముగ తలంచుటయేకాని, ఇందెవరికిని వేఱే జన్మస్థాన మొ కటున్నదని చెప్పుట సరికాదు. వీరి జన్మస్థానమును తెలియుట బ్రహ్మాదులకైనను సాధ్యపడదు. ఈబ్రహ్మాండమంతయు నీనా భ్రాంతివలన తోచుచున్నదేకాని, దీనికింకొక కారణముగలదని చెప్పుట కేవలితరమునుగాదు. 75

కం॥ కనరాని దానిఖాన్యం । బనియనదగుగాని బ యలు - ననదగదు సుమీ । కనవచ్చుచున్నదిందులో । కనుగొనుటకు నెరుకలేదు - కనుగొనరాదా * యెరుకను శూన్య - మని యనరాదా * కనవచ్చెనాలేద - కనుగొంటి లేదాని । యనరాద భయమేమి - యనుమానించకుమిదిగో, కనుగొనరాదా * యెరుకను శూన్య - మనియనరాదా * 76

భా॥ ఒకకాలమునందుండి మఱియొక కాలమునందు లేని దానిని, ఒక దేశమునందుండి మఱియొక దేశమునందు లేని

దానిని, ఒక వస్తురూపముగనుండి మఱియొక వస్తువునందు లేనిదానిని శూన్యమనదగును గాని, సర్వకాలములయందును, సర్వదేశములయందును, సకల సద్వస్తువులయందును సంపూర్ణముగనిండి స్వతస్సిద్ధమైయున్న కేవలాత్మను శూన్యమన రాదు. స్వతస్సిద్ధమైనిండియున్న కేవలాత్మ నెఱిగెడి యెఱుక యే కాలమునందును, ఏదేశమునందును ఏవస్తురూపముగను లేదు. కావున నెఱుకను శూన్యమని తెలిసికొనుము. స్వతస్సిద్ధమైనిండియున్న కేవలాత్మయునికిని, మూలములేకయే లోచెడియెఱుకయొక్క లేమిని నీవునిస్సంశయముగా తెలిసికొంటివా? లేదా? తెలిసికొనినచో నేను తెలిసికొంటినని నీవు దృఢముగా చెప్పుము. అనుమానమునుగాని, భయమునుగాని పొందకుము.

కం॥ ఎఱుకబయలందు లేమి ని । నెఱుకను శూన్యంబటంచు - నెఱిగించబడెన్ । నెఱుగుమిదెయాకసంబి । జ్జరిగిన నెరుకాకసములు - నేకమౌగదరా * అకసముబయ - లేకమెట్లౌరా * పరిపూర్ణ మిదిగో క - న్నుకు శూన్యమన రాదు । ఎఱుగుండు మెదిరిస్తే - యిజ్ఞానాచెయి చూచెద । వేకమౌగదరా * ఆకసముబయ - లేకమెట్లౌరా * 77

భా॥ బట్టబయలగు కేవలాత్మయం దెఱుకే యెన్నడు లేదు. కావున నెఱుక శూన్యమనబడెను. సర్వపదార్థము లుండుట కవకాశమిచ్చెడి భూతాకాశము శూన్యమైనట్లే యెఱుకయు శూన్యమేయగును. శూన్యములగుటచే నీరెంటి కి భేద

ముతేదు. యథార్థమెఱుగని యజ్ఞానులు కొందఱు భూతాకాశ మును బట్టబయలగు పరిపూర్ణబ్రహ్మమందురు. శూన్యమైన భూతాకాశము నిరాకారమై, స్వతస్సిద్ధముగ నిలిచియున్న బట్టబయలుకాదు. నిషేధముఖముగా తెలియబడుచు నపరోక్షమై స్వతస్సిద్ధముగ నిలిచియున్న బట్టబయలగు కేవలాత్మశూన్యము కాదు. ఇతరభూతభౌతిక పదార్థములవలెనిది పరోక్షముకాదు. పరోక్షముగ తెలియబడెడి పదార్థములన్నియు విధిముఖ ప్రతీతికి విషయములగుటచే శూన్యములు. బట్టబయలగు కేవలాత్మ నిషేధముఖముగ తెలియబడుచున్నది. కావున దీనిని నీవపరోక్షముగా తెలుసుకొనుము. అట్లెఱుగక నాతో నెదిరించి వాదించితివేని నాచేతిని చవిచూడవలసివచ్చును సుమా. 77

కం॥ కనబడెడు బయలులోపల । కనుగొనలేదయ్యె
నెరుక - కావున శూన్యం । బనవలసెదీనినాకస । మనవల
సెను దీనవిశ్వ - మాయెనోయప్పా * యింతకువేరే-మాయ
లేదప్పా * కనుకనె యీవిశ్వ - మును లేనిదనిలెప్ప ।
వినజెప్పనాయెను - గనబోకుండని పోని । మాయనోయ
ప్పా * యింతకు వేరే మాయలేదప్పా * 78

భా॥ అపరోక్షమై తెలియబడెడు బట్టబయలులో విచారించగా నెఱుకలేదు కావున నిదిశూన్యమనియు, భూతాకాశసమమనియు ననబడును. బట్టబయలైన కేవలాత్మయం దిది మూలములేకయే తోచుచున్నది. ఇది తోచినప్పుడు దీనియందున్న వాసనల ననుసరించి నామరూప నటనాత్మ విశ్వము

తోచుచున్నది. ఈ తోచుచున్న విశ్వమూ యెఱుకకంటె వేఱు కాదు. లేనియెఱుక జగముకు లేక కాలములోతోచి, నానావిధ భ్రాంతులను కలిగించి ఎరల నేకకాలములోనే లేకపోవు చున్నవి. కావున నీవిశ్వముకూడ లేనిదేయగును. మూలము లేకయే తోచి, నానాభ్రాంతులను కలిగించి, నాశమైపోయెడి యెఱుకజగములకంటె వేఱునూయ లేదు. నీవిలేని యెఱుక జగముల భ్రాంతిని పొందకుము.

కం॥ అహమునకుగదా యచలము । అహమున్న
దొలేదొ చూడ - నది నిజమేకదా । అహముసుబుట్టించదు
గద । అహ ముజయించేటివరకే - యదియున్నదికదా *
అహమే విశ్వ - మైనిలిచిందికదా * అహమె యామ
చ్ఛిష్ట - నన్నింమ్నెరుగునుగద । అహమేతాలేనని - యరిగి
తే సరికద । అదియున్నది కదా * అహమేవిశ్వ - మైని
లిచింది కదా * 79

భా॥ అచలపరిపూర్ణ కేవలాత్మ "నేను" అని యన జాలదు. అది "నేను, నేను" అని వ్యవహరించెడి యహంకారమును చూడదు. అహంకారము నది పుట్టించదు. ఇది సత్యమేకదా! అహంకారమునకు మూలములేదు. మూలము లేని యహంకారము నామరూపనటనాత్మక విశ్వముగాతోచి యచలపరిపూర్ణ కేవలాత్మను మఱుగుపఱుచుచున్నది. అహమే యీ నామరూపాత్మక విశ్వనటనలనన్నిటి నెఱుగుచున్నది. ఈ యహమే తనమూలమును విచారించి యెచ్చటలేదని

తెలిసికొని యఱిగినచో మేఘావరణము తొలగిన భాస్కరుని వలెనచలపరిపూర్ణ కేవలాత్మ స్వతస్సిద్ధమై నిలిచియుండును. 79

కం॥ ఆవరణము నాకసము ని । రావరణము నచల
మనుచు - ననిరి మహాత్ముల్ । ఆవరణము మితిగల్గిన ।
దావరణములేని దమిత - మని తెలిసికోరా * యీరెంటి
నివే - రనికనుక్కోరా * ఆవరణముననే ని - రావరణ
మునుజూచి । యావరణ మెడలిన - నావలమాట లే । దని
తెలిసికోరా * యీరెంటిని వే - రని కనుక్కోరా * 80

భా॥ ఆకాశరూపమైన యెఱుక ఆవరణముగలది. అచల పరిపూర్ణ కేవలాత్మ నిరావరణమైనది. మహాత్ములీరెంటి విషయము బాగుగా నెఱిగిచెప్పిరి. ఆవరణరూపమైన యెఱుక పరిమితమైనది. నిరావరణమైన యచలపూర్ణ కేవలాత్మ యపరిమితమైనది. నీవీ రెంటిని వేఱని తెలిసికొనుము. ఆవరణాత్మకమైన యెఱుకలో నిరావరణమైన యచలపరిపూర్ణ కేవలాత్మ స్థితిని తెలిసికొని, ఆవరణాత్మకమైన మూలములేని యెఱుకను విడిచినచో నావలనేమాటయు లేదని తెలిసికొనుము. 80

కం॥ ఆకాశము శూన్యంబని । లోకులు మొరపెట్టి
దాని - లోపవనాదుల్ । ప్రాకటముగ బుట్టినవని । చీకా
కుగ చెప్పినారు - చీవినరాదు * వంధ్యాసంతి - క్షితిలోన
లేదు * కాకుండు వినుచోద్య - మౌకుంచేటికి కొమ్ము । ఏకా
లముననెమే - మేకంటి మనుమాట । ఛీ వినరాదు * వంధ్యా

సంతి - షితిలోన లేదు * 81

భా॥ లోకు లాకాశమును శూన్యమనిచెప్పుచు, దాని నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలమునుండి భూమి, భూమినుండి అన్నము, అన్నమునుండి ప్రజలుపుట్టినారని చీకాకుగా చెప్పుచున్నారు. చీచీ వీరిబూట కపు మాటలను వినరాదు. వీరి బూటకపుమాట లెట్లుండు ననగా - గొడ్రాలుకు బిడ్డపుట్టినదని చెప్పినట్లు విపరీతముగా నుండును. మఱియు కుందేటికొమ్ములను నేమిప్పుడే చూచి వచ్చితిమనువారి మాటలవలె నాశ్చర్యముగనుండును. కావున వారిమాటలు నీవువినరాదు. ఈజాగ్రత్ ప్రపంచము స్వప్న ప్రపంచమునవలె తోచుచున్నదికాని, యిది దేనినుండియూ పుట్ట లేదు. పుట్టినదనుమాటయే అబద్ధము. 81

కం॥ లేనెరుకను బయలందున । లేనేలేదనకయితరు-
లేలపలికిరో । లేనిదికలదని పిదపను । లేనేలేదనుచుసిగ్గు -
లేక యూలీల * చీవినకీచీ - కాకునీకేల * మేసందశుద్ధము-
తానలదుకొని మళ్లి । పూనికడిగిన రీతి - యౌనుసిగ్గొక
యింత । లేకయూలీల * చీవినకీచీ - కాకునీకేల * 82

తా॥ వాస్తవముగా బట్టబయలగు కేవలాత్మయందు మూలములేని యెరుకయే నేలేదు. ఈయెరుకయొక్క లేమిని ఉంగని యజ్ఞానులు కొందఱు లేనియెఱుకను ఉన్నదనియు, మరలలేదనియు, నిదిసాధనలచే నశించిపోవుననియు సిగ్గులేక నానావిధములుగా చెప్పుచున్నారు. చీచీ నీవట్టి చీకాకుమాట

లను వినబోకుము. శరీరమునం దనేధ్యమును బూసికొని, మరల నాయనేధ్యమును కడిగికొనుసటుల పామరజనులు యథార్థమును విచారింపక యే సిగ్గునువిడిచి మూలములేని యొఱుకయున్న దనియు, మరలలేదనియు నానావిధముల పలికెడివింత మాటలను నీవు వినవలదు. వినినచో అవి నీకు చీకాకును గలిగించును. 82

కం॥ అన్నపు సూక్ష్మాంశము మన । సెన్నగ నీరంబు ప్రాణ - మెరుగుము నీరెం । డెన్నడు కలియవొనాడే । సున్నసుమీ యెరుకమూట - సుగుణసంపన్నా * కలియుచె యెరుక - సుమి యింతకన్నా * ఉన్నదెరుకకు మూల - మన్నది వినలేదు । ఎన్నడు నీభ్రాంతి - నిన్నంటనియ్యకు । సుగుణ సంపన్నా * కలియుచె యెరుక - సుమి యింత కన్నా * 83

భా॥ మనము భుజించెడి అన్నము జీర్ణమై మూడు భాగములగుచున్నది. అందుసూక్ష్మభాగము మనస్సుగను, మధ్యభాగము మాంసముగను, స్థూలభాగము పురీషముగను నగుచున్నది. అట్లే మనముత్రాగెడి జలముకూడ జీర్ణమై సూక్ష్మభాగము ప్రాణముగను, మధ్యభాగము రక్తముగను, స్థూలభాగము మూత్రముగను నగుచున్నది. ఇందు అన్నముయొక్క సూక్ష్మభాగమైన మనస్సును, జలముయొక్క సూక్ష్మభాగమైనప్రాణమును కలిసినప్పుడే శరీరమునందెఱుక కలుగుచున్నది. ఈమనో ప్రాణములు రెండును కలియనినాడు ఎఱుక

యే యుండదు. మనో ప్రాణముల కలయికయే యెఱుకగాని దీనికింకొక్కడను మూలములేదు. ఇంతకంటె వేఱుగా దీనికి మూలమున్నదనెడి భ్రాంతిని నీవెన్నడు పొందకుము. 83

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశికప్రభు విరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు ఎఱుకోత్పత్తిలక్షణమను పంచమాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురుమహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.

---

## 6. ఎఱుక నువిడిపించుట

కం॥ పిల్లలు తాటాకులతో । పిల్లలగావించి పెండ్లి-పేరంటంబుల్ । కొల్లలుగ జేయువారల । తల్లులుగని సత్య మనుచు - తలచేర మదిని * నిను నీవిట్లు - తలచరా మది ని * కల్ల సంసారము - గని మానవులు సంత । సిల్లగ గురుమంత్ర - సిద్ధులు నిజమని । తలచేర మదిని * నిను నీవిట్లు - తలచరా మదిని * 84

భా॥ పిల్లలు తాటాకులతో బొమ్మలనుజేసి, వానికి పెండ్లిండ్లు, పేరంటములు, విందులు మొదలగు వేడుకలనుజేసి, యవి సత్యములని భావించి సంతోషముగా నాడుకొందురు. వారి తల్లులు తమపిల్లలు చేయుబొమ్మల పెండ్లిండ్లు, పేరంటములు మొదలగువానిని మిథ్యగా తలంచి, యివి పిల్లల ఆట

లనుకొని యుపేక్షింతురుగాని, సత్యములని తలంపరుగదా! అట్లే పామరులు పిల్లలుచేసిన ట్లే మిథ్యా సంసారము సత్యమని తలంచి, యా సంసారమునందుగల కొడుకులు, కూతుర్లు మొదలగు వారికి పెండ్లిండ్లు, పేరంటములు, విందులు, వినోదములు మొదలగునవిచేసి సంతోషించుచున్నారు. మఱియు వారు మానవులకేకాక, తాము కల్పించుకొనిన దేవుళ్ళ బొమ్మలకుకూడ పెండ్లిండ్లు, పేరంటములు, పల్లకింపు సేవలు, నృత్య గీతవాద్యాదులతో చేయుచు,నివియన్నియు సత్యములని తలంచి, యానందించుచున్నారు. గురుమంత్రసిద్ధిని పొందిన పరిపూర్ణు లివియన్నియు పిల్లల చేష్టలని తలంచి యుపేక్షించెదరు కాని, సత్యములని తలంపరు. 84

కం॥ మేనెరుకల రెండింటిలో । దానిని నిది దీనినదియు - తగసృజియించున్ । మేనెరుక లివియుమూలము । లేనిదె సృజనయ్యె ననుచు - లేనేలేవంటి * అంతే తప్పు - లేనేలేదంటి * మేనెరుకలిప్పుడు - దేనందున్నవొ చూచి । లేని మేనెరుకలు - లేనివనుచు నమ్ము । లేనేలేవంటి * అంతే తప్పు - లేనేలేదంటి * 85

భా॥ ఎఱుక యుండినప్పుడే శరీరము తెలియబడుచున్నది. శరీరముండినప్పుడే దాని నాశ్రయించుకొని యెఱుక తోచుచున్నది. ఇవి రెండును పరస్పరాపేక్షితములై యున్నవి. ఇవియొకదానిని విడిచి మఱియొకటి యుండనేరవు. ఇవి రెండును కలిసి మూలము లేకయే తోచుచున్నవి. మరల రెండును

కలసి మటుమాయమై పోవుచున్నవి. కావున నివి రెండును లేనివనియే నేను నీకు చెప్పుచున్నాను. ఇట్లు చెప్పుట తప్పు కాదనుకొనుచుంటిని. నీ వీ నేనెఱుకలు రెండును దేనియందున్న చో చూచి, యీ మూలములేని నేనెఱుక లెప్పుడు లేనివనియే నమ్ముము. 85

కం॥ ఎరుక పనిచేయవనకుము । ఎరుగుట మరచుటలు రెండు - నెవ్వరి పనులో । ఎరిగింపుము నామ్రోలను । వెరునను తప్పితివె దెబ్బ - వేసెదచూడు * అప్పనకుండ - జేసెద నేడు * వెరపించుటే దెబ్బ - వేసేన నాతంత్రి । యెరిగించి పైమర్మ - మెరుకను నేదీసి । వేసేను జూడు * అప్పనకుండ - జేసెద నేడు * 86

భా॥ పామరులు కొందఱు ఎఱుక యేపనియు చేయదు, అది నిర్వికారముగా నుండునని చెప్పుచున్నారు. అది సరికాదు. "ఎఱుగుట, మఱచుట" అను రెండుపనులు దేహముతో కూడి యెఱుకయే చేయుచున్నది. ఇంతకంటె భిన్నముగా నీరెండు పనులెవరు చేయుచున్నారో, నీవు నాకు చెప్పుము. నీవు తప్పుగా చెప్పితివేని నీపైన దెబ్బవేసి, ఇక నెప్పుడు తప్పుచెప్పకుండా చేసెదనుసుమా ! బిడ్డా ! నీవు సత్యము తెలిసికొని చెప్పుట కొఱకు దెబ్బవేసెదనని నిన్ను భయపెట్టితినికాని, నిజముగా నేను నీపైన దెబ్బ వేసెదనా ! నీవు భయపడకుము. నీకు పైమర్మము నెఱిగించి, యెఱుకను విడిపించెదను. 86

కం॥ లేనికల గలిగినప్పుడు । దానికి దశదిశలయం

డు - తగమొదట కొనటా । తానంటకున్న మేల్కను ।
లేనికలే చూచెనేని - లేకపోవుగదా * కలతో మేల్క -
లేకపోదుగదా * లేనెరుక బయలు ఏ - లాగున నీకెపుడు ।
గానవచ్చితె బోధ - గావలెననపుడు । లేకపోవుగదా *
కలతో మేల్క - లేకపోదుగదా * 87

భా॥ కలవచ్చినప్పు డాకలకు మొదటను, చివరను,దాని కన్నివైపులను మెలకువ నిండియుండినను, దానిని కల యెంత మాత్రమంటుకొనదు. ఈ లేక తోచెడికల తెనకన్ని వైపుల నిండియున్న మెలకువను గాంచినచో కలకల్లయై పోవుచున్నది గాని, యాకలతోపాటు మెలకువెచ్చటకిని పోదు. అట్లే లేని యెఱుక తోచినప్పు డది తోచుటకుముందును, నశించిన పిద పను, తోచితరువాత దానికన్నివైపులను నిండి నిబిడీకృతమైయున్న బట్టబయలగు కేవలాత్మ నదిగాంచినచో నీయెఱుక యెందును నిలువజాలక యెగిరిపోవుచున్నది కాని, దానితో పాటుబట్టబయలగు కేవలాత్మ యెచ్చటికినిపోదు. అది సర్వ కాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును స్వతస్సిద్ధమై నిలిచియుండును. 87

కం॥ ఒంటునుదావల బింద్వోం । ట్లంటించిన కొలది లెక్క - యధికంబగు నా । వంటును వలపలబింద్వొక । టంటించిన లెక్కయుళ్ల - క్యాగదనోయి * ఒంటుండిలేం - దౌగదనోయి * తంటాదీరను చూడు - దానివలెనెయెరుక ।

కం॥దెబయలును తాను-గలిగుండి తనకుళ్ల । క్యాగదనోయి*
ఒంటుండిలేం - దొగదనోయి * 88

భా॥ ఒక కాగితముమీద 'ఒకటి' అను అంకెనువేసి, దానికి దాపల ప్రక్కన సున్నలుగాని, అంకెలుగాని వేయుచున్న కొలది లెక్క పెఱిగి పోవుచుండును. ఆ ఒకటికి వలపల నొకసున్నను పెట్టినచో నప్పుడు 'ఒకటి' అను అంకె యుండినను, అది లేనిదిగనే పరిగణింపబడును. అట్లే యొఱుక యొక్కటి తోచగనే దానివెంట నానావిధములగు నామరూపనటనలు, నానావిధ భ్రాంతులు కలిగి, నానావిధ దుఃఖము లనుభవింపబడుచున్నవి. ఆ యొఱుకయే బట్టబయలగు కేవలాత్మయొక్కయునికి నెఱింగినచో తానుండినట్లు తోచుచుండినను, లేనిదియే యగును. 88

కం॥ ఎరుకొక్కటుంపె నేనియు । నెరుకే యావిశ్వరూప - మేర్పడ దాల్చు । ఎరుకొక్కటి లేకుండిన । నెరుకైన ప్రపంచమున్న - దెవరెరిగేరికను * లేదననైన-నెవరుండేరికను * పరిపూర్ణమైనట్టి - బయలుండ గనిపెట్టి । గురుని వాక్యముబట్టి - గురుతు పోగొట్టితే । నెవరెరిగేరికను * లేదననైన - నెవరుండేరికను * 89

భా॥ అచలపరిపూర్ణ కేవలాత్మయం దెఱుక యొకటి తోచగనే దానియందున్న వాసనానుసారముగ నది విశాల విశ్వరూపమునుదాల్చి, యావిశ్వములోనున్న నామరూప నటనల నన్నింటిని నెఱుగుచున్నది. ఎఱిగెడి యొఱుక లేకపోయి

నచో దానితోపాటు తోచెడి నామరూప నటనాత్మక ప్రపంచము నెఱుగు వారెవ్వరు ? లేదని చెప్పుటకైన నెవరుండెదరు? అచలపరిపూర్ణ కేవలాత్మ యునికి నెఱిగి గురువాక్యముచే మూలము లేక యే తోచెడి యెఱుకను విడిచినచో నికనున్నదని కాని, లేదనికాని చెప్పువారెవరున్నారు ? ఎవరును లేరు. 89

కం॥ తెలుపు మృదుత్వము మధురము । గల వస్తువు చక్కెరనుచు - గనుగొన్నట్లా । తెలివి శరీర జగంబులు । గలవస్తువు బిందువనుచు - గనుగొనరాదా * నే తెల్పితే - వినినమ్మరాదా * తెలివిచే బయలుండ - దెలిసియీ తెలివిని । తెలివిచేతనె పట్టి - తీసివెయ్యర పోని । కనుగొనరావా * నేదెల్పితే - వినినమ్మరాదా * 90

భా॥ "తెలుపు, మృదుత్వము, మధురము" అనునీమూడు గుణములతో గూడిన సద్వస్తువు చక్కెరనబడును. చక్కెరనుండి తెలుపునుగాని, మృదుత్వమునుగాని, మాధుర్యమునుగాని వివేకయుక్తమైన బుద్ధితో వేఱుచేసినచో నాగుణముల కునికియే యుండదు. ఈ గుణముల కాశ్రయమైన సద్వస్తువు కను రూపము లేదు. ఈ మూడు గుణములతో గూడినప్పుడు సద్వస్తువే చక్కెరనబడుచున్నది. అట్లే "తెలివి, శరీరము, జగత్తు" అను నీమూడును కలిగియున్న వస్తువు బిందువనబడును. ఆ బిందువే యెఱుక. ఎఱుకయుండెడిగడి తెలివి, యెఱుకబడెడి శరీరజగత్తులు నిమిడియున్నవి. దీనిని నీవు స్వయముగా తెలియజాలక పోయినను, నేను చెప్పినమాటలయందు విశ్వా

సనుంచి నమ్ముము. ఎఱుకచే బట్టబయలైన కేవలాత్మయొక్క యునికి నెఱింగి, ఆయొత్తిగెడి యెఱుకను నెఱుకచేతనే తీసి వేయుము. అప్పుడంతటను బట్టబయలైన కేవలాత్మ స్వతస్సిద్ధమై నిండియుండును.

కం॥ లేనెరుక బయలుతోపల । తానై తనకేరుపడిన-
తన మూలమునే । తానెరుగదలచి నప్పుడు । తానే లేకుండు
దృష్టాం - తము వినుమిచట * కలదోచదే - తనకై తానె
చట * తానై తోచినగల - తనమేల్కొగనబోతె । తానే
తనపులేదు - తగియున్నదీ దృష్టాం । తము వినుమిచట *
కలదోచదే - తనకై తానెచట * 91

భా॥ ఎఱుకకు మూలము లేదు. అది బట్టబయలగు కేవలాత్మయందు తనంతటతానే తోచుచున్నది. అట్లు తోచిన యెఱుక తనమూలమును విచారించినచో తానే లేకపోవుచున్నది. దీనికొక తగిన దృష్టాంతమును చెప్పెదనువినుము. కల తనంతటతానే తోచుచున్నది. దానికెచ్చటను మూలము లేదు. కలలోని పదార్థము లెచ్చటనుండి వచ్చుచున్నవో తెలియబడదు. తిరిగి యెచ్చటికి పోవుచున్నవో అదియు తెలియబడదు. అవివచ్చెడి చోటుగాని, పోయెడి తావుగాని యెవరికి తెలియదు. తనంతటతానుగా తోచినకల తనమెలకువను గాంచబోయినచో తానే లేకపోవుచున్నది. అట్లే తనంతట తానుగా తోచినయెఱుక తనమూలము నెఱుంగదలంచినచో తానే లేకపోవుచున్నది. 91

కం॥ చచ్చుట పుట్టుట మెలకువ। వచ్చుటగాఢసుషు
ప్తి - వచ్చుట లీనా । ల్గచ్చముగ సహజ మెరుకకు । పొ
చ్చెము నీయెరుకనిల్వ-బోదు మాయప్పా * అచలముకిట్లు-
లేదుగదప్పా * మచ్చికతో రెంటి - మర్మము నీకిప్పు । దె
చ్చుగ దెలిపితి - నెరుగు మెరుక నిల్వ । బోదు మాయ
ప్పా * అచలముకిట్లు - లేదుగదప్పా * 92

తా॥ "చచ్చుట, పుట్టుట, మెలకువనుపొందుట, గాఢ సుషుప్తినిగాంచుట" అను నీనాల్గును ఎఱుకకు సహజలక్షణములు. ఇట్టి సహజలక్షణములుగల యెఱుక స్థిరముగ నిలువజాలదు. అచలపరిపూర్ణ కేవలాత్మపుట్టదు. చావదు. మెలకువనొందదు. సుషుప్తినిగాంచదు. అది యేలక్షణములులేక యేకమై స్వతస్సిద్ధముగ నిండియున్నది. ఈరెంటిమర్మమును నీకెఱుగజెప్పితిని. కేవలాత్మ యొక్కటియే స్థిరముగ నిలిచయుండును. ఎఱుక యెచ్చటను నిలువజాలదని యెరుగుము. 92

కం॥ ఎరుకను కలలో పురుషున । కెరుకే యావిశ్వ
మగుచు - నేర్పడుకలగా । నెరుక బయలుగని తాలేం ।
దెరిగిన నెరుకకది మేల్కొ - యిదినమ్ము లెస్స * ఎరుక
తో పొందు - వదలదె బిస్స * ఎరుకను గలనీకు - నెప్పు
డు తోచితె । ఎరుక లేందనుమేల్కొ - నెరుగు మప్పుడు
చాలు । నిదినమ్ము లెస్స * ఎరుకతో పొందు - వదలదె
బిస్స * 93

భా॥ బట్టబయలగు కేవలాత్మయందు ఎఱుక తోచుట యేకల. ఎఱుకయను కలతోచగానే యాకలలో నామరూప నటనాత్మక ప్రపంచము తోచుచున్నది. ఆ యెఱుక తాను తోచకపూర్వము, తోచినపిదప, నశించినవెనుక స్వతస్సిద్ధముగ నిండియుండునది బట్టబయలగు కేవలాత్మయనియు, మూలములేక యేతోచెడి తానెప్పుడు లేననియు, నెఱుగుటయే యెఱుకకు మెలకువ. దీనిని నీవు దృఢముగా నమ్ముము. నీవు లేని యెఱుకను సత్యమనితలంచి దానితోకూడి యుండకుము. నీకు యెఱుకయ నెడల, ఆకలలోని ప్రపంచముతోచినప్పడవి యెప్పుడు లేనివేయని తెలిసికొనుము. అప్పుడు నీవు పరిపూర్ణ జాగ్రత్త నొందెదవు.

కం॥ చిత్రరువు రంగు గోడల । నెత్తెరగున దెలిసి నావో - నీవిప్పుడు నీ । చిత్తమున జగము నెరుకను । సుత్తబయలుసట్ల తెలియు - మూహ నోడుతను * తెలిసివిడు వు - మూహ జగములను * అత్తెరంగునజేయ - నావలిమూటను । నిత్తెరంగని తెలియ - నెవరుండే రటు మీద । సూహ నోడు తను * తెలిసివిడువు - మూహ జగములను*94

భా॥ గోడమీద రంగులతో దేశకాలవిశిష్టములగు నానావిధ చిత్తరువులు లిఖింపబడుచున్నట్లు, బట్టబయలునందు ఎఱుకచే దేశకాలవిశిష్టమగు నానావిధ నామరూప నటనాత్మక జగత్తు కల్పింపబడుచున్నది. గోడయందు తెలియబడుచున్న రంగులను, రంగులతో రచియింపబడిన దేశకాల విశిష్టములగు

చి త్తరువులను విడిచిన చో గోడయొక్కటి మాత్రమే శేషించి యుండునట్లు, బట్టబయలైన కేవలాత్మయందు తోచుచున్న ఎఱుకను, ఎఱుకచే కల్పింపబడిన దేశకాలవిశిష్టమగు నామ రూప నటనాత్మక ప్రపంచమును విడిచినచో, బట్టబయలగు కేవలాత్మ యొక్కటిమాత్రమే శేషించి స్వతస్సిద్ధమై యుండును. ఈ విధముగ నెఱిగి యొఱుకజగములను విడిచినపిమ్మట స్వతస్సిద్ధమై నిలిచియున్న కేవలాత్మ నెఱుంగుట కెవరుందురు? ఎవరునుండరు. 94

కం॥ పరిపూర్ణములో లేనిదె । యొరుకొక్కటి తోచి తన్ను - నెరిగిన మృషగా । నెరుకే విడుచునదెట్లన । కర ములు తమపనులుతామే - గడుపునట్లుగను ✱ ఇదిగాకుంటె - కలదింకోటివిను ✱ మరికానిదామాట - మంచిదీమాటని । పరిపరివిధముల - పల్కు- పలుకులపని - గడుపునట్లుగను ✱ ఇదిగాకుంటె - కలదిం కోటివిను ✱ 95

భా॥ పరిపూర్ణమునందెన్నడు లేనిదే యొఱుకయొకటి తోచి, అది తానెక్కడనుండి వచ్చితినోయని తనమూలమును విచారింపగా నెచ్చటను లేకపోవుటచేత తన్ను లేనిదానినిగా తెలిసికొని తానే లేకపోవుచున్నది. ఎట్లనగా చేతులు తమపను లను తామేచేసికొనిన పిదప నవి తమంతటతామే మానుకొను నట్లును, "అది కానిమాట, ఇది మంచిమాట" అని పరిపరి విధములగు పలుకులను పలుకులేపలికి తరువాత నవి యేపలు కునుపలుకక మానుకొనునట్లును, ఎఱుక తనంతటతానే తోచి,

సమస్తకార్యముల నాచరించి మూలములేనిదగుటచే తనలేమిని తానేయెఱిగి లేకపోవుచున్నది.

కం॥ తలయెత్తి చూడజాలునె । యలచీకటి యెదుట నిలిచి - యజ్ఞానకళం । కలవచ్చి మెలకువందున । గల చేష్టల మ్రోలనిలిచి - కనుగొనగలదా * అట్లనె యెరుక - కనుగొనగలదా * ఇలలో సద్గురుబోధ - నెఱిగిన నరునిచే । ష్టలు గంటెహూళ్ళక్కి - సద్గురుబోధాట । కనుగొన వలదా * అట్లనెయెరుక - కనుగొనవలదా * 96

భా॥ చీకటి సూర్యునియెదుటనిలిచి, యతని కళలను తలయెత్తి చూడజాలని విధమున కల మెలకువ ముందునిలిచి దానియందు గల నామరూపనటనాది చేష్టల నెఱుగజాలదు. అట్లే సద్గురుబోధను బడసి, అచలపరిపూర్ణ స్థితిని పొందిన వాడు ప్రపంచములో నానావిధములుగ వర్తించుచుండియును వానినిహూళక్కిగాగనుచుండునుగాని,సత్యములనితలంపడు.96

కం॥ అంటదు కలమేల్కొను మే । ల్కొంటదు కల నెన్నటికిని - కడు నిశ్చయమీ । రెంటిక్రియ గుర్తు బయ లుల । రెంటిని రెండంటకుండు - రెండింటిలోను * కలయెరు కలీ - రెండు మిథ్యోను * దంటగ మేల్కొ బయ - లుంట యెప్పటికెరిగి । గెంటుమా పైరెంట - రెంటి కల యెరుకల రెండింటిలోను * కల యెరుకలీ రెండుమిథ్యోను * 97

భా॥ కలయెప్పుడును లేక అప్పుడప్పుడు తోచుచు పోవు

చుండును. మెలకువ సహజముగ నిలిచియుండును. ఈ రాకడపోకడలుగల కల సహజముగ నిలిచియుండు మెలకువ నెన్నటికి నెఱుగజాలదు. అట్లే సహజముగ నిలిచియున్న మెలకువ రాకడపోకడలుగల కలనెన్నటికి నెఱుగజాలదు. అదేవిధముగ ఎఱుక యెప్పుడును లేకయే అప్పుడప్పుడు బట్టబయలందు తోచుచు పోవుచుండును. బట్టబయలగు కేవలాత్మ స్వతస్సిద్ధముగ నెప్పుడు నిలిచియుండును. ఈరాకడపోకడలుగల యెఱుక స్వతస్సిద్ధముగ నిలిచియున్న బట్టబయలగు కేవలాత్మ నెన్నడెఱుగజాలదు. స్వతస్సిద్ధముగ నిలిచియున్న కేవలాత్మకూడ రాకడపోకడలుగల యెఱుక నెన్నడెఱుగదు. ఈ రెండుజంటల విషయము చక్కగా తెలిసికొని, వీనిలో రాకడపోకడలు గలిగి యస్థిరములై యున్న కలయెఱుకలు రెండును మిథ్య యనియు, స్వతస్సిద్ధముగ నిలిచియుండు మెలకువ బయలులు సత్యములనియు తెలిసికొని, రాకడపోకడలుగల కలయెఱుకల రెంటిని విడిచియుండుము. 97

కం॥ ఎరుగదు సుప్తిని జాగ్రత । నిరవందసుషుప్తి
రెంటి - నెరుగును మేల్కొ । ట్లరయగ బయలెరుకలరెం ।
డ్నెరుగదు బయ లెరుక రెంటి - నెరుగుచునుండు * గురు
ముఖమున - నెరిగి యీరెండు * తిరముగ నెరుకను - తీసి
వేసితెచాలు । పరులు నేననియెడి - పలుకు లేకుండు ని ।
ల్లెరుగుచునుండు * గురుముఖమున - నెరిగియీరెండు *98

భా॥ సుషుప్తినిగాని, జాగ్రత్తనుగాని సుషుప్తి యెఱు-

గదు. ఈ సుషుప్తి జాగ్రత్తల రెంటిని జాగ్రత్త యెఱుగును. అదేవిధముగ బట్టబయలగు కేవలాత్మనుగాని, మూలములేని యెఱుకనుగాని నిర్వికారమగు కేవలాత్మ యెఱుగదు. మూలములేని యెఱుకయే కేవలాత్మ యునికిని, ఎఱుక యొక్క లేమిని నెఱుగును. గురుముఖముగ నీరెంటి మర్మము నెఱింగి,మూలము లేకయే తోఁచెడి యెఱుకను విడిచినచో నాయెఱుకతో పాటు తోఁచిన "నేను, ఇతరులు" అనెడి భేద భ్రాంతికూడ నశించి, యచల పరిపూర్ణ కేవలాత్మ స్వతస్సిద్ధముగనుండును 98

కం॥ సంకల్పములేనిదె ని । స్సంకల్పములోనదోచు-
చనుదోచు చనుట । సంకల్పము చప్పున ని । స్సంకల్పము
నెరిగెనేని - చనుతా లేననుచు * నిస్సంకల్ప - మునునిలి
చేదనుచు * సంకల్పించుటకింక - సంకల్పమేదిని । స్సంక
ల్పమందిట్లు సంకల్ప మెరిగిన । చనుతాలేననుచు * నిస్సం
కల్ప - మును నిలిచేదనుచు * 99

తా॥ నిస్సంకల్ప రూపమగు నచల పరిపూర్ణ బ్రహ్మము నందు సంకల్ప రూపమగు నెఱుక లేక పోయినను ఒకానొకప్పుడా మూలములేని సంకల్ప రూపమగు నెఱుక నిస్సంకల్ప రూపమగునచలపరిపూర్ణబ్రహ్మమునందు తోఁచుచు, పోవుచు, మరల తోఁచుచు, పోవుచునుండును. ఈ సంకల్ప రూపమగు నెఱుక నిస్సంకల్ప రూపమగు నచలపరిపూర్ణ బ్రహ్మము యొక్క యునికిని, సంకల్ప రూపమగు తనయొక్క లేమిని నెఱింగినచో నాయెఱుక యెచ్చటను లేక పోవును. అప్పుడచలపరి

పూర్ణ కేవలాత్మ సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును, సంపూర్ణముగ నిండి స్వతస్సిద్ధమై యుండును. ఈవిధముగ మూలములేని సంకల్పరూపమగు నెఱుక లేక పోయినచో నాపైన సంకల్పించుట కింకనేవరుండురు ? 99

కం॥ ఎరుక తనకు దావిడిపో । దెరుకను విడిపింప నేర - రెవ్వరు ధాత్రిన్ । గురుడొకడుతప్ప గురునకు । పరిచర్య యొనర్చి బోధ-పద్ధతివినినన్ * తిరిగిరాని - పద్ధతిగనినన్ * పరిపూర్ణ మెరుకనే - ర్పరచ నెరుకలేక । హరి నికలలోగన్న - కరిమ్రగ్గినట్లానీ । పద్ధతి వినిన్ * తిరిగి రాని - పద్ధతిగనినన్ * 100

భా॥ ఎఱుక తనంతటతాను విడిచిపోదు. దానిని సద్గురుమూర్తితప్ప యెవరును విడిపింపజాలరు. ఆసద్గురుమూర్తికి తను మనధనముల నర్పించి, స్థానాంగ భావాత్మలను చతుర్విధశుశ్రూషలుచేసి, వారిని మెప్పించి, వారుచేయు బోధనువిని, మరల తిరిగిరాని పద్ధతి నెఱుంగవలయును. ఆసద్గురు దేవునివలన స్వతస్సిద్ధమై నిండియున్న కేవలాత్మను, మూలము లేకయే తోచుచున్న యెఱుకను వేఱువేఱుగా నెఱింగినచో కలయందు సింహముఁగాంచిన ఏనుగువలె నెఱుక నశించిపోవును. 100

కం॥ అపరోక్షమౌనె మనుజుల । కుపరోక్షంబైన బయలు - గురుకృప లేకన్ । అపరోక్షమౌను మనుజుల । కుపరోక్షంబైన బయలు - గురుకృప గలుగన్ * కీలిదె

లేని - యెరుక తాతొలగ * విపరీతబుద్ధిని - విడచి నీ
వెప్పుడు । సుపచారములు చేయు - చుండుము గురునకు ।
గురుకృప కలుగన్ * కీలిదెలేని-యెరుక తాతొలగున్ * 101

భా॥ గురుదేవుని యనుగ్రహము కలుగనిచో పరోక్షముగా (తనకంటె భిన్నముగా) నున్నట్లు తోచుచున్న బట్టబయలగు కేవలాత్మ యపరోక్షముగా (తనకంటెభిన్నము కాదని) తెలియబడదు. గురుదేవుని యనుగ్రహము కలిగినచో పరోక్షముగా (తనకంటెభిన్నముగా) నున్నట్లు తోచుచున్న బట్టబయలగు కేవలాత్మ యపరోక్షముగా (తనకంటెభిన్నము కాదని) తెలియబడుచున్నది. సద్గురుకృపచే బట్టబయలగు కేవలాత్మ యపరోక్షమని(తనకంటెభిన్నముకాదని) తెలియుటయే దీని రహస్యము. ఈరహస్యమును గురుదేవునియనుగ్రహమువలన తెలిసికొనినచో మూలము లేకయే తోచుచున్న ఎఱుక మటుమాయమై పోవుచున్నది. నీవు విపరీతబుద్ధులను మాని సద్గురుమూర్తికి చతుర్విధ సేవలు చేయుచుండుము. అతనికి నీయందు దయకలుగగనే నీకీ రహస్యమును బోధించును. 101

కం॥ నేనెవ్వడనను జీవుడు । నేనే నేననును శివుడు-
నీరెండనకన్ । తానుండు నచలమిన్నిటి । నేనెరిగరిగినను
పైది - నేనెట్లనీని * నేననకున్న - తానెట్లనీని * నేనన్న
దాంట్లోదె - నీనా ప్రసంగము । తానన్న దాంట్లోనె - తలపో
యవలె నిట్లు । నేనెట్లనీనీ * నేననకున్న|- తానెట్లనీని* 102

భా॥ జీవభావము గలవాడు నే నెవ్వడను ? దేహమా ?

ఇంద్రియములా? ప్రాణమా? అంతఃకరణమా? లేక వీని యన్నిటియొక్క సముదాయమా? అని సంశయ బుద్ధితో తిక మకలు పడుచుండును. శివభావము గలవాడీ జడ సంఘాతమేదియు నేనుకాను. వీనియన్నిటిలోనున్న చైతన్యమే నేను. నేనే బ్రహ్మమనని, నిశ్చయముపొందియుండును. అచలపరిపూర్ణ కేవలాత్మ యీ రెండు నసక సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును స్వతసిద్ధమై నిలిచియుండును. ఈసంశయాత్మకుడైన జీవుని, నిశ్చయాత్మకుడైన శివుని నేనెఱిగి యణగునప్పుడు వీరును నాలోనే పయనము గట్టుదురు. ఇక శేషించియున్న అచలపరిపూర్ణ కేవలాత్మ నేననియెట్లనగలదు? నేనను అహంకారమున్నప్పుడే జీవుడు, శివుడు, వాడు, వీడు, అది, ఇది, యనువ్యవహారములన్నియు నుండును. నేను నాబలగముతో కూడ పోయినపిదప నచలపరిపూర్ణ కేవలాత్మ యేమియు ననజాలదు. నీనా ప్రసంగములన్నియు నేనను అహంకారములోనివే. నేనను అహంకారము పోయినచో తానైన కేవలాత్మయందే వ్యవహారములేదు. 102

కం॥ కొౌర్రలు తొమ్మిదిగలమే। న్మత్రికియొకరెంటి
లోన - మల్కలు నాల్గుం। డెర్రది తెల్లది నల్లది। కర్రది
దానగ్రమందు - గల దొక్కతూటు * అది యెరుకను -
పులుగుండుపోటు * కుర్రగురుబోధను - గొడ్డలిచేబూని।
మర్రిపులుగుల రెంప్పి - మలచి కొట్టరపోని * కలదొక్క-
తూటు * అది యెరుకను - పులుగుండుపోటు * 103

భా॥ శరీరమను మఱ్ఱిచెట్టునకు తొమ్మిది రంధ్రములు గలవు. శ్రోత్ర రంధ్రములు రెండును, నేత్ర రంధ్రములు రెండును, నాసికా రంధ్రములు రెండును, రసనా రంధ్ర మొక టియు, ఉపస్థ రంధ్ర మొకటియు, పాయు రంధ్ర మొకటియు కలిసి మొత్తము తొమ్మిది రంధ్రములు గలవు. ఈరంధ్రములే తొఱ్ఱలనబడెను. ఈ తొమ్మిది తొఱ్ఱలుగల శరీరమను మఱ్ఱి చెట్టునకు రెండు నేత్రములుగలవు. అందొక్కొక్క నేత్రము నందు ఎఱుపు, తెలుపు, నలుపు, సునీలమైన పాప అనునాలు గు రంగులున్నవి. అందు కుడి నేత్రమునందలి పాపలోగల కళయందు అష్టదళ పద్మముగలదు. ఆ పద్మమధ్యమున సన్నని బిలమొకటుండును. ఆ బిలమునుండి బ్రహ్మముడి స్థానము వఱకు సుషుమ్నా నాడి వ్యాపించియుండును. ఆ సుషుమ్నా నాడిలోపల నెఱుకయను పక్షి స్వయంప్రకాశమానమై విరా జిల్లుచుండును. అది మానసేంద్రియములతో గూడి సర్వము నెఱుగుచున్నది. దాని ప్రకాశము వలననే సమస్త ప్రపంచము ప్రకాశింప బడుచున్నది. గురుబోధ యనెడి ఖడ్గము చేతే శరీర మనెడి వృక్షమును, ఆ వృక్షాగ్రమందుండిసర్వమును గుర్తెఱు గుచుండెడి యెఱుకయను పక్షిని కొట్టి త్రోసివేసినవో నచల పరిపూర్ణ కేవలాత్మ స్వతస్సిద్ధమై నిలిచియుండును. 108

కం॥ తనువుతోవచ్చిన యెరుకే । తనువును తనువను చుతన్ను - తానని యెరుగున్ । తనువును బాసినమీదట । తననాదేహమును రెంట్ని - తానెరుగదపుడు * అదిగను

కతా - లేనేలేదెపుడు * అనుమాన రహితమిం - దచల
మున్నది కంటె । తనమాట తలపోయ - తనకె సిగ్గయి
తన్ను। తానెరుగదపుడు* అదిగనుక తా - లేనేలేదెపుడు* 104

భా॥ ఎఱుక శరీరములు రెండు నొకేపర్యాయముతోఁచి
యొకే పర్యాయము లేక పోవుచున్నవి. ఇవిరెండు నొకదానిని
విడిచి మఱియొకటి యుండజాలవు. ఎఱుకలేనిదే శరీరము తెలి
యబడదు. శరీరము లేనిదే యెఱుక నిలువజాలదు. ఎఱుకకు
శరీర మాశ్రయము. శరీరము నాశ్రయించుకొనియున్న ఎఱుక
శరీరమును జూచి, యిది శరీరము, నేను దాని నెఱిగెడి యెఱు
కను, శరీరముకంటె నేను వేఱుగా నున్నానని తలంచును.
తాను శరీరమునకంటె వేఱుగానున్నచో శరీరమును విడిచిన
పిదప గూడ తాను దాని నెఱుగ వలయును గదా ! అప్పుడది
తన్నుగాని, శరీరమునుగాని యెఱుగజాలదు. కావున నెఱుక
లేనిదని చెప్పబడెను. ఇది శరీరముతోపాటుతోఁచి, శరీరముతో
పాటు పోవుచున్నది. తాను తోఁచినప్పు డచలపరిపూర్ణ కేవ
లాత్మ స్వతస్సిద్ధమై నిండియున్నదని తెలిసినచో నది తాను
న్నానని తలంచుటకే సిగ్గుపడి తన్నుగాని, శరీరమునుగాని యె
ఱుగకయే యేగుచున్నది. 104

కం॥ ఉప్పెనచే చెఱుతరువా । కప్పుడు వి త్తనము
పుచ్చు - నారెంటికినీ । తిప్పలు తప్పవు ధరయే । తిప్పలు
తానెరుగదిట్లు - తెలిసికోవోయి* తనువెరుకల - బయలెల్లె
రుగోయి * గొప్పయిన గురుబోధ - చొప్పున నెరిగి పై ।

తిప్పలు గలవాని - దీసివేసిన జాలు। దెలిసికోవోయి *
తను వెరుకల - బయలెప్లైరుగోయి * 105

భా॥ ఉప్పైన గాలిచే నొకొక్కప్పుడు చెట్టు చచ్చి పోవుచున్నది. మఱియొకప్పుడు పిత్తనము పుచ్చుచున్నది. ఈ రెంటికి నీ తిప్పలు తప్పవు. వీని తిప్పలనేమాత్రముభూమి యెఱుగదు. ఈ విధముగనే తను వెఱుక లొకొక్కప్పుడు బట్టబయలైన కేవలాత్మయందు మూలము లేకయే తనుంతట తాము తోచుచున్నవి. మరల తమంతటతామే మటుమాయమై పోవుచున్నవి. వీనిరాకపోకల తిప్పలను బట్టబయలగు కేవలాత్మ యేమాత్ర మెఱుగదు. అచలపరిపూర్ణ గురుదేవుని కరుణ వలన గొప్పదియైన పరిపూర్ణ బోధ నెఱింగి, యాబోధ ప్రకారము తిప్పలుగల యెఱుక శరీరములు సత్యములనెడి భ్రాంతిని విడిచియుండుము. 105

ఇది, శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధనిర్గుణతత్త్వకందార్థ దరువులయందు 'ఎఱుకను విడిపించుట' అనుష్ఠాఖ్యాయమునకు, శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే రచియింపబడిన భావార్థ దీపికా సహితము.

—•—

# 7. మ త ము ల ల క్ష ణ ము

కం॥ మతములవారలు తమమత । మ్మతమైనటువంటి
శాస్త్ర - మర్యాదలచే । మితమేరుపరచుకొని బహు । గతు
లను కలహింతురట్టి - గతి నీకేమిటికి * చపలతజెందే -
స్థితి నీకేమిటికి * ప్రతిలేని యీబట్ట - బయలుండజూచిసం ।
తతములేనెరుకలే - దనినమ్మి మికవారి । గతినీకేమిటికీ *
చపలతజెందె - స్థితినీకేమిటికి * 106

భా॥ ద్వైతా ద్వైత విశిష్టాద్వైతసార శాక్తేయగాణా
పత్యాదిమతములవారు, తమతమ మతములకు సరిపడుశాస్త్ర
ములను కల్పించుకొని, వానివాని మర్యాదల నతిక్రమించి న
డువరాదని హద్దుల నేర్పరచుకొని, తమ తమ మతములే గొ
ప్పవియనితలంచి,బహువిధములకలహించుచుందురు.నీవువారి
వలె కల్పిత గ్రంథముల నాధారము చేసికొని, కలహింప బో
కుము. ఆ కల్పిత శాస్త్రములకు స్థిరత్వము లేదు. అవియొక దా
నిచే మరియొకటి ఖండింపబడుచున్నవి. వాని నాశ్రయించినచో
చపలత్వము కలుగును. కావున నీవా చపలత్వమును పొంద
కుము. దీనితో సమానమైనదిగాని, యధికమైనదిగాని లేని
బట్టబయలగు కేవలాత్మ యునికి నెఱింగి, ఎప్పుడునులేని యె
రుక లేనేలేదని నమ్ముము. మతముల వారలవలె చపలత్వము
నొందకుము. 106

కం॥ ద్వైతాద్వైత విశిష్టులు । సైతము విన సైప

రెపుడు - సైపక పిదపన్ । సైతురు క్రమమున వేరని। యా
తతమతి జీవశివుల - నవి వినబోకు * నేబోధించి - నది
విడువబోకు * పూతమౌ బయలును - పొడగాంచి గురునిచే ।
ద్వైతాద్వైత విశిష్టా - ద్వైతములను జూసు । మవివిన
బోక * నేబోధించి - నది విడువబోకు * 107

భా॥ ద్వైతులు "జీవుడు వేఱు, ఈశ్వరుడు వేఱు" అని చెప్పెదరు. అద్వైతులు జీవుడు నీశ్వరుడు నొక్కటియే యనె దరు. విశిష్టాద్వైతులు ఈశ్వరుడు చిదచి ద్విశిష్టుడని చెప్పె దరు. వారివారి సిద్ధాంతముల కనుగుణ్యముగా భాష్యములు, వార్తికములు, స్వతంత్ర గ్రంథములు కల్పించుకొని, వానియా ధారముతోతగవులాడు కొనుచుందురు. నీవు వారిమాటలను వినకుము. నేను నీకుబోధించిన దానిని విడిచిపెట్టకుము. సద్గురు మూర్తినలన పరిశుద్ధమైన బట్టబయలు నెఱింగి, ద్వైతాద్వైత విశిష్టాద్వైతుల బోధలను విడిచిపెట్టుము. 107

కం॥ కొందరు దశవిధనాదము । లందునసభ పంచ
కంబు - నందున చక్రా । లందున లక్ష్యధ్యానము । లందున
హంసందుబుద్ధి - నాటింతురోయి * యోగములందు - నటి
యింతురోయి * అందు సిద్ధులచేత - నాసందింతురుకొందర ।
రెందరెట్లున్నబో - ధందెనీవుండుము । నాటింతురోయి *
యోగములందు - నటియింతురోయి * 108

భా॥ ప్రపంచములో కొందఱు "చిణిణీనాదము, చిణిచిణీ

నాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళ నాదము, వేణునాదము, భేరీనాదము, మృదంగనాదము, ప్రణవనాదము" అను దశవిధ నాదములయందును,కొందఱు "దహరాకాశ, హృదయకాశ, కంఠాకాశ, శిరాకాశ, చిదాకాశము లను" పంచవిధాకాశములందును, కొందఱు "ఆధార, స్వాధిష్ఠాన,మణిపూరక,అనాహత,విశుద్ధ, ఆజ్ఞా,సహస్రారము"లనెడి సప్తచక్రములయందును, కొందఱు అంతర్లక్ష్య, బాహ్యలక్ష్య, మధ్యలక్ష్యముల నెడిలక్ష్యత్రయము నందును, కొందఱు సగుణ నిర్గుణధ్యానములందును, కొందఱు హంస సూత్రమునందును బుద్ధిసిగాఢముగానాటించుచున్నారు. మఱికొందఱు' యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణాధ్యాన సమాధు" లనెడి అష్ట విధయోగాంగములందును, కొందఱు మంత్రలయ హఠాది అభ్యాస యోగములందును, కొందఱు సాంఖ్యతారకామనస్కములను రాజయోగము నందును మనస్సును నిల్పుచున్నారు. వేఱుకొందఱు "అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము" అను అష్ట సిద్ధులను పొంది ఆనందించుచున్నారు, ఈవిధముగ నెందఱెన్ని పాట్లు పడుచున్నను పిపుమాత్ర మీ బోధయందే స్థిరముగా నిలిచియుండుము. దీనినుండి తొలగి యితర సాధనలయందు నీమనస్సును చొప్పింపకుము. 108

కం॥ కొందరు ముద్రలుగనవలె । నందురు మరి
కొందరపేక-మునుదు ద్రష్టగా । కొందరు భజనే లెస్సని ।

యెంచుకు ఇవియన్ని యెవ్వక - యని తెలిసికొనుమీ * నీ
కివి యేల - పనిలేదు వినుమీ * ముంగుగ పరిపూర్ణ-మున్న
దిగని గుర్తు । నెంచుంతసుంత దా - న్నైగరగొట్టినవాలు ।
సని తెలిసికొనుమీ * నీకివియేల - పని లేదువినుమీ * 109

తా॥ కొందఱు "ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి" అను పంచముద్రల నభ్యసింపవలెనందురు. కొందఱు దృశ్య పదార్థములన్నిటి నెతిగెడి ద్రష్ట గొప్పదనెదరు. కొందఱన్నిటికంటె చిట్టి తాళములను చేబూని భగవంతుని భజన చేయుటయే యుత్తమ మార్గమందురు. ఇవియన్నియు నెఱుకయొక్క చేష్టలని నీవెఱుంగుము. నీకు వీనితో నేవిధమగు పనియు లేదు. నీవు ముందుగా నచలపరిపూర్ణ కేవలాత్మయునికిని గుర్తెఱిగి, యూసురెతిగెడి యెఱుకను నెగురగొట్టిన చాలును, ఇకనీకు దేనితోడను పనిలేదు. 109

కం॥ దేవుణ్ణి నిన్నునెఱుగవు । నీవిప్పటికెట్టివాడొ - నేతెల్పెద నీ । కావెర్రిబోధలెందుకు । కావున దేవుణ్ణి యిదిగో -కనుగొనవోయి * నామరూప - కర్మలేవోయి * నీ వా దేవునిలోన - నిను లెస్సవెదకిన । న్నావలి ముచ్చట - నడుగోయి తెల్పెద । కనుగొనవోయి * నామరూప కర్మలేవోయి * 110

భా॥ నీవింతవఱకు దేవునిగాని, నిన్నుగాని యెఱుగవు. నేను నీకు దేవుడెటువంటివాడో, నీవెటువంటివాడవో తెలి

పెద వినుము. నీకితరములగు వెఱ్ఱిబోధలతో పనిలేదు. దేవుడు సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును సంపూర్ణముగ నిండి స్వతస్సిద్ధముగ నున్నాడు. అతనికి రూపనామ గుణ కర్మాదులేవియులేవు. కావున నతడు విధిముఖప్రతీతికి విషయుడుకాడు. నిషేధముఖముగా నతని నెఱుంగుము. నీ వా దేవునిలోపల బాగుగా వెదకిచూచినచో నందు నీ మూల మెచ్చటను కనిపించదు. కావున నీవెప్పుడును లేనివాడవే. దేవుడొక్కడే స్వతస్సిద్ధమై నిలిచియుండును. ఆ దేవునిలో నునికియేలేనినీవావలిముచ్చట నన్నెట్లడుగగలవు?110

కం॥ మానవుడు చేయబూనిన । దానిని లోతెరిగి చేయ - దగునని మదిలో । నేనెరిగి నీకుజెప్పితి । పూనుముచిపుట్టదేని - పోనీ నీమనసు * రుచిపుట్టిన - పూను నీమనసు * నేనేమియనబోతే - నీకేమి తోచునో । లేని నిష్ఠురములు - లేకుండుచేలెస్స । పోనీ నీమనసు * రుచి పుట్టిన - పూను నీమనసు * 111

భా॥ మానవు డొక కార్యమును చేయదలంచినప్పు డత డు దాని లోతుపాతులను చక్కగా విచారించి తెలిసికొనిన పిదప దానిని చేయుటమంచిది. నే నీవిషయమును బాగుగా గుర్తెరిగియే నీకు చెప్పుచున్నాను. నీవితరమతముల మంచిచెడ్డలను విచారింపకయే బాహ్యాడంబరములను జూచి భ్రమపడవద్దు. నీ కీయచల పరిపూర్ణ మార్గమునందిష్టమున్నచో నీవు దీనినవలంబింపుము. నీకు దీనియందిష్టములేనిచో నీ యిష్టము

వచ్చిన మార్గము నవలంబింపుము. నేను నీకు యథార్థమును చెప్పినప్పటికి నీ మనస్సునకు మరియొక విధముగా తోచ వచ్చును. అనవసరమైన విస్తారములు నాకెందులకు ? నీవు చక్కగా విచారించిన పిదప నీయిష్టమువచ్చిన మార్గము ననుసరింపుము. 111

కం॥ పంచదశాక్షరములను ప్ర । పంచము తానుద్భ
వించె - ప్రణవాక్షరము౦ । దంచు శ్రుతులెన్నె దాన్నెరు ।
కంచని నీవెరిగి యెరుగు - మచలముదీనన్ * నిల్పుచు మె
రుక - నచలములోనన్ * చంచలమతి చేత - చతురాక్ష
రెక్కువం । చెంచెదవెందుకు - నిది నమ్మకెరుగుమి । య
చలములోనన్ * నిల్పుచుమెరుక - నచలములోనన్ * 112

భా॥ "పంచదశాక్షరములు" అను వాక్యమునకు పంచ దశలుగానున్న అక్షరములని యర్థము గ్రహించి కొందఱీ కందార్థమునకీ యర్థమును చెప్పెదరు. పంచభూతములవలన "కర్మేంద్రియ పంచకము, తన్మాత్రాపంచకము, జ్ఞానేంద్రియ పంచకము, ప్రాణపంచకము, అంతఃకరణపంచకము" అను నైదు దశలుగల యిరువదియైదు తత్త్వములు గలిగెను. ఇందు "క చ ట త ప" అను నీయైదక్షరములు ప్రాణపంచకమునకు సంజ్ఞలు. "ఖ ఛ ఠ థ ఫ" అను నీ యైదక్షరములు జ్ఞానేంద్రియ పంచకమునకు సంజ్ఞలు. "గజడదబ" అను నీ యైదక్షరములు కర్మేంద్రియ పంచకమునకు సంజ్ఞలు. "ఘఝఢధభ" అను నీ యైదక్షరములు పంచతన్మాత్రలకు సంజ్ఞలు. "ఙఞణనమ"

అను నీ గొదక్షరములు నంతఃకరణ పంచకమునకు సంజ్ఞలు. అయిదు దశలుగానున్న నీ యిరువది గొకు తత్త్వములయందు పరమాత్మ వ్యాపించియున్నట్లు, అయిదుదశలుగానున్న ఇరు వదియై దక్షరములయందు ధ్వనిరూపముగ నోంకారము వ్యాపించి యున్నది. కావున పరమాత్మకు ఓంకారము వాచకము. వాచ్యవాచకములకు భేదములేదు కావున, నోంకారమునుండి పంచదశలుగల అక్షరములు, వానివాచ్యములగు పంచదశలు గల తత్త్వములు, వానికి కారణమగు భూతభౌతిక ప్రపంచము పుట్టినవని శ్రుతులు చెప్పుచున్న వనెదరు.

మఱికొందఱు ''పంచదశాక్షరముల'' అను వాక్యము నకు పదునైదక్షరములను నర్థమునుగ్రహించి యీ విధముగా నర్థము చెప్పుదురు. ' లం ' పృథివీబీజము. 'వం' ఉదకబీజము. 'రం' అగ్నిబీజములు. 'యం' వాయుబీజము. 'హం' ఆకాశ బీజము. ఈ యైదుబీజములయందు నోంకారము ధ్వనిరూప ముగ వ్యాపించియున్నది. ఆ యోంకారము అకార ఉకార మకారాత్మకము. ఇందు అకారము రజోగుణ సంజ్ఞగలది. ఉకారము సత్వగుణసంజ్ఞ గలది. మకారము తమోగుణసంజ్ఞ గలది. కావున నోంకారవ్యాప్యములగు పంచబీజములును, బీజములకు వాచ్యములగు పంచభూతములును సాత్వికరాజస తామస గుణభేదములవలన పదునైదగుచున్నవి. ఆ పదునైదు సాత్విక రాజస తామస భూతములును, వాని కార్యమగు సమస్త ప్రపంచమును ఓంకారమునుండి పుట్టినవని శ్రుతులు చెప్పుచున్నవనెదరు. ఇంకకొందఱు పంచాక్షరములచేత ''అని

గ్రహించి'' లం, వం, రం, యం, హం'' అను పంచభూతబీజములను మఱికొందఱు ''నమశ్శివాయ'' అను నైదక్షరలను గ్రహింతురు. ఈ యైదును పంచభూతములకు సంజ్ఞలనియు, వీనియందు ధ్వన్యాత్మక ప్రణవము వ్యాపించి యుండుటచే నా ప్రణవమునుండియే సమస్త ప్రపంచము పుట్టినదని శ్రుతులు చెప్పుచున్నవనెదరు.

వేఱుకొందఱు ''పంచాశదక్షరముల'' అని గ్రహింతురు. పంచాశత్తనగా నేబది. ఆ యేబది యక్షరములలో ''అఆఏకచటతపయష'' అను పదియక్షరములు వాయుబీజములు. ''ఇఈఐఖఛఠథఫరస'' అను నీ పదియక్షరములు అగ్నిబీజములు. ''ఉఊఓగజడదబలహ'' అను నీపదియక్షరములు పృథ్వీబీజములు. ''ఋౠఔఘఝఢధభవళ'' అను నీ పదియక్షరములు జలబీజములు. ''ఌౡఅంఙఞణనమశఅః'' అను నీ పదియక్షరములు ఆకాశబీజములు. ఈ యేబది బీజములయందు ధ్వన్యాత్మకమగు ప్రణవము వ్యాపించియున్నది. ఈ ప్రణవ వ్యాప్యములగు బీజములు పంచభూతాత్మకములు. పంచభూతాత్మకమగు సమస్త ప్రపంచమునందు పరమాత్మ వ్యాపించియున్నది. అట్లే సర్వవర్ణములలోను, వర్ణసముదాయమైన నామములలోను ధ్వన్యాత్మకమగు ప్రణవము వ్యాపించియున్నది. భిన్నభిన్నరూపములకు భిన్నభిన్ననామములు వాచకములైనట్లు, సర్వరూపములయందభిన్నముగ వ్యాపించియున్న పరమాత్మకు సర్వనామములయందభిన్నముగ వ్యాపించియున్న ప్రణవము వాచకమగును. వాచ్యవాచకము

లభేదములగుటచే సమస్త ప్రపంచము ప్రణవమునుండి పుట్టిన దని శ్రుతులు చెప్పుచున్నవనెదరు.

ఈ జగద్విశిష్టమగు పరమాత్మయును, దానివాచక మగు ప్రణవమునుగూడి యొఱుకయని నీవెఱుంగుము. దీనిని నీవచలపరిపూర్ణ బ్రహ్మమునందు లేనిదానినిగా తెలియుము. నీవు దీనిని విడిచితివో నచలపరిపూర్ణ బ్రహ్మము సర్వత్ర స్వతస్సిద్ధముగ నిండియుండును. ఇట్టి పవిత్రమార్గము నెఱుంగక పామరుల మాటలను విని చంచలబుద్ధితో చతురాశీరీ మొద లగు మంత్రముల జపమే యొక్కువయని తలంపకుము. నీవా పామరుల మాటలను నమ్మక యచలపరిపూర్ణ బ్రహ్మము యొక్క యునికిని, ఎఱుకయొక్క లేమిని ఎఱుంగుము. 112

కం॥ ఎరుకయుజడము జడముజగ । మరమగ పరి పూర్ణ మేమి - యనరానిదియా । యెరుజగము లస్థిరము లు । పరిపూర్ణ ము శాశ్వతమిది - పాటించికనరా * కావా రెండీ - పాటివివినరా * గురుముఖమున వీక్షే - నరుడు గు రైయగునో । తిరిగి పుట్టడువాడీ - ధరపై మునుపటి వలె । పాపించికనరా * కావారెండీ - పాటివివినరా * 113

భా॥ ఎఱుకయొక్క స్వరూపము చైతన్యము. ప్రపం చముయొక్క స్వరూపము జడము. ఈ చిజ్జడములు రెండును కానిది పరిపూర్ణ బ్రహ్మము. చిజ్జడరూపములుగా తోచు చున్న ఎఱుకజగములు రెండును స్థిరములుకావు. ఇవి మూల ములేకయే పరిపూర్ణ బ్రహ్మమునందు తోచుచు, పోవుచు నుం

డును. పరిపూర్ణము కాలకృత దేశకృత వస్తుకృత పరిచ్ఛేద
ములు లేక సర్వత్రనిండి స్వతస్సిద్ధమై శాశ్వతముగనున్నది.
దీనివలె ఎఱుకజగములు శాశ్వతముగ నుండజాలవు. పూర్ణ
గురు సార్వభౌముని వలన పరిపూర్ణ బ్రహ్మముయొక్క యుని
కిని, ఎఱుకజగముల లేమిని నెఱిగినవాడు మరల నీభూమి
పైన జన్మింపడు. 113

కం॥ కొందరు భూతములై దిటి । యందున చిత్తం
బునుంటు - రథికములనుచున్ । కొందరు నేమియు లేవ
ని । యందురు గుఱుతుగుమిన్ని - యపశబ్దములెరా *
ఇవియన్ని నిలువ - వని తెలియవలెరా * ఎందరెన్నన్నా
నీ - కెఱుకు బయలును । మురుమగగని గుర్తు - నెంమండ
నియకవ్వి । యపశబ్దములెరా * ఇవియన్ని నిలువ - వని
తెలియవలెరా * 114

భా॥ ప్రపంచములో నిజమెఱుఁగని పామరజను లీ జగ
త్తునకు కారణము పంచభూతములు కావున వానిని గొప్పగా
నెంచి పూజింపవలెనందురు. మఱికొంద ఱీ పంచభూత
ములు, భౌతికప్రపంచము శూన్యమునుండియే వచ్చుచున్నవి.
మరలశూన్యమై పోవుచున్నవి. కావున శూన్యమే పర
తత్త్వమందురు. వీరుచెప్పెడి మాటలు సత్యములుకావు.
విచారించి చూచినచో నివియేవియు నిలువజాలవు. ఎందఱెన్ని
విధముల చెప్పుచున్నను, నీవుమాత్రము వానిని వినక గురు
దేవుని యనుగ్రహముచే ముందుగా బట్టబయలగు కేవలాత్మ

యునికి నెక్కెంగి, ఆయెక్కెగిన మూలములేని యెఱుక యెందును లేదని తెలిసికొనుము. 114

కం॥ కొందరు కర్మమునే చా । గందురు ముక్తిం
దలెప్క - వందురు తనువున్ । కొందరు ప్రాణములధి
కము । లందురు నీకిట్టి వట్టి - యాశలేమిటికి * వారితో
పొందు - చేసేవేమిటికి * ఎందరిమాటల - వెన్నైన నీ
బోధ । క్రిందివే కానిపై - కెక్కేవిగావిట్టి । యాశలేమి
టికి * వారితోపొందు - చేసేవేమిటికీ * 115

తా॥ కర్మిష్ఠులైన పామరులు కొందరు నిషిద్ధకర్మములను చేయక, కామ్యకర్మములను మానివేసి, ఫలాపేక్షా రహితముగా నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్త కర్మములను చేయుచున్నచో నాకర్మములకు ఫలములు కలుగవు కావున మరల జన్మమురాదని తలంచెదరు. చార్వాకులైన పామరులు కొందఱు ఆకు వక్క కాచు సున్నము నాలుగుకలిపి నమలినచో నోటిలో నూతనముగా నెఱ్ఱనిరంగు పుట్టునట్లు, భూమియొక్క కఠినాంశాణువులు, జలముయొక్క ద్రవాంశాణువులు, అగ్నియొక్క తేజోంశాణువులు, వాయువుయొక్క చలనాంశాణువులు పరిమితిననుసరించి కూడినప్పుడు చైతన్య సహితమగు శరీరము కలుగుచున్నది. ఈచతుర్విధాణువుల వియోగమువలన మరణము కలుగుచున్నది. కావున చైతన్యసహితమగు శరీరమే ఆత్మ. అదియున్నంతవఱకు దానికి మజ్జన భోజనపానీయ శయ్యాసనాదుల నిచ్చి పోషించుటయే పురుషార్థమనెదరు.

ప్రాణాత్మవాదులైన కొందఱు పామరులు జాగ్రత్స్వప్నముల యందేకాక, సుషుప్తియందుకూడ మానసేంద్రియములన్నియు మటుమాయమై పోయినను ప్రాణమొక్కటియే యుండి శరీరమును శిథిలముకాకుండ కాపాడుచున్నది. కావున ప్రాణమే యాత్మ. దానిని తెలియుటయే పరమార్థమందురు. ఇవియన్నియు నట్టియూహలు మాత్రమేకాని, యిందేదియు సత్యముకాదు. నీవీ మాయావాదులతో నెన్నడును సంబంధమును పెట్టుకొనకుము. ఎందఱెన్నివిధములుగా చెప్పుచున్నను నవియన్నియు పరిపూర్ణ బోధకు క్రిందివియే యగునుగాని పైనుండునవికావు. ఆ చిల్లరబోధలపైకి నీమనస్సును పోనీయకుము. 115

కం॥ తను వెరుకలురెండొక్కటి । యనియనరాద నుచుహొంద - రందురు భువిలో । తనువెరుకలలో నొక్కటి । గనరాకుంపేను రెండు - గనరావోయన్న * రెంచొక్కటె - వినరామాయన్నా * అనుమానమికనేల - యందరి మాటలు । వినబోకనేబోధిం - చిన రీతినెప్పుడు । గనరావోయన్నా * రెందొక్కటే - వినరామాయన్న * 116

భా॥ కొందఱు తనువెఱుకలు రెండు నొక్కటికాదు. అవి భిన్నములని చెప్పెదరు. అది సరికాదు. ఎఱుక తోచుచున్నప్పు డెఱుకతోపాటు శరీరముకూడ తోచుచున్నది. ఎఱుక పోవుచున్నప్పుడు దానితోపాటు శరీరముకూడ పోవుచున్నది. ఎఱుకతోచుచున్నప్పుడు దానిచేత శరీర మెఱుగబడుచున్నది. శరీర మెఱుక కాశ్రియముగా నున్నది. కావున

నివి రెండును నొక్కటియే యగునుగాని, వేఱుకాదు. వేఱని చెప్పినచో నెఱుక లేనప్పుడుకూడ శరీరముండి తెలియబడ వలెను. అట్లే శరీరము లేనప్పుడుకూడ నెఱుకయుండి యెఱుగ వలెను. అట్లు యెఱుగుట లేదు కావున, రెండును నొక్కటియే యని తెలియును. లోకులమాటలు విని చెడిపోకుము. నేను బోధించినరీతిగా తను నెఱుకలు రెండు నొక్కటియేయని తెలిసికొనుము. 116

కం॥ కన్నుల ప్రక్కల వ్రేళ్లిడి । తిన్నగ భ్రూమధ్య
మందు - దృష్టినిలిపియుం । దున్నది వెన్నెలరోబయ । ల
న్నాకనుమందురెఱుకే - యదినిల్వదోయి * తనువుతోఁబో
వు - నని తెలియవోయి * యెన్నితనువులు వచ్చి - యే
గిన జడియక । యున్నబయలను జూచి - హాళక్కెఱు
కను విడువు - మదినిల్పదోయి * తనువుతోఁబోవు - నని
తెలియవోయి * 117

భా॥ కొందఱు కన్నులప్రక్కలయందు వ్రేళ్లుపెట్టి భ్రూమధ్యమునందు దృష్టినిలిపి చూచినచో నచ్చట పండువెన్నెల వలె బయలు కనిపించును. చూడుమందురు. వారుచూడుమని చెప్పిన పండువెన్నెల బయలుకూడ నెఱుకయే యగును. అది స్థిరముగా నిలుచునదికాదు. శరీరమున్నంతవఱకు మాత్రనే యదియుండును. శరీరముపోవునప్పుడు నదియుపోవును. ఇటువంటి శరీరములెన్ని వచ్చుచు పోవుచునుండినను, రాకడపోకడలు లేక యేకమై స్వతస్సిద్ధముగా నిలిచియున్న బట్టబయ

లగు కేవలాత్మ యూనికినిజూచి, మూలములేకయే తోచుచుం
డెడి యెుక యొస్పడును లేనిదనియే తెలియును. అది శరీ
రముతో వచ్చుచు, మరల శరీరముతోనే పోవుచుండును.117

కం॥ జను లాత్మానుభవంబై । నను ము_క్త్యనిపల్కి_
రిట్లు - నమ్మకు మెరుకే । కనరాదెచ్చట గురుకృప । న
నుభవ మెవ్వరికిపైన - ఆమాట నిజమో * అనుభవము
ళ్ల - క్కి_మాటనిజమో * వినజెప్పుమిరెండు - వివరించి
పైమాట । వినినే ముందరిబోధ - వినిపింతువేవేగ । ఆ
మాట నిజమో * అనుభవముళ్ల - క్కి_మాటనిజమో * 118

భా॥ జనులాత్మానుభవమైనచో మోక్షము కలుగునని
చెప్పిరి. అది నీవునమ్మవద్దు. ఆత్మానుభవమెుకకు కలుగును
గాని, మఱిదేనికి కలుగదు. గురుదేవుని దయవలన స్వతస్సిద్ధ
మై నిలిచియున్న అచల పరిపూర్ణ బ్రహ్మముయెుక్క_ యునికి
నెఱింగినచో మూలములేకయే తోచెడి మాయయెుక
యెచ్చటను కనరాకపోవును. ఎటుకపోయిన పిదప ననుభవ
మెవనికి కలుగును ? అప్పుడనుభవమను మాటయే మాటక్కి_
యగును. ఆత్మానుభవ మెుకకు కలుగునా? లేక మఱియొక
దానికి కలుగునా? నీవు బాగుగా విచారించి నాతో చెప్పుము.
నేను దానిననుసరించి పై బోధ నీకెఱిగించెదను. 118

కం॥ తననుతాగనిన మోక్షం । బనిపల్కి_రిగాని జ
నులు - నదినమ్మకుమి । తననుతాబట్టబయటను - గనదో
యిన తనకుతానె - రానరాదోయి * విశ్వముతనకు - రాన

రాదోయి * తననుండైనది గనుక - తాను విశ్వము రెం
డు । గనిపించుబుళ్లక్కి - కావున తనకుదా । కాన రా
దోయి * విశ్వముతనకు - కానరాదోయి * 119

భా॥ జనులు తన్నుతాను తెలిసికొనిన చో మోక్షము
కలుగునని చెప్పుచున్నారు. ఆమాటను నీవెంత మాత్రమును
నమ్మనద్దు. బట్టబయలగు కేవలాత్మయందు "నేను, నేను"
అనెడి యెఱుకను వెదకిచూచినచో నది యెచ్చటను కనిపిం
చుటలేదు. అదికనిపించక పోయినచో దానితోపాటు తోచిన
ప్రపంచముకూడ కానరాక పోవుచున్నది. అహంకార రూప
మగు నెఱుక, తాను తోచుచున్నప్పుడు తనయందున్న వాస
నానుసారముగ నామరూప నటనాత్మకమగు ప్రపంచముగను,
దానినెఱిగెడి యెఱుకగను తానే తోచుచున్నది. మరలపోవు
నప్పు డెఱుకజగములు రెండు నొకేపర్యాయము హుళక్కియై
పోవుచున్నది. 119

కం॥ మాయగదా లేనియహం । బాయెగదా తనకు
తానె - యచలము నేర్పా । బాయెగదా మాయనలేం ।
దాయెగదా మాయచిత్ర - మాయెగదోయి * సంశయ ము
త - పోయెగదోయి * మాయసమూలము - మాయ చూ
స్తుండంగ । మాయమైపోయెను - మాయకెయిది చిత్ర ।
మాయెగదోయి * సంశయముంత - పోయెగదోయి * 120

భా॥ మూలములేక యే తనంతటతాను తోచుచు, మరల

ల తనంతటతాను మాయమైపోయెడి యహంకారము మాయ యేకదా ! అచలపరిపూర్ణ కేవలాత్మ సర్వకాలముల యందును, సర్వదేశముల యందును, సమస్తవస్తువుల యందును సంపూర్ణముగ నిండి నిబిడీకృతమై స్వతస్సిద్ధముగ నున్నదిగదా ! మాయ సర్వకాలముల యందును, సర్వదేశముల యందును, లేనిదేగదా ! మాయ మూలములేకయే తనంతటతానేతోచి, మరల తనంతటతానే మటుమాయమైపోవుట మాయకే చిత్రమగుచున్నదిగదా! ఈ విషయమంతయు నెఱిగిననీకు సర్వసంశయములు తీరిపోయినవిగదా ! మూలములేకయే తోచుచుండెడి మాయ, మాయతోకూడ తోచినజగములు మాయ చూచుచుండగనే మటుమాయమై పోవుచున్నవిగదా ! ఈ మాయయొక్క విలాసము మాయకే విచిత్రముగా నుండును గదా ! 120

కం॥ లేనియహ ముండ్న బయలును । లేనిప్రపంచ
మును తన్ను - లెస్సగ తనలో । తాను విమర్శించిననా ।
లేనివి లేకుండునవల - లేదు ఏమాట * అట్లనసైన -
లేదు ఏమాట * లేనియహమేబయట - లేనేలేదనిచూచి.।
లేనిది కలదని - లేనిమాటాడేవు। లేదు ఏమాట * అట్లన
సైన - లేదు ఏమాట * 122

భా॥ మూలములేకయే తోచుచున్న లేనియహంకారము యొక్కయు, ఆ యహంకారముతోపాటు మూలములేకయే తోచుచున్న లేనిప్రపంచము యొక్కయు లేమిని,

సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగానిండి నిబిడీకృతమై స్వతస్సిద్ధముగనున్న బట్టబయలగు కేవలాత్మయునికిని, వీని నన్నింటిని మవిర్శించి యెఱిగెడి మూలములేని తనను లెస్సగా విచారించి యెఱిగినచో, మూలములేకయే తోచుచున్న అహంకారమును, ఆ యహంకారమునకు తోచెడి మమకార, ఇదంకార రూపమగు ప్రపంచమును, వీనినన్నింటి నెఱిగెడి తానును, మూలములేనివగుటచే నివియెప్పుడును బట్టబయలగు కేవలాత్మయందు లేకపోవుచున్నవి. ఇవియన్నియు లేకపోయిన తరువాత ఇవిలేవని చెప్పెడివారుకూడలేరు. ఇట్టి లేనియహంకార రూపమగు నెఱుకయున్నదని చెప్పుమాట కల్లమాట. 121

కం॥ పరిపూర్ణ మెరుకలెట్టిదొ । గురుముఖమున రెంటిలెస్స - గురుతెరిగెరుకన్ । సరిపుచ్చుకొన్న మృష యుని । పరిశుద్ధపు బోధయిదియె - పాటించి కనరా * శివరాముల - పద్ధతియిదెరా * నరులు కొందరు పల్కి - రెరుకను భ్రమింగియా । పరిపూర్ణమయ్యేముం - చెరుగక చెడుటకై । పాటించికనరా * శివరాముల - పద్ధతియిదెరా * 122

భా॥ స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ కేవలాత్మయునికిని, మూలములేకయే తోచుచున్న నెఱుకయొక్క లేమిని శ్రీసద్గురుస్వామివలన చక్కగా తెలిసికొని, స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ కేవలాత్మనుండజూచి, మూలము లేకయే తోచుచున్న ఎఱుక లేదని సరిపుచ్చుకొనుమని

తెలిపెడి యీ యచలపరిపూర్ణ బోధయే పరిశుద్ధప్రబోధయని నీవు బాగుగా తెలిసికొనుము. శ్రీమద్రామయను శివరామ దీక్షితులవారి పద్ధతి యిదియేయని గ్రహింపుము. కొందఱు బూటకపుజనులు నిజమరయలేక మొఱకను దిగమ్రింగి, మేము పరిపూర్ణులమై యుంటిమని పలుకుచుందురు. వారు నిజముగా చెడిపోవుదురు. 122

కం॥ బిందువు తనువునబుట్టును । బిందున తను విం ద్రియముల - బృందంబసువుల్ । అందముగ గలుగునిది చే । నంఘనబుట్టినదొ తెలియ - నజునికితరమా * మూ లము లేని-వని తెలిసి కొనుమా * అందు కె బయున్న - వ రసి మూలములేని । బింద్వాదికంబుల - పేరుతలువకు తెలియ । నజునికి తరమా * మూలములేని - వని తెలిసి కొనుమా * 123

భా॥ శుక్లశోణితములు శరీరమునందు బుట్టుచున్నవి. ఆ శుక్లశోణితముల వలన శరీరము, ఇంద్రియసముదాయము, అంతఃకరణ చతుష్టయము, ప్రాణపంచకము కలుగుచున్నవి. మొదట నీ శుక్లశోణితములుగాని, శరీరేంద్రియ ప్రాణాదులు గాని దేనియందుబుట్టినవో బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులకు కూడ తెలియదు. ఇవి మూలములేకయే తమంతటతాము తోచుచున్నవి. ప్రపంచమున నే వస్తువును పుట్టలేదు. ఉన్న వస్తువునకు పుట్టవలసిన పనియేలేదు. లేనిదానికి పుట్టుకయే లేదు. బట్టబయలగు కేవలాత్మ స్వతస్సిద్ధముగ నిండియున్నది

కావున దానికి పుట్టుకయే లేదు. మూలములేకయే తోచుచున్న బిందుశరీరము ఎప్పుడును లేనిదే కనుక దానికిని పుట్టుకలేదు. పుట్టినదనుమాటయే యబద్ధము. అందుకొఱకే స్వతస్సిద్ధముగ నిండియున్న బట్టబయలగు కేవలాత్మయొక్క యునికి నెఱింగి, మూలము లేకయే తోచుచు, పోవుచున్న బిందుశరీరాదు లెప్పుడులేనివని తెలిసికొనుము. 123

కం॥ జనులనిరి దేవుడెవరికి । గనరాడని నామరూ
ప - కర్మజననముల్ । గసనతనికి లేవని యా । జనవా
క్యము బయలుకెపుడు - సహజమౌవినరా * అనుమాన
ము - చాలించికనరా * కని నామ రూపాది-కములున్నవెఱు
కను । వినవోక కనవోక - విడిచిపెట్టరపోని । సహజ
మౌ వినరా * అనుమానము - చాలించికనరా * 124

భా॥ లోకములో మానవులు దేవుడెవరికి కనబడడనియు, అతనికి నామరూప గుణకర్మజన్మాదులేవియు లేవనియు ననెదరు. ఆ జనులమాటలు బట్టబయలగు కేవలాత్మకు మాత్రము వర్తించుచున్నవి. కావున నా కేవలాత్మయే దేవుడు. ఇందెంతమాత్రము సందియము లేదు. నామరూపగుణ కర్మ జన్మాది వికారములన్నియు నెఱుకయందున్నవి. కావున నీవు నామరూప గుణకర్మ జన్మాదులులేని బట్టబయలగు కేవలాత్మ యొక్క యునికి నెఱింగి, నామరూప గుణకర్మజన్మాది వికారములు కలిగి, మూలములేకయే తోచుచున్న ఎఱుకను విడువుము. ఆ యెఱుక సత్యమను మాటను నీవు వినరాదు. దానిని

నీవు సత్యమని తలంచరాదు. 124

కం॥ అంతటగలదీ యెరుకని । యెంతో వాదింపు
చుండు - రెరుగనివారల్ । అంటట నంతట గనుపడు ।
నంతటిదే కాని యెరుక - యంతటగలదా * అది నిజమై
తే - నగుపడవలదా * అంతటగలదొక్క - యచలమె
కా నెరుక । సంతటగలదని - యనరాదు వినరాదు । అం
తట గలదా * అది నిజమైతే - నగుపడవలదా * 125

భా॥ అజ్ఞానులైన పామరజనులు కొందఱు ఎఱుక అం
తటను వ్యాపించియున్నదని వాదింతురు. కాని అది యంత
టను వ్యాపించియుండనేరదు. ఒకచోట కనిపించుచు, మఱి
యొకచోట కనిపించని యెఱుక సర్వవ్యాపన మెట్లగును? అది
యంతట వ్యాపించియున్నమాట నిజమైనచో దాని వ్యాపన
మందఱకు తెలియవలయునుగదా! అట్లెవరికిని తెలియుట
లేదు. సర్వకాలములయందును, సర్వదేశములయందును, స
మస్త వస్తువులయందును సంపూర్ణముగా వ్యాపించి నిండి
యున్న దచల పరిపూర్ణ కేవలాత్మయొక్కటి మాత్రమే య
గును. ఎఱుకయంతటను వ్యాపించియున్నదని యనరాదు.
ఇతరులు చెప్పినను నామాటను వినరాదు. 125

కం॥ బయలాకసమని కొందరు । భయపెట్టెద రం
దువలన - భయపడకుసుమీ । బయలందు శబ్దమున్నను ।
బయలాకసమనుచు నమ్మ - బకును నీచేత * శబ్దములేదీ -
భ్రమ యెందుచేత * బయలాకాశము గాదు - పరిపూర్ణ

మని నమ్మి । నయముగ నెరుకను - నమ్మక విడిచిపో ।
బడును నీచేత * శబ్దములేదీ - భ్రమ యెందుచేత * 126

భా॥ బయలనగా ఆకాశము. అది "భూతాకాశము, చిత్తాకాశము, చిదాకాశము, నిరాకాశము" అని నాలుగు విధములు. ఇందు ఇతరనాలుగు భూతములు, భౌతిక పదార్థములు నుండుటకవకాశమిచ్చునది భూతాకాశము. దీనికి శ్రుతియుత్పత్తి నాశములు చెప్పుచున్నది. ఇది శబ్దగుణము కలిగియున్నది. కావున నిది బట్టబయలగు కేవలాత్మ కాదు. శరీరమునకు లోపల చిత్తాకాశమున్నది. దీనియందు జన్మజన్మాంతర కామకర్మాది వాసనలు, రజస్తమో గుణములు, రాగద్వేషాదులు మొదలగు వికారములున్నవి. కావున నిదియు బట్టబయలగు కేవలాత్మ కాదు. మనస్సునందు పుట్టి నశించెడి సంకల్పములకును, పుట్టబోవు సంకల్పములకును మధ్యనుండి రెంటి నెఱుగునది చిదాకాశము. ఈచిదాకాశమును పరాకాశమనియునందురు. ఇది యెఱుగుటయను క్రియకు కర్తయగుచున్నది. కావుననిదియు బట్టబయలగు కేవలాత్మ కాదు. అజ్ఞానులగు పామరులు కొందఱీ మూడింటిలో నొకదానిని బట్టబయలగు కేవలాత్మయని తలంచుచున్నారు. ఈమూడును బట్టబయలగు కేవలాత్మ కాజాలవు. బట్టబయలగు కేవలాత్మ నిరాకాశము. దానికి భూతాకాశమునకువలె నుత్పత్తి నాశములు లేవు. అది దేనియునికికి నవకాశమిచ్చునదికాదు. దానియందు శబ్దస్పర్శ రూపరసగంధాది గుణములు లేవు. కావున నది భూతాకాశముకాదు. మ

తేయు. దానియందు చిత్తాకాశమునందువలె కామకర్మాది వాసనలుగాని, సత్వరజస్తమోగుణములుగాని, రాగద్వేషాదులు మొదలగు వికారములుగాని లేవు. కావున నది చిత్తాకాశమునుకాదు. అది చిదాకాశమువలె మనస్సుయొక్క సంకల్ప వికల్పముల యుత్పత్తి నాశముల నెఱింగెడి కర్తయునుగాదు. దానియందేమియులేదు. అదియేమియుకాదు. ఏమియుకాక, యేమియులేక స్వతస్సిద్ధమై నిలిచియుండిన నిరాకాశమే బట్టబయలగు కేవలాత్మ. ఆకేవలాత్మయొక్క యునికినెఱిగి, దానియందు నానావిధనామ రూపనటనలతో తోచుచు, మరల మటుమాయమై పోవుచునుండెడి మూలములేని మాయయొఱుకను స్థిరమని నమ్మ విడిచిపెట్టుము. 126

కం॥ కలమేల్కు లెఱుకబయలుల । కిలసామ్యము
జేసిజూడు - మి భ్రమ తొలఁగున్ । ఫలమేమి పెక్కుచవము
వుల । వలనను జపయాగయోగ - వ్రతములవలనన్ *
శమదమముఖ - శతములవలనన్ * తలక్రిందుగాబడ్డ - తప
మునేగానన్న । కలమేల్కుగనితానె - క్కడ నిల్వవట్టుతే
వ్రతముల వలనన్ * శమదముఖ-శతములవలనన్ *127

భా॥ కలవలె నెఱుక తోచుచు, పోవుచున్నది కావుననది సత్యముకాదు. మెలకువవలె బట్టబయలగు కేవలాత్మ స్వతస్సిద్ధమై నిలిచియున్నది. కనుక నది సత్యము. ఈ విధముగ నెఱుకబయలుల రెంటిని కలమెలకువలకు సామ్యముచేసి చూచినచో నీ భ్రమ తొలగిపోవుచున్నది. దీనిని తెలియక

వేదశాస్త్ర పురాణాదుల నెన్నింటిని చదివినను, మూలను త్రిప్పుచు శివకేశవాదుల నామములను జపముచేయుచున్నను, రాజసూయాశ్వమేధాది యాగములెన్ని యొనర్చినను, మంత్రలయ హఠాది యోగముల నెన్నిటిని చేసినను, ఏకాదశి శివరాత్రి మొదలగు వ్రతములన్నిటి నాచరించినను, ఇంద్రియ మనంబులను నిగ్రహించి తనస్వాధీనమునం దుంచుకొనినను, జ్యోతిష్టోమాది యజ్ఞములను వందలాదిగా జేసినను, తలక్రిందికిని, కాళ్ళుపైకిని పెట్టి ఘోరముగా తపస్సుచేసినను, నేను శరీరమునుగాను శరీరముకంటె వేఱుగానున్నానని యెఱింగినను, స్వతస్సిద్ధమై నిలిచియున్న బట్టబయలగు కేవలాత్మయొక్క యునికిగాని, మూలములేకయే తోచుచున్న ఎఱుకయొక్క లేమిగాని తెలియబడదు. 127

కం॥ నీకలలోనిను నన్నును । లోకుల లోకముల జూచి - లోపలిభ్రమచే । నా కరుణ బడసి మేలుక । చేకొని కలకల్ల జేసి - చేరెదవెటకో * సర్వము నీతో - చేరును నెటకో * ప్రాకటముగబట్ట - బయలెరుకలేరీతి । నీకు దెలిసిన మీద - నిలువక వేవేగ । చేరెదవెటకో * సర్వము నీతో - చేరునునెటకో * 128

భా॥ నీకు కలవచ్చినప్పు డాకలలో నిన్నును, నన్నును, లోకులను, లోకములను జూచి నానావిధ భ్రమలను పొందుచున్నావుగదా ! మరల మెలకువ రాగానే కలకల్లయై పోవుచున్నది. అప్పుడు కలలోవచ్చిన నీవు, నేను, లోకులు, లోక

ములు ఎక్కడికి పోవుచున్నవో తెలియదు. అవి యెక్కడనుం డి వచ్చినది తెలియదు. అవివచ్చెడి చోటుగాని, పోయెడి తా వుగాని యెఱిగినవారులేరు. అవి మూలములేకయే తమంతట తాము తోచుచున్నవి. తిరిగి మూలములేకయే తమంతట తాము పోవుచున్నవి. ఇదేవిధముగ జాగ్రత్తలోకూడమూలము లేకయే యొఱుక తనంతటతాను తోచుచున్నది. అది తోచగ నే దానితోపాటు సమస్త ప్రపంచము తోచుచున్నది. ఆప్ర పంచమును జూచి యిది సత్యమని, సుఖసాధనమని తలంచి నీవు నానావిధ భ్రమలను పొందుచున్నావు. అదియెక్కడ నుండి వచ్చినదో, తిరిగి యెచ్చటికి పోవుచున్నదో యెవరికి తెలియదు. సద్గురుమూర్తి కరుణచే బట్టబయలగు కేవలాత్మస్థితి య నెడి మెలకువను గాంచినచో మూలము లేకయే తోచిన యొఱుక, ఆయొఱుకతోపాటు తోచిన ప్రపంచము మరలతమం తటతామే మటుమాయమై పోవుచున్నవి. 128

కం॥ హరికరనఖ ముఖ విదళిత । కరిమస్తక గళిత
మైన - ఘనసౌక్తికముల్ । దొరికిన నెరుకలు గురిజలె ।
ధరియింతురు రెంటివిలువ - తమరెరుగకనెకా * అస్లనెబోధ-
క్రమమెరుగలేకా * పరిపూర్ణబోధను - నెరిగింపుచుండిన ।
నెరుకకెకొందరు - మరిగేరిమర్మము * తమరెరుగకనెకా *
అస్లనెబోధ - క్రమమెరుగలేక * 129

భా॥ అరణ్యములో సింహము తనవాడియైన గోళ్లచే మదపు ఏనుగుల కుంభస్థలములను బ్రద్దలుచేసి విదలించి వే

యుసప్పుడా యేనుగుల కుంభస్థలములయందున్న గొప్ప విలువగల ముత్యములు క్రింద పడిపోవుచుండును. ఆ విలువగలిగిన ముత్యములు ఎఱుకలు, చెంచులు మొదలగు నడవిలో సంచరించెడి జాతులవారికి దొరికినప్పటికిని వారు వాని విలువను తెలిసికొనలేక వానిని పాఱవైచి, విలువలేని గురిగింజల పేరులనే ధరియించెదరు. అట్లే లోకులకీ గొప్పదియగు పరిపూర్ణబోధనెంత చెప్పినను వినక, దీనిగొప్పదనము నరయజాలక, యెఱుకలోని మార్గములయందే మఱిగియుందురు. పరిపూర్ణబోధనొక్క మర్మము వారికి తెలియదు. 129

కం॥ తనువో బహిరింద్రియములో । మనసో ప్రాణ
ములో విషయ-మమతో నేనం । చనినీవని యదియిదియని ।
యనుమానించెద వదేల - యది త్రోవగాదు * నీవెన్నడు -
నిదివినలేవు * విను మీపరిపూర్ణము - గనిలేని యూహిది ।
తనువాదికమునులేం - దనిగురుచే దెలియు । మది త్రోవ
గాదు * నీవెన్నడు - నిది వినలేవు * 130

భా॥ చార్వాకులగు పామరులు కొందఱు శరీరమునే యాత్మయనుచున్నారు. చార్వాకైక దేశికులగు మూఢులుకొందఱు బాహ్యేంద్రియములనే ఆత్మయనుచున్నారు. మానసోపాసకులు కొందఱు మనస్సునే ఆత్మయని తలంచుచున్నారు. ప్రాణోపాసకులు కొందఱు పంచప్రాణముల నాత్మయనుచున్నారు. మఱికొందఱు పామరులు విషయములయందుగల మమత్వ బుద్ధియే యాత్మయని తలంచుచున్నారు. ఈవిధముగ

నీవు వేఱు నేను వేఱని, నీవే నేనని, అదియే నేనని, ఇదియే నే నని సంశయములను పొందనేల ? ఇవియన్నియు సత్యమైనవి కా వలుకావు. సద్గురుమూర్తి కరుణచే నచలపరిపూర్ణ కేవలాత్మ యునికి నెఱింగినచో నీవిదినఱకు నేనని తలంచుచున్న శరీరము, బహిరింద్రియములు, మనస్సు, పంచప్రాణములు, విషయముల యందలి మమత్వబుద్ధి మొదలగునవన్నియు మూలము లేనివగు టచే లేక పోవుచున్నవి. నీవి బోధ నెన్నడు వినియుండలేదు. ఇప్పుడు నీవుదీనిని శ్రద్ధగావినుము. 130

కం॥ నినునను ప్రపంచమును నిజ । మనియెఱిగెడి యెఱుకచేత - నచలమును కనుం । గొనినినునను జగము ను నిజ । మనియెఱిగెడి యెఱుకనూను - మమలవివేక * చాలును నీవి - క్రమమెఱిగినాక । నినునన్ను పై రెండిం - టిని విశ్వమనకబయ । లనకుండే దున్నదం - చనగుర్తు లేకుండు । నమల వివేక * చాలునునీవి - క్రమమెఱిగి నాక * 131

భా॥ నిన్ను, నన్ను, ప్రపంచమును సత్యమని భ్రమిం చెడి యెఱుకచేత నచలపరిపూర్ణ కేవలాత్మయునికి నెఱింగి, నిన్ను, నన్ను, ప్రపంచమును సత్యమని యెఱిగెడి యెఱుకను విడిచిపెట్టుము. ఈపద్ధతి నీవెఱింగినచో నికనీవు తెలియవలసి నదిలేదు. అప్పుడు నీవు, నేను, ప్రపంచము, బట్టబయలగు కే వలాత్మయనెడి గుర్తులుంగని యచలపరిపూర్ణ కేవలాత్మ స్వతస్సిద్ధమై యుండును. 131

కం॥ ప్రొద్దున నిద్దురమేల్కొని । వద్దకు నేతెంచి గురుని - వక్త్రిజనితమౌ । సుద్దులను మ్రొక్కి-వినుమే । ప్రొద్దిదిబహుముద్దునుమ్మి - పుట్టినందులకు * గురుచరణము - పట్టినందులకు * నిద్దమౌభక్తిచే - నీవిట్లు జేసితే । దిద్దితీరిచి బోధ - తెరవుజూపునునీవు । పుట్టినందులకు * గురుచరణము పట్టినందులకు * 132

భా॥ ప్రతిదిన ముదయమున నిద్రనుండి లేవగనే కాలకృత్యముల దీర్చుకొని, సద్గురుమూర్తి సన్నిధికేతెంచి, వారికి సాష్టాంగదండ ప్రణామము లాచరించి, శ్రీవారినోటినుండి వెలువడెడి పరమార్థ విషయములను వినుచుండుము. నీవు ప్రతిదిన మీవిధముగా చేయుచున్నచో ముచ్చటగానుండును. నీవు మానవజన్మమెత్తి, గురుపాదము పట్టినందులకు నీజన్మము సార్థకమగును. త్రికరణ శుద్ధిగా నిత్యము భక్తితో నీవిట్లు చేయుచున్నచో నాసద్గురుమూర్తి కనుగ్రహముకలిగి, నీకచలపరిపూర్ణ బోధ నెఱింగించి నిన్ను తీర్చిదిద్దును. నీవుజన్మ సాఫల్యమును పొందెదవు. 132

కం॥ గురుకు పరిపూర్ణ మునుజూ । పెరుకను లేందనుచు దెల్పి-యిక దలపకుమం । చెరిగింపక విడిపోవునె । యెరుకనరుల్ సాధనముల - నెన్నిచేసినను * లక్ష్యముగ - లెన్నిచూచినను * హరిహర బ్రహ్మాసు - రాసుర ముఖులైన । ధరణీసురాద్యష్ట - దశజాత్యుద్భవులైన ।

నెన్నిచేసినను । లక్ష్యముద్ర - లెన్నిచూచినను * 133

భా॥ సద్గురుమూర్తి యచలపరిపూర్ణ కేవలాత్మయనికిని తెలిపి, మూలములేని యెఱుక యెక్కడనులేదని యెఱిగించి, యిక యెఱుకమాట తలచవద్దని తెలుపకపోయినచో నెఱుక విడిచిపోదు. ఎఱుకతో తోచిన బ్రహ్మవిష్ణు మహేశ్వరాది ప్రముఖ దేవతలుగాని, ఇంద్రాదిసామాన్య దేవతలుగాని, యసుర యక్షకిన్నెర కింపురుషాదులుగాని, బ్రాహ్మణాది పదునెనిమిది జాతులలో పుట్టిన మానవులుగాని, యెఱుకలోని సాధనలెన్ని చేసినను, లక్ష్యములతోకూడ పంచముద్రలను పట్టినను, యోగయోగాంగాది సాధనలన్నింటిని సాధించినను నెఱుక విడిచిపోదు. 133

కం॥ బలధన విద్యాధైర్యం । బులు చక్కదనంబు సత్వ - బుద్ధ్యాద్యుతులన్ । కలలోనివిలేనిమను । ష్యులజగమును తననుతాను - జూచి మానవుడు * మేల్కనెనేని - చూడలేదౌకడు * కలమేల్క - లెరుకబయ-లుల కట్లజతగూర్చి । కలయెరుకలను దేశి - కులచేవీడినవాలు । చూచిమానవుడు * మేల్కనెనేని - చూడలేదౌకడు * 134

భా॥ బలవంతులను, విద్యావంతులను, ధైర్యవంతులను, రూపవంతులను, సత్వగుణసంపన్నులను, బుద్ధిమంతులను, ఇవియేమియులేని మనుజులను, ప్రపంచమును, తన్ను, తాను కలలోజూచి మేల్కొనిన మానవుడా మెలకువలో కల లో దోచినవాని నేమియు జూచుటలేదుగదా! అట్లే ఎఱుక

యను కలగనుచున్న మనుజ డా యెఱుకయను కలలోనే బల వంతులను, బలహీనులను, విద్యావంతులను, విద్యావిహీను లను, ధైర్యవంతులను, పిరికివారిని, రూపవంతులను, రూప హీనులను, సత్వగుణసంపన్నులను, సత్వహీనులను, బుద్ధిమం తులను, బుద్ధిహీనులను, సమస్త ప్రపంచమును, తన్ను, తాను చూచుచున్నాడు. సద్గురుస్వామి యనుగ్రహముచే పరిపూర్ణ స్థితి యను మహాజాగ్రత్తనుపొంది, యెఱుకయను కలను విడిచిపెట్టిన వా డింకొక్కదానిని చూడలేడు. ఎఱుకయను కలలోదోచిన సమస్తప్రపంచము ఎఱుకతోనే యెగిరిపోవు చున్నది. ఈ విధముగ కలనెల్ల నెఱుక బయలులకు సా మ్యముజేసి లేనికలయెఱుకలను విడిచిపెట్టినచో, మెలకువ బయలులు స్వతసిద్ధముగా నుండుసు. 134

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులయందు మతాల లక్షణమను సప్తమాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకా చార్యవర్య, స్వామి, శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే రచియింపబడిన భావార్థదీపికా సహితము.



# 8. పరిపూర్ణబోధ

కం॥ ఈ వట్టిబట్టబయలును । నీవిప్పుడె యుండజూ చి - నిజముగనెరుకన్ । నీవని నేనని జగమని । భావిం

పుము పిదపదీన్ని - బాయుమనిశముగా * నిజముగదీన్ని - బాయకనిశముగా * శ్రీవనితేశరా - జీవసంభవభవ । దే వేంద్రాదులనింక - సేవించుచలపేల । పాయుమనిశముగా * నిజముగదీన్ని - బాయకనిశముగా * 135

భా॥ మొదట నీ వీ యుత్త బట్టలగు కేవలాత్మ యొక్క యునికి నెఱుంగుము. తరువాత నీవు, నేను, సమస్త ప్రపంచ ముగా తోచుచున్నది మూలములేని యొఱుకయని తెలిసికొ నుము. అటుపిమ్మట నానావిధనామరూపనటనాత్మక జగత్తుగా తోచుచున్న నీమూలములేనియొఱుకను విడిచిపెట్టుము. మూల ము లేకయే తోచుచున్న నీ యొఱుకను విడిచిపెట్టక, దానిచే కల్పింపబడిన మూలములేని బ్రహ్మదేవుని, విష్ణుమూర్తిని, మ హేశ్వరుని, మహాశక్తిని, ఇంద్రాది దేవతలను పూజింపవలయు నను తలంపును వీడుము. మూలము లేని యొఱుకచే కల్పింప బడిన మూలములేని దేవుళ్లందఱు మూలములేని యొఱుకతో పాటు మటుమాయమై పోయెదరు. 135

కం॥ లేదనకుమున్నదదిగో। నేదెలిసితిననకుదీన్ని - నీవెఱిగెదవా । కాదది నీచేదెలియను । ఏదిరతన్మాత్ర సమి తి - యీ బట్టబయట * దీనికిసాటి - దేదియెచ్చోట * వా దేలలేనెరుక - తోదీన్నిగనిపెట్టి । పోదోలు మెరుకనిం - కేదిబట్టడువాలు । నీబట్టబయట * దీనికిసాటి - దేదియె చ్చోట * 136

భా॥ ఈ బట్టబయలగు కేవలాత్మను నీవు లేదనకుము. ఇది. సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును, స్వతస్సిద్ధమై నిండియున్నది. దానిని నీవు 'ఇది' యని విధిముఖముగ నెఱుగజాలవు. 'శబ్దస్పర్శ రూపరస గంధము'ల నెడి తన్మాత్రలున్న వస్తువులే నీ చేత విధిముఖముగ తెలియబడునుగాని, తన్మాత్రలు లేని వస్తువులు నీచేత విధిముఖముగ తెలియబడవు. బట్టబయలగు కేవలాత్మ శబ్ద స్పర్శరూప రసగంధము'ల నెడి తన్మాత్రలుగలదికాదు. కావుననదినీచేతవిధిముఖముగ తెలియబడదు. దీనితో సమానమైనదిగాని, యధికమైనదిగాని యేదియులేదు. నీ వేవాదములను చేయక దీని నెఱుకచే నిషేధ ముఖముగ నెఱింగి, ఆయెఱిగిన యెఱుకను విడిచి పెట్టుము. ఇంతకంటెనీవు వేఱుగాచేయవలసినదేదియు లేదు. 136

కం॥ కనవచ్చి యిట్టిదట్టిది । యనియనరాకుండు బయలు - సదెకనుగొనుమీ । కనరాకయున్న శూన్యం । బనుమిట్టిది యట్టిదనుచు - పలుకవచ్చినను * ఎరుకదాంట్లో । పలికిజొచ్చినను * వినుమాబయలును నీవే - మునినన్నాప్పెదగానో । ప్పనుసీమాటనునేజె - ప్పినరీతిగనవస్తై । పలుకవచ్చినను * ఎరుకదాంట్లో - పలికి జొచ్చినను * 137

భా॥ ఆ బట్టలగు కేవలాత్మ నిషేధ ముఖముగ నీకు తెలియబడినను "అదియిటువంటిది, అంటునంటిది" అని చెప్పరానిదై యుండును. అది నిషేధముఖముగాకూడ తెలియబడకుండినచో దానిని నీవు శూన్యమని చెప్పవచ్చును. గాని నిషే

ధముఖముగ నీకు తెలియవచ్చుచున్న బట్టబయలగు కేవలాత్మను నీవు శూన్యమని చెప్పరాదు. అది విధిముఖముగ తెలియవచ్చినను, నీచేత యిట్టి దిట్టిదని చెప్పబడినను, ఎటుకదానిలోనికి చేరబడినను, నీవాబట్టబయలునుగూర్చి యేమిచెప్పిన నొప్పుకొందునుగాని, నేను చెప్పినరీతిగా నిషేధముఖముగా తెలియబడినదై, యిట్టి దిట్టిదనియనరానిదై, మూలములేని యెఱుక ప్రపంచములు లేనిదై, స్వతస్సిద్ధముగ నిండియున్న బట్టబయలగు కేవలాత్మనుగూర్చి నీవేమి చెప్పినను నేనొప్పుకొనను. 137

కం॥ కనవచ్చు బయలులేదని । యనవచ్చునె యిట్టి
దిట్టి - దనవచ్చునెటీ । యనరాదు నెఱుక కెన్నడు । కనుక
నె యీ బయలునెల్ల - కాలమొయుంచుండీ * దీనందెఱుకే -
కాలములేందీ * వినుమీతేనెఱుకను - వివరింపశూన్యమౌ ।
ననుమానమే మెఱుక - గను విశ్వమిట్టిదే । కాలముంచుం
దీ * దీనందెఱుకే - కాలములేందీ * 138

భా॥ నిషేధముఖముగ తెలియవచ్చుచున్న బట్టబయలగు కేవలాత్మ లేదనరాదు. అది నిషేధముఖముగ తెలియబడుచున్నను, నెఱుకచే నిటువంటిది, అటువంటిదియని యెన్నడు చెప్పబడదు. ఈబట్టలగు కేవలాత్మ సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును స్వతస్సిద్ధముగా నిండి నిబిడీకృతమైయున్నది కావున దీనిని శూన్యమనరాదు. దీనియందుమూలము లేకయే తోచుచున్న యెఱుక యేకాలమునందును లేదు. దీనిమూలమును గూర్చి విచారించి

నచోనిదియెచ్చటను కానరాదు. కావున నిదిశూన్యమనబడెను. మూలములేని యెఱుకతోపాటు తోచి, యెఱుకచే నెఱుగబడు చున్న ప్రపంచమునకుకూడ మూలములేదు కావున నదియు శూన్యమేయగును. 138

కం॥ పరిపూర్ణమునిన నెట్టిదొ । యెరిగెదనని యెరుకబయటి - కేగిన యెరుకే । యెరుకకుశూన్యం బయ్యెను । నెరుకను జన్మించినట్టి - యీ విశ్వమంత * యెరుకవలెనే - యేమిలేదంత * యెరుకయుండంగానె - యెరుక విశ్వములులే । వెరుక కె యిదిమాడ - నెంతోవింతై తోచు । నీవిశ్వమంత * యెరుకవలెనే - యేమిలేదంత * 139

భా॥ పరిపూర్ణ బ్రహ్మమెట్లుండునో చూడవలయునని తలంచి యెఱుక బయటికి పోయినచో నాయెఱుకే శూన్యమై పోవును. ఆ యెఱుక శూన్యముకాగానే ఆ యెఱుకతోపాటు తోచి, యెఱుకచే నెఱుగబడుచున్న నీ ప్రపంచముకూడ నెఱుకతోపాటు శూన్యమైపోవుచున్నది. ఈ యెఱుక యచల పరిపూర్ణబ్రహ్మము నెఱుగుటకు ప్రయత్నించిన తోడనే యెఱుకయును, నా యెఱుకతో వచ్చినప్రపంచమును మటు మాయమైపోవుట యెఱుకకే విచిత్రముగానుండును. 139

కం॥ గురుమూర్తి చూపకున్నను । పరిపూర్ణంబెట్లు తనకు - ప్రత్యక్షమగున్ । గురుమూర్తిచూపెనేనియు । పరిపూర్ణము తనకులెస్స - ప్రత్యక్షమౌరా * చూస్తునెయెరుక - పారిపోవునురా * ఎరుక పోయినవెనుక - నెవరా

ప్రత్యక్షౌన్ని । నెరిగిట్టిదట్టిదం - చెరిగేవారటుమీద । ప్ర
త్యక్షమౌరా * చూస్తునెయెరుక - పారిపోవునురా * 140

భా॥ సద్గురుమూర్తి స్వతస్సిద్ధమై నిలిచియున్న అచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క స్థితిని నిషేధముఖముగ తెలుపక పోయినచో నా యచలపరిపూర్ణ బ్రహ్మము తనకెట్లు ప్రత్యక్షమగును ? ప్రత్యక్షముకాదు. సద్గురుమూర్తి ఆ యచలపరిపూర్ణబ్రహ్మముయొక్క స్థితినినిషేధముఖముగ నెఱింగించినచో నా యచల పరిపూర్ణబ్రహ్మము స్వతస్సిద్ధమైయున్నట్లు తనకు తెస్పగా ప్రత్యక్షమగును. ఆ స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ బ్రహ్మము నుండజూచినతోడనే మూలము లేని యెఱుకయెచ్చటను నిలువక పాఱిపోవుచున్నది. అదిపాఱి పోయిన తరువాత స్వతస్సిద్ధమై ప్రత్యక్షముగ నిలిచియున్న యచలపరిపూర్ణ బ్రహ్మము నట్టి దిట్టిదని యెఱిగి చెప్పేవారెవరుందురు ? 140

కం॥ పరమపదమనిన బయలన । గురుగుహ్యాము నంతమనిన - గోప్యంబనినఖ । పరిపూర్ణమచలమనినను । తిరమనగా బట్టబయలు - తెలియుమాయప్పా * ఈతెలిసిన - తెలివిమానప్పా * యెరుకనెరుగనిదన్న - నెరుక మీరినదన్న । నెరుకమరపులులేని - పరవస్తువనబయలె । తెలియుమాయప్పా * ఈతెలిసిన - తెలివిమానప్పా* 141

భా॥ నీవు పరమపద మనినను, బట్టబయలనినను, గురు రహస్య మనినను, అనంతమనినను, గోప్యమనినను, పరిపూర్ణ

మనినను, అచలమనినను, స్థిరమైనదనినను, ఎఱుక నెఱుగని దనినను, ఎఱుకనుమీరి యున్నదనినను, ఎఱుక మఱుపులు లేని పరవస్తువనినను, బట్టబయలగు కేవలాత్మయని తెలిసికొను ము. తరువాత నా తెలిసిన తెలివిని విడిచిపెట్టుము. 141

కం॥ బట్టబయలనుచు దీనికి । మొట్టమొదల్ పేరు లేదు - ముదమున నెరుకే । పుట్టిపేర్పెట్టి దీనిని । పట్టుక లవ్వాడలేక - పారిపోవునురా * కనరాదింక - దూరనేర దురా * పుట్టిచచ్చుచు మళ్లీ - పుట్టిగిట్టుచునుండు । నిట్టి తిప్పలనొందు - నెరుకే బయలునుజూస్తే । పారిపోవును రా * కనరాదింక - దూరనేరదురా * 142

భా॥ ఈయచల పరిపూర్ణ బ్రహ్మమునకు మొట్టమొద ట నే పేరునులేదు. ఎఱుకతోచిన పిదప దానికి బట్టబయలని పేరు పెట్టినది. పేరుపెట్టిన దేకాని తరువాత నాబట్టబయలు నది పట్టుకొనియుండలేక పాఱిపోవుచున్నది. అది బట్టబయలులో దూరబడి యుండనేరదు. ఆయెఱుక యెల్లప్పుడు పుట్టుచు గిట్టు చు, మరల పుట్టుచు గిట్టుచు, నిటువంటి నానావిధములగు త్రి ప్పలను పొందుచుండును. అట్టి త్రిప్పలను పొందెడి యెఱుక బట్టబయలగు కేవలాత్మయునికి నెఱింగినచో నెచ్చటను నిలువ జాలక పాఱిపోవును. 142

కం॥ వినుము నేననుచు నెరిగెడి । తనువందున లేక బయలు - తానిండినదౌ । కనుగొనుమది కనుగొని యూ । తనువును విడనాడుమింతె - తడవేలనోయి * యూ

పనికింక - గడువేలనోయి * అను మానముంచె నీ - వర
యుము శివరాము । లను దీక్షితులుజేసె - సచల గ్రంధము
నంతఁ తడవేలనోయి * యాపనికింక-గడువేలనోయి* 143

భా॥ బట్టబయలగు కేవలాత్మ కాలకృత, దేశకృత,వస్తు
కృత పరిచ్ఛేదములులేక స్వతస్సిద్ధమై నిండియున్నది. దాని
యందు మూలములేని గుర్తెఱిగెడి శరీరమొన్నడును లేకయే
తోచుచున్నది. ఈరెంటియొక్క స్థితిగతులను నీవు గుర్తెఱిగి,
మూలములేని గుర్తెఱిగెడి శరీరమును విడనాడినచో నింతియే
చాలును. దీనికి నీవాలస్యముచేసెద వెందులకు ? దీనికి గడు
వేల కావలయును ? నీకు నేను చెప్పిన మాటలయందనుమా
న మున్నచో శ్రీ శివరామ దీక్షితులు రచియించినఅచలగ్రం
ధమును చదువుము. నీసంశయములన్నియు తీరిపోవును. 143

కం॥ దేహాకారము కానిది । యాహంభావంబులేని-
దఖిలజనులు దా । సోహంసోహంబనినను । మోహము
జెందనిది బయలు - మొదలెరుగవలెరా * యెరిగినయెరుక-
తుదకరుగవలెరా * కోహంక స్త్వంబని - కూతలుగూసెడి ।
దేహిదేహములను - తెలియనిదీబయలు । మొదలెరుగవలె
రా * యెరిగిన యెరుక - తుదకరుగవలెరా * 144

భా॥ బట్టబయలైన కేవలాత్మ స్థూలదేహముగాని,
సూక్ష్మదేహముగాని, కారణదేహముగాని, మహాకారణ దే
హముగాని, కైవల్య దేహముగాని కాదు. దానియందు నే
ననెడి యహంకారములేదు. సమస్తమానవులు దానికిదాసోహ
మను

మనినను, అనగా నీవు దేవుడవు. 'నేను నీకు దాసుడను' అనినను, సోహమనినను, అనగా "నీవే నేను, నేనే నీవు" అనినను మోహమును పొందదు. అట్టి బట్టబయలైన కేవలాత్మే యునికిని మొట్టమొదట నెఱుంగవలెను. తరువాత నా యెఱిగిన యెఱుకను విడువవలెను. నిజము నెఱుంగక 'నే నెవరు? నీ వెవరు?' అని కూతలు కూసెడి దేహి దేహముల భ్రాంతిని పొందకుము. అరెంటి నెఱుంగని బట్టబయలగు కేవలాత్మ యునికిని మొట్టమొదట నెఱింగి, పిదప నా యెఱిగిన యెఱుకను విడువుము. 144

కం॥ ఏవస్తువుచేతను దా । నావిర్భవమొందు దేహ-మనుతరువరయన్ । ఆవస్తువె దానికివి । త్తైవెలయునుదాన్నిసాక్షి - ద్రష్టనికనుమీ * యెరుకయిదె - స్పష్టము వినుమీ * భావించినాడుమీ - బట్టబయలను భూమి । యావిత్తు చెట్టున్న - దరయదావిత్తునే । ద్రష్టనికనుమీ * యెరుకయిదె - స్పష్టమువినుమీ * 145

భా॥ దేహత్రయమను వృక్షమునకు సచ్చిదానందాత్మ వి త్తనము. ఆవి త్తనమగు సచ్చిదానందాత్మను "ద్రష్ట, సాక్షి" అని యందురు. దృశ్యమగు దేహత్రయము నెఱుగుటచే నది ద్రష్ట యనబడును. సాక్ష్యమగు నవస్థాత్రయము నెఱుగుటచే నది సాక్షి యనబడును. దేహత్రయమునకు ద్రష్టయు, నవస్థాత్రయమునకు సాక్షియునగు సచ్చిదానందాత్మయొక్క చలన శక్తియే మనస్సు. అచలనశక్తి యుక్తమగు సచ్చిదానందాత్మ

యెఱుక యనబడును. ఆ యెఱుకచేతనే దేహేంద్రియాది సమస్త ప్రపంచము తోచుచున్నది. కావున నా దేహేంద్రియాది సమస్త ప్రపంచము వృక్షమనబడుచున్నది. ఆ వృక్షమున కెఱుకయే విత్తనము. ఈవిత్తు, చెట్టులు రెండును బట్టబయలగు కేవలాత్మయందుమూలము లేకయే తోచుచున్నవి. మూలములేకయే తోచుచున్న నావిత్తు చెట్టుల రెంటిని బట్టబయలగు భూమి యెన్నడు నెఱుగదు. 145

కం॥ ఏ పరిపూర్ణము మేనికి । లోపలవెలినిండియుం
డు - లోపములేకన్ । నాపరిపూర్ణమె జగతికి । లోపలవె
లినుండు దాని - లోనే యున్నవిరా * పైరెండెవ్వి - లే
నివెన్నకురా * యీ పూర్ణబోధచే - పై ప్రపంచశరీర ।
రూపములెడబాపు - మీ పట్లనేదాని । లోనేయున్నవిరా *
పై రెండెవ్వి - లేనివెన్నకురా * 146

భా॥ ఏ లోపమునులేక శరీరమునకు లోపల వెలుపల నిండియున్న పరిపూర్ణ బ్రహ్మమే, సమస్తప్రపంచమునకు లోపల వెలుపల నిండియున్నది. ఆ బట్టబయలగు పరిపూర్ణ బ్రహ్మమునం దీ శరీరప్రపంచములు రెండును మూలము లేకయే తోచుచున్నవి. నీవీ రెంటిని సత్యములని భావింపకుము. సద్గురుమూర్తికరుణచే పరిపూర్ణబోధను చక్కఁగా గ్రహించి, యచల పరిపూర్ణ కేవలాత్మ యునికిని, మూలములేకయే తోచుచున్న శరీరప్రపంచముల లేమిని నెఱింగి, లేని శరీరప్రపంచములను రెంటిని విడిచిపెట్టుము. 146

కం॥ ఎరుకనగా నెరుగుటమరి । మరపనగా నెరుక తన్ను - మరచుట యీాతెం । ర్నెరుగనిదె బయలని నీ । వెరి గెరుకను మరపునిప్పు - పెరుకచే విడరా * విడిచితేపై మూ - బెరిగేదెవ్వడురా * ఎరుకేపరిపూర్ణ ముం - చెదిరించి వదరేవు । పరిపూర్ణమైతే మూ - పరబయలం దునదాన్ని । నెరుకచేవిడరా * విడిచిరేపైమూ - బెరిగేదెవ్వడురా * 147

భా॥ తన్ను, శరీర ప్రపంచములను నెఱుగునది యెఱుక. తన్ను, శరీర ప్రపంచములను మఱచునది మఱపు. ఈ రెంటి నెఱుగనిది బట్టబయలగు కేవలాత్మ. నీవు ఎఱుకచే బట్టబయ లగు కేవలాత్మయునికిని, మూలములేక యే తోచెడి యెఱుక మఱపుల లేమిని నెఱింగి, మూలములేని యెఱుకమఱపులను విడిచినచో నాపైన స్వతస్సిద్ధముగా నిలిచియున్న పరిపూర్ణ బ్రహ్మము నెఱుగువాడెవ్వడు? నీవు ఎఱుకయే పరిపూర్ణ బ్రహ్మమని నాతో నిరసించి వదరుచున్నావు. అది పరిపూర్ణ బ్రహ్మమైనచో, దానినిసర్వత్రనిండి స్వతస్సిద్ధమైయున్న బట్ట బయలగు కేవలాత్మయందు చూపుము. అప్పుడు నీమాట నిజమని నమ్మెదను. 147

కం॥ లేదన్నను గనుపడుగద । నేదెలిసితిననిన బయట - నేనిల్వగదా । నేదీనివెనుకగదనా । కేదో మూలంబు నిదిగా - దికలేదెచ్చోట * కనుకనెహూళ్ల - క్కైనేనన్మాట * ఏదిలేదిదితప్పు - నేదెలియనిదియని । తాదెలిసికొని

యెరుక - తన్నువీడితెచాలు । నికలేదెచ్చోట * కనుకనె
హంకృ - క్రీ నేననామట * 148

భా॥ బట్టబయలగు కేవలాత్మ లేదని చెప్పినచో, నదిసర్వ కాలములయందును, సర్వ దేశములయందును, సను స్తవస్తువుల యందును సంపూర్ణముగనిండి స్వతస్సిద్ధమై తెలియబడుచు న్నదిగదా ! నేను దానిని తెలిసితినని చెప్పినచో, నేనా బట్ట బయలునందు నిల్వజాలనుగదా ! నేను స్వతస్సిద్ధముగా నిండి యున్న బట్టబయలునందు తరువాతగదా ! తోచితిని. నా మూలమేదో నాకు తెలియనే తెలియదు. స్వతస్సిద్ధమై నిండి యున్న బట్టబయలు నిర్వికారమగుటచే నది నాకుమూలము కానేరదు. నేనుతోచినప్పుడు మూలములేకయే నాతోపాటు తోచుచున్న జీవేశ్వరజగత్తులుకూడ నాకు మూలముకాదు. కావున నాకెచ్చటను మూలములేదు. అందువలన నేను కూ శక్తియే యగుదును. స్వతస్సిద్ధముగ నిండియున్న బట్టబయ లగు కేవలాత్మతప్ప రెండవదేదియును లేదు. దానిని నేనెఱుగ జాలనని తెలిసికొని యెగిరిపోయినచో బట్టబయలగు కేవ లాత్మ స్వతస్సిద్ధముగనుండును. 148

కం॥ సత్యమగు బట్టబయలు న । సత్యంబగు నెరుక
నెరిగి - సద్గురుకృపచే । సత్యముగాదని యెరుకను । సత్య
ముగా సమ్మియుంటె - చాలువాలన్న * వానిలోటె - సా
టెవ్వరన్న * నిత్యానిత్యములను - నిర్ణయమెరుగక । ని

త్యమైయుండేటి - నిజబోధగలిగిన । చాలువాలన్న * వాని
తోటి - సాటెవ్వరన్న * 149

భా॥ సత్యమగు బట్టబయలుయొక్క యునికిని, అసత్యమగు నెఱుకయొక్కలేమిని సద్గురుమూర్తి దయవలన నెఱిగి యెఱుక సత్యముగాదని దృఢముగా నమ్మియుండుటయే చాలును. వానితో నెవరును సమానులుకారు. నిత్యమైన బట్టబయలునుగూర్చిగాని, యనిత్యమైన యెఱుకనుగూర్చిగాని తర్కవితర్కములనుజేయక, నిత్యమైయుండే యచలపరిపూర్ణ బ్రహ్మబోధనుపొంది, యనిత్యమైన యెఱుకను విడిచియుండిన చాలును. వానితో నెవ్వరు సమానులుకారు. 149

కం॥ పరిపూర్ణములో దోచిన । యెరుకేకల లేనియెరుక - నెరిగిమృషనియా । మరుగెరుక కెరుకదెల్పిన । నెరుగుటయే మేల్కనుమ్మి - యిది యేమారకుమీ * సద్గురునాజ్ఞ - కెదిరి మీరకుమీ * ఎరుక యీ రీతిగ - నెగిరిపోయిన వెనుక । పరిపూర్ణమొకటుండు - పలుకరాదెట్లందు । నిది యేమారకుమీ * సద్గురునాజ్ఞ - కెదిరి మీరకుమీ *

భా॥ స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ బ్రహ్మమునందు మూలములేకయే తోచిన యెఱుకయేకల. ఈ మూలములేకయే తోచినయెఱుక లేనేలేదను రహస్యమెఱుక కెఱుక తెలుపగా నదియెఱుగుటయే యెఱుకకు మేల్కువ. దీనిని నీవెప్పుడును మరచిపోవద్దు. సద్గురుస్వామియాజ్ఞ కెప్పుడు నెదురాడవద్దు. ఈవిధముగ మూలములేనియెఱుక యెఱిగి యెగిరి

పోయినతరువాత నచలపరిపూర్ణ బ్రహ్మమొక్కటి మాత్రమే స్వతస్సిద్ధముగా నిలిచియుండును. దానియందే పలుకునులేదు.

కం॥ త్రిప్పులగు రాకపోకల । నెప్పుడు తానెరుగ
నట్టి - యీబయలందున్ । తప్పకతనకై తానే । తప్పునగన
వచ్చి యెరుక - తాగానరాదు * బయలున్నది - తనకెరుక
లేదు * ఎప్పుడు బయలున్న - దెరిగి తాలేనట్టి । చొప్పు
సద్గురుబోధ - చొప్పున దెలిసితే । తాగానరాదు * బయలు
న్నది - తన కెరుకలేదు * 152

భా॥ రాకపోకల త్రిప్పులనెప్పుడు నెఱుగక, స్వతస్సిద్ధముగ నిండియున్న బట్టబయలగు కేవలాత్మయందు మూలములేని యెఱుక మెఱుపుతీగవలె తనంతటతానే తోచి, యంతలోనే మటుమాయమై పోవుచున్నది. అది బట్టబయలగు కేవలాత్మ స్వతస్సిద్ధముగా నిండియున్నదనికూడ నెఱుగదు. ఈ మూలములేని యెఱుకయే సద్గురుమూర్తి బోధవలన స్వతస్సిద్ధముగ నిండియున్న కేవలాత్మయునికిని, తనలేమిని తెలిసికొని నచో తానెచ్చటను గానరాక మటుమాయమై పోవుచున్నది. 151

కం॥ అన్నము శుక్లంబగురస । మున్నతిగా రక్త
మగును - నొకచోరెండున్ । పన్నగగలసిన మేనని ।
యెన్నబడు న్నెరుకగలిగి - యిదెమాయసుమ్మీ * మూల
ములేని - దిదెనీవునమ్మి * యున్నావు పరిపూర్ణ - మున్న

దిగని లేని । దెన్నడులేదని - యెరిగితేవాలు గు । ర్తదెమా
యనుమ్మి * మూలములేని - దిదె నీవునమ్మి * 152

భా॥ పురుషుడు భుజించెడి యన్నపానముల రసము
వలన శుక్రము కలుగుచున్నది. స్త్రీభుజించెడి యన్నపానముల
రసమువలన శోణిత ముదయించుచున్నది. స్త్రీపురుషుల సం
పర్కము వలన స్త్రీగర్భమునందు శుక్రశోణితములు కలసి
మెుుక శోకూడిన శరీరమేర్పడుచున్నది. ఆ మెుుక శోకూ
డిన శరీరము స్త్రీగర్భమునందు మాయగా నేర్పడుచున్నది.
ఇది యెచ్చటనుండి వచ్చుచున్నదో యెవరికిని తెలియదు.
దీనికి మూలమెచ్చటను లేదు. ఈ మూలములేని గుర్తెఱిగెడి
దేహమునే సత్యమని నీవునమ్మియున్నావు. సద్గురుమూర్తి క
నుగాచే నీవచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, మూల
ములేని మెుుకశరీరముల లేమిని యెఱింగినచో మూలములేని
మెుుక శరీరము లెవరికి చెప్పకుండా వెళ్లిపోవును. 1'2

కం॥ కనకమన భూషణంబులు । ఇనుమనశస్త్రాది
కంబు - లిత్తడియనినదా । గనుగొన పాత్రలుగనుపడు ।
తనువన నవయవములన్ని - తగదొంతియనిన * కుంద
లు భూత - తతిజగత్తనిన * వినుమట్లు యెఱుకన్న - వి
వరింప తత్త్వాలు । మనసందు గట్టిగ - మఱవకుమీమాట ।
తగదొంతియనిన * కుండలుభూత - తతి జగత్తనిన * 153

భా॥ బంగారు మాభరణములుగను, ఇనుము శస్త్రాస్త్రా
దికములుగను, ఇత్తడి పాత్రలుగను, శరీరమవయవ సముదాయ

ముగను, నొంతికుండలుగను, పంచభూతములు జగత్తుగను గనిపించుచున్నట్లు, ఎఱుకపంచ వింశతితత్త్వములుగా గనిపించుచున్నది. ఈ విషయమును నీవు మఱువవద్దు. పంచవింశతి తత్త్వములకంటె నెఱుక భిన్నముకాదు. 153

కం॥ పౌరలరటిదుంప యనినను । తరువులు వన
మనిన రవలు - ధారుణియనినా । గిరియనినరాళ్ల బట్టలు ।
ధరముళ్ళియలనినతత్త్వ - తతియెరుకంచనిన * లేనిదె
యెరుక - స్థితిలెస్సకనిన * ఎరుకచేసిన విశ్వ - మెరుక
వంటిదె బయలు । నెరుకగు రైరిగి తా - నేగితెసరితత్త్వ ।
తతియెరుకం చనిన * లేనిదెయెరుక - స్థితిలెస్సకనిన* 154

భా॥ పౌరలసముదాయ మరట్టిదుంపగను, వృక్షముల సముదాయము వనముగను, అణువులసముదాయము భూమిగను, శిలాలసముదాయము పర్వతముగను, నూలు సముదాయము వస్త్రముగను, అయినవిధమున, పంచవింశతితత్త్వముల సముదాయము ఎఱుకయైనదని తెలియుము. దీని మూలమును గూర్చి లెస్సగా విచారించినచో నెచ్చట నిది కనిపించదు. కావున నిదిలేనిదని చెప్పబడెను. ఈ మూలములేని యెఱుక తాను తోచినప్పుడు తనతోపాటు సమస్తప్రపంచమును తోపింప జేయుచున్నది. ఎఱుకవలన తోచెడి ప్రపంచముకూడ నెఱుక వలెనే మూలములేనిదగును. మూలములేనియెఱుక స్వతస్సిద్ధమై నిండియున్న బట్టబయలగు కేవలాత్మయునికిని గుర్తెఱిగినచో తాను, తనతోపాటు తోచిన ప్రపంచము నెచ్చటను

నిలువక పాఱిపోవును. 154

కం॥ పెనుమాయను జూడుము యిదె । జనకుని జఠరంబువలన - జననీగర్భం । బునజొచ్చి మూరుహాపున । జనియించును నవయవములు - జనితమై భువిని * వినికనితిని మూ - ర్కొని స్పర్శను గని * దినదిన మభివృద్ధ్యా - దీనిచే బయలును । గని యామాయలమల్లి - కథమాయించుము పోసి । జనితమై భువిని * వినికనితిని మూ - ర్కొని స్పర్శనుగని * 155

భా॥ తండ్రిభుజించిన అన్నపానములు జఠరాగ్నియందు పచనమై వీర్యరూపమునుదాల్చి, తల్లిగర్భములో ప్రవేశించి, యచ్చట శోణితముతోగలసి, కరచరణాద్యవయవములతో మాఱురూపమున నెఱుకశరీరములుగా భూమియందు బుట్టుచున్నది. ఇంతికంటె పెద్దమాయ యెక్కడనున్నది. ఇట్లు మూలములేకయే పుట్టిన ఎఱుకతోకూడిన శరీరము చెవులతో శబ్దములను వినుచు, చర్మముతో స్పర్శలనుగ్రహించుచు, నేత్రములతో రూపములను జూచుచు, జిహ్వతో రసముల నానుచు,ముక్కుతో గంధముల మూర్కొనుచు,కర్మేంద్రియములతో సమస్త కర్మములుచేయుచు దినదిన మభివృద్ధిని గాంచుచున్నది. దీనిచే బట్టబయలగు కేవలాత్మయునికినిగని, యామాయల మారిమైన యెఱుకయొక్క కథను మాయించుము. 155

కం॥ పెట్టియుక్రోవలిగారడి । చెట్టుపయిఁగానవచ్చి - చెట్టునఁజూపఁ । గట్టుపయి దోచునిదియను । కట్టునుమీ

దీనివలెనే - గనిపించునెరుక * అంతలో నెచట - గని
పించదెరుక * దిట్టమౌబోధచే - పట్టియెరుకనుతిరిగి। పుట్ట
కుండగదాని - పుట్టిముంచుమురేదె। గనిపించు నెరుక *
అంతలో నెచట - గనిపించదెరుక * 156

భా॥ గారడివాడొక పిల్లవానినొక పెట్టెలో కూర్చుండ
జెట్టి, యాపెట్టెకు మూతవేసి చెట్టుపై చూడుమనును. అట్లు
చూచుచుండగా పెట్టెలోపెట్టిన పిల్లవాడు చెట్టుపై కనిపిం
చును. మరల నాగారడివాడు గట్టుపైచూడుమనును. అంతట
నాచెట్టుపై కనిపించుపిల్లవాడు అచ్చట మాయమై గట్టుపై
కనిపించును. ఇది కనుకట్టుగదా! అదేవిధముగ మూలము
లేకయే యెఱుక తనంతటతానే బట్టబయలునందు తోచుచు
న్నది. అదితోచగనే దానితోపాటు సమస్తప్రపంచము తోచు
చున్నది. మరల నా యెఱుక యెచ్చటను కనిపించక మటు
మాయమై పోవుచున్నది. అదిపోగానే దానితోవచ్చిన ప్రపం
చముకూడ దాని ననుసరించియే పోవుచున్నది. పూర్ణగురు
సార్వభౌములచే పరిపూర్ణబోధను గట్టిగా దెలిసికొని, యెఱు
కను మరల తిరిగి పుట్టకుండ మహాసముద్రములో చిన్న పడ
వను ముంచివేసినట్లు, పరిపూర్ణ మహాసముద్రములో దాని
జాడకూడ తెలియకుండ ముంచివేయుము. 156

కం॥ నేననని బ్రహ్మలోపల। లేనిదె సంభవము
నొంది - లీలతనదు దా। మేనుజగములై వెలసెను। నే
నది మృగజలమురీతి - నిజముగాదనుచు * లోకులనేటి -

గజిబిజివినుచు * మానసమున వారి - మాటకామోదించి ।
దానికీబోధకు - తగునంచు వినజేస్తి । నిజముగాదనుచు*
తోసులనేటి - గజిబిజివినుచు * 157

భా॥ 'నేను' అనియనని యచల పరిపూర్ణ బ్రహ్మము నందు మూలము లేక యే యొకటి తోచి, లీలగా తనకుతానే శరీరప్రపంచములుగా వెలసినది. దానిని నేను ఎండమావుల లోని జలమువలె నిజముకాదని చెప్పుచుంటిని. లోకు లీయొకు క సత్యమని యొకపర్యాయము, నసత్యమని యొకపర్యాయ ము, గజిబిజిగా చెప్పుమాటలనువిని, యొకటి రాకడపోకడలు గలది కావున దానినిగురించి వారుగజిబిజిగా చెప్పుమాటల నామోదించి, నేను చెప్పునదికూడనదియే. ఈయొకటి మూల ము లేకయే తోచుచు పోవుచున్నదని వారికి తెలియజెప్పితిని. ఇట్లు మూలములేకయే తోచెడియొకటి శరీరప్రపంచములు నిజముగ నెప్పుడు లేనివనియే తెలిసికొనుము. 157

కం॥ కలనెడబాసిన మనుజులు । కలలోపలి పనులు
చేయ - గలవారలె యా । కలవారుగాను వారల । వలె నె
మకను గుపనిచేత - వదలెరుకకోన * గలపనిచేయ -
వలదెరుకలోన * కలవారం చనినోట - పలుకుటయరయ
క । పలికినవారికి - లొలగనుపాపము । వదలెరుకలోన *
గలపనిచేయ - వలదెరుకలోన * 158

భా॥ మనుజులు కలగని మేల్కొనినపిదప వారుకలలో చేయుచు విడిచిపెట్టిన పనులను మెలకువలో చేయజాలరు.

అట్లే గురుకరుణవలన బట్టబయలగు కేవలాత్మయునికిని, మూలము లేకయే తోచెడి యెఱుకయొక్క లేమిని యెఱిగి యూయెఱిగెడి యెఱుకను విడిచినవారు ఎఱుకలోనున్నప్పుడు చేసిన యజ్ఞాది కర్మములు, తీర్థయాత్రలు, దేవుళ్ళపెళ్ళిళ్లు పేరంటములు, పవళింపు సేవలు, పూజలు మొదలుగునవి చేయలేరు. గురుకరుణచే నెఱుకనువిడిచి, పరిపూర్ణస్థితికలిగియున్న మహాత్ముల యునికి నెఱుగక, వారు కూడ నెఱుకలోనివారని తలంచి, వారుతమవలె నెఱుకలోని కార్యములను చేయుటలేదని దూషించువారి పాపమెన్నటికినిపోదు. 158

కం॥ గుడమేమధురము మధురమె । గుడమూ గుడ
మధురములను - గొనకొని తొలుత । బొడమినదేదని
సరిగా । బొడమిన దౌకటేగ రెండు - బోవునుగదరా ॥
తనువెరుకలి - ప్లేగునుగదరా ॥ పొడజూచి బయలు ని -
ప్పుడెమేనెరుకలజోలి । విడరాలేనివె రెండు - పెడచెవిబె
ట్టక విను । పోవునుగదరా॥ తనువెరుకలి - ప్లేగునుగదరా॥

భా॥ బెల్లమేతీపు. తీపియే బెల్లము. ఆబెల్లము, తీపు రెంటిలో నేది మొదటపుట్టినదో, యేది తరువాతపుట్టినదో తెలియబడదు. ఆ రెండును కలిసియే పుట్టుచున్నవి. పోవునప్పుడు కలిసియేపోవుచున్నవి. ఇందొకటి లేకపోయినచో రెండును లేకపోవుచున్నవి. అట్లే దేహమే యెఱుక. ఎఱుకయే దేహము. ఇందు మొదటపుట్టిన దేదియో, తరువాత పుట్టిన దేదియో తెలియబడదు. ఆ రెండును మూలములేకయే కలసి పుట్టుచున్నవి.

తిరిగి కలసియేపోవుచున్నవి. నీవు నామాటను పెడచెవినిబెట్టక, స్వతస్సిద్ధమై నిండియున్న బట్టబయలు యొక్కయునికిని, మూలములేకయే తోచెడియెఱుక శరీరములలేమిని గుర్తెఱిగి లేని నేనెఱుకల జోలిని విడిచిపెట్టుము. 159

కం॥ ఇదియున్నది యిదియున్నది । యిదియున్నది యనుచు బయలు - నెరిగి యెరుకచే । నిదిలేనిది యిదిలే నిది । యిదిలేనిది యనుచు నెరుక - నెరిగితే సరిరా * ఆ పైనుండే - దెట్లందువినరా * ఉదయాస్తమానము - లుడుగక యిదినీనె । మ్మదిలోన నమ్మినా - మాటనిశ్చయమిట్టు। లెరిగితే సరిరా * ఆపైనుండే - దెట్లందువినరా * 160

భా॥ "ఇదియున్నది, యిదియున్నది, యిదియున్నది" యని ముమ్మాటికిని స్వతస్సిద్ధమైయున్న బట్టబయలగు కేవలాత్మయొక్క యునికి నెఱిగి, "ఇదిలేనిది, యిదిలేనిది, యిదిలేనిది" యని ముమ్మాటికిని మూలము లేకయే తోచెడి యెఱుకయొక్క లేమిని నెఱిగినచో సరిపోవును. ఆ పైన స్వతస్సిద్ధముగనున్న బట్టబయలునుగూర్చి నేను నీ కే విధముగా జెప్పుదును ? రాత్రింబగళ్లు నీవు దీనిని విడువక యుండుము. నీ మనస్సులో నా మాటను నిజమని నమ్ముము. ఈ విధముగ నేను చెప్పినట్లు లెరిగితే సరిపోవును. 160

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు పరిపూర్ణబోధ యను అష్టమాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచా

ర్యవర్య, స్వామి, శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే రచియింపబడిన భావార్థదీపికా సహితము.



## 9. గురుమంత్రప్రతాపము

కం॥ ఎరుగననునదియు నెరుకే । ఎరుగుమనని ని
న్ను బిరుల - నెరుగునదెరుకే । ఎరుగనెరుంగుదుననుచా ।
న్నెరుగుచునుండేది యెరుకే - నిరుపమబుద్ధి * నీవెరుగిది -
నిగమప్రసిద్ధి * గురుమంత్ర మనియెడి - గుద్దలితోడనీ ।
వెరుక కుంకటివేరు - నెరిగి త్రవ్వితెచాలు । నిరుపమబుద్ధి *
నీవెరుగిది - నిగమప్రసిద్ధి * 161

భా॥ అచలపరిపూర్ణబ్రహ్మము నెఱుగనని చెప్పునదియు నెఱుకయే. నేను సర్వము నెఱుగుదునని చెప్పుచు, తన్నును, నితరులను నెఱుగునదియు నెఱుకయే. నే నచలపరిపూర్ణ బ్రహ్మము నెఱుగనుగాని, తన్ను, నితరమగు సమస్తము నెఱుగుదునని యెడి యెఱుక నెఱుగునదియు నెఱుకయే. ఇది యుపనిషత్తులయందును ప్రసిద్ధముగానున్న సిద్ధాంతము. దీనిని నీవు చక్కగా తెలిసికొనుము. నీవా యెఱుకకు మూలము లేదని యెఱిగి గురుమంత్రమను కృద్దాలముతో దానిని సమూలముగా తీసి వేసినచాలును. 161

కం॥ ఎరుకే చదువులజేయును । నెరుకేవిను చనువు
నెరుక - నెరుకేతిరము । చెరిగించును శంకించును । ఎరు

కొనకేమిలేక - యేగునోయన్న * బయలేచదువు - నె
రుగ దోయన్న * ఎరుకే యెన్నటికైన - పరిపూర్ణము
న్నదం । చెఱిగి తాలేనని - యెఱిగితే నిలువక । యేగునో
యన్న * బయలేచదువు - నెరుగదోయన్న * 162

భా॥ ఎఱుకయే యన్నిభాషలలోను నానావిధములైన గ్రంథములను జేయును. ఆ యెఱుకయే యన్నిగ్రంథములను నితరులవలన వినును. ఆ యెఱుకయే యన్నిగ్రంథములను స్వయముగా చదువును. ఆ యెఱుకయే యెఱుకను స్థిరముగా నుండునదియని యెఱిగించును. ఆ యెఱుకయే తానుస్థిరముగా నుండునో యుండనోయని శంకించును. ఆ యెఱుకయే తన కెచ్చటను మూలము లేదు కావున నెచ్చటను నుండకయేగును. బట్టబయ లే గ్రంథములను చేయదు. దేని నెఱుగదు. దేనిని వినదు. దేనిని చదువదు. మూలము లేకయే తోచినయెఱుక స్వతస్సిద్ధమైయున్న బట్టబయలను పరిపూర్ణబ్రహ్మముయొక్క యునికిని, మూలము లేకయే తోచెడి తనయొక్క లేమిని తా నెఱింగినప్పుడా మూలములేని యెఱుకయెచ్చటను నుండక వెడలిపోవును. 162

కం॥ చూపులుగల వస్తువులును । చూపులగను వస్తు
వులును - చూపులుగూడన్ । తేపకు నెరుకని తెలియుము ।
చూపులులేనట్టి బయలు - చూచేదింకేమి * యెరుకేలేదు -
తోచేదింకేమి * దీపమువలె కను - పాపలోగలవస్తు । వే

పరమాత్మని - చూపితే నెఱుకాయె । చూచేదింకేమి * యె
ఱుకేలేదు - తోచేదింకేమి * 163

భా॥ చూపులుగలవస్తువులు జ్ఞాతలు. చూపులుజ్ఞానములు. చూపులగను వస్తువులు జ్ఞేయపదార్థములు. ఈ జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూపముగా తోచుచున్న సమస్తప్రపంచము నెఱుకయేయని తెలిసికొనుము. మూలములేని యెఱుకయే జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపమగు ప్రపంచముగా తోచుచున్నది. బట్టబయలగు కేవలాత్మ జ్ఞాతకాదు. దానియందు జ్ఞానములేదు. ఇకనది జ్ఞేయపదార్థముల నెట్లెఱుగగలదు? దానియం దెట్టిగడి జ్ఞానమే లేదు. దానినేదియు నెఱుగజాలదు. కావుననది జ్ఞేయపదార్థమునుగాదు. కొందఱు దీపమువలె కనుపాపలలో తెలియబడెడి యాపోజ్యోతిని పరమాత్మయనెదరు. ఆ పరమాత్మయే మూలములేని యెఱుకయని నీ వెఱుంగుము. అదియే జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూపముగా తోచుచున్నది. దానిని విడిచినచో చూచునదియు, చూడబడునదియు నేదియులేదు. 163

కం॥ శతపత్త్రాప్తుని బొడగని । యతిరయమున తి
మిర మణగి - యగుపడ వెట్ల । ట్లతులితగురుకృప గలి
గిన । మతిమంతులజూచి యెఱుక - మరినిల్వబోదు * సం
శయమును నీ - మదినిల్పరాదు * శ్రుతులందు స్మృతు
లందు - నితిహాసములయందు । సతతము శ్రమపడి - వె
తకిన నీయెఱుక । మరినిల్వబోదు * సంశయమును నీ -
మదినిల్పరాదు * 164

భా॥ సూర్యునిజూచిన తత్క్షణమే చీకటియణగిపోయి యెచ్చట నగుపడని విధముగా, సాటిలేని సద్గురుదేవుని కృపకు పాత్రులైన బుద్ధిశాలురనుజూచి, మూలములేక యేతోచెడి యెఱుక యెచ్చటను నిలువజాలదు. ఈ విషయమునుగూర్చి నీ మనస్సులో నెట్టి సంశయమును పొందకుము. శ్రుతులయందు, స్మృతులయందు, పురాణములయందు, ఇతిహాసములయందు, ఇంక నితరశాస్త్రములయందు నీ వెల్లప్పుడు శ్రమపడి వెదకి దానిని నిలుపదలంచి నప్పటికిని నీ మూలములేని యెఱుక
యెచ్చటను నిలువజాలక మాయమైపోవును. 164

కం॥ ఎఱుకేకోశములై దెఱు । గెఱుకే భూతముల నె
ఱుగు - నెఱుగునుసర్వం । బెఱుకే యెఱుకనెఱుంగును । నె
ఱుకను గుర్తెఱుగవేరే - యెఱుకయున్నదా * ఉన్నదంటె -
నరకమెకాదా * నిరతము గురుసేవ - పరతంత్రులగుచు
త । త్కారుణపు పాత్రులై - యెఱుకమాలిన వారి । కెఱుక
యున్నదా * ఉన్నదంటె - నరకమెకాదా * 165

భా॥ మూలములేక యేతోచెడియెఱుక పంచకోశముల నెఱుగుచున్నది. పంచభూతముల నెఱుగునదియు నా మూలము లేనియెఱుకయే. తనతోపాటు మూలములేకయే తోచిన సమస్తప్రపంచము నెఱుంగునది నామూలములేని యెఱుకయే. మూలములేని తన్ను నెఱుగునదికూడ నా మూలములేని యెఱుకయే. మూలములేని యెఱుక నెఱుంగుటకు వేఱొక యెఱుక యెచ్చటను లేదు. దీని నెఱింగెడి మఱియొక యెఱుకయున్నదని

నచో మహానరకము సంభవించును. ఎల్లప్పుడు సద్గురుని సేవ లయందే నిమగ్నులగుచు వారి కరుణకు పాత్రులై యెఱుకను విడిచిన వారి కెఱుకయే లేదు. వారికికూడ నెఱుకయున్న దనెడి వారికి నరకము తప్పదు. 165

కం॥ గురుమంత్రముచే నిలువని । యెరుకను పరిపూర్ణమనుచు - నెరిగి నిరతము । న్నెరుకై యుండినవారల । తెరువికనీ కేలవట్టి - దీజోలిమాను * ఎరుకలేని - యాజోలిపూను * గురునిచే పరిపూర్ణ - మరసి యీ తెలిసిన । యెరుకనెన్నటికి నీ - వెరుగకుమిదివట్టి । దీజోలిమాను * ఎరుకలేని - యాజోలిపూను * 166

భా॥ గురుదేవుడు తెలిపిన రహస్యము నెఱింగినచో నిలువని యెఱుకను పరిపూర్ణమని తలంచి, నిరంతర మెఱుకయే తామైయుండి, యెఱుకలోని దేవుళ్లకు పూజాపురస్కారములు, పెండ్లి పేరంటములు, పవళింపు సేవలు, తీర్థాటనాదులు, కర్మోపాసనాదులు మొదలగునవి చేయుచు తనియుచుండెడి వారల చెంతకు నీ వెన్నటికిని పోకుము. వారిజోలియే నీవు పట్టించుకొనకుము. నీ వెల్లప్పుడు నెఱుకనువిడిచి, పరిపూర్ణస్థితియందుండిన మహాత్ముల సాంగత్యము చేయుము. సద్గురుమూర్తి కరుణచే నీవచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికి నరసి, యా యెఱిగిన యెఱుకను విడిచియుండుము. ఇది మూలములేకయే తోచుచున్నది గనుక దీని యునికి యెచ్చటను లేదని యెఱుంగుము. 166

కం॥ లేనికలదోచినప్పుడు । లేనివిచిత్రంబులన్ని - లేకయె గోచున్ । లేనికల మేలుకొన్నను । లేనివిచిత్రములు తాను - లేకపోవునురా ॥ అనుమానము - లేదింయ వినరా ॥ లేనెరుక యీ రీతి - గానె బయిబను జూడ । తాను తనచిత్రములు - పూనెందు నిలచుండ । లేకపోవునురా ॥ అనుమానము - లేదిందువినరా ॥ 167

భా॥ మనకు కలతనిద్ర కలిగినప్పుడు మూలములేకయే తోచెడియెఱుకయందున్న జాగ్రద్భోగదాయక వాసనలుపరామముపొంది, స్వప్నభోగముల నిచ్చెడి వాసన లుద్బుద్ధము లగుచున్నవి. అప్పు డావాసనాను సారముగ మూలములేని యెఱుక స్వప్నములో చిత్రవిచిత్రములైన పదార్థపదార్థ జ్ఞానములుగల స్వప్నప్రపంచముగా పరిణమించుచున్నది. నిద్రాదోష మంతరించగనే మరల ఎఱుకయందున్న స్వప్నభోగదాయక వాసన లుపరామమునుపొంది, యనుద్బుద్ధములై యుండును. అప్పుడు మనస్సులోనున్న జాగ్రద్భోగముల నిచ్చెడి వాసన లుద్బుద్ధములగుచున్నవి. ఆ యుద్బుద్ధ వాసనాను సారముగ మూలములేని యెఱుక జాగ్రత్తయందు నానావిధనామరూపనటనాత్మకజాగ్రత్ప్రపంచ ప్రపంచజ్ఞానములుగా పరిణమించుచున్నది. ఒక్క యెఱుక యేస్వప్నభోగములనిచ్చెడివాసన లుద్బుద్ధము లైనప్పుడు స్వప్నప్రపంచ ప్రపంచ జ్ఞానములుగను, జాగ్రద్భోగములనిచ్చెడి వాసన లుద్బుద్ధము లైనప్పుడు జాగ్రత్ప్రపంచ ప్రపంచ జ్ఞానములుగను పరిణమించుచున్నది.

ఈ స్వప్నజాగ్రత్ప్రపంచ, ప్రపంచజ్ఞానములుగ పరిణమించు చున్న మూలము లేనియొుక, బట్టబయలగు కేవలాత్మనొుక్క యునికి నెఱింగినచో మూలములేని తాను, తనతో తోచిన స్వప్నజాగ్రత్ప్రపంచ, ప్రపంచజ్ఞానములు నెచ్చటను నిలువ లేక మటుమాయమై పోవుచున్నవి. ఈ విషయము నీ వెంత మాత్ర మనుమానింపకుము. 167

కం॥ మరణసుషుప్తుల జెందిన । పురుషుడు, మేల్కొనినవాడు - భువితదితరుడౌ । పురుషుడు కలగను వాడని । యెరిగుంతుము మొదటియాత - డెరుగ డీరెంట్ని * రెండవపురుషు - డెరుగునీరెంట్ని * ఇరువురొక్క-టెసుమ్మి - తిరిగి పుట్టుదురిల । గురునిచే మేల్కొంచె - తిరిగి పుట్టనేపుట్ట । డెరుగ డీరెంట్ని * రెండవపురుషు - డెరుగునీరెంట్ని * 168

భా॥ నిద్రపోవుచున్నవాడు, మృతినొందినవాడు పీరిద్దఱు మేలుకొనియున్న వానినిగాని, కలగనుచున్నవానినిగాని యెఱుగరు. మేలుకొనియున్నవాడు నిద్రపోవుచున్నవానిని, మృతినొందినవానిని నెఱుగుచున్నాడు. నిద్రపోయినవాడు, మృతినొందినవాడు మెలకువగానున్న వాని నెఱుగకపోయినను, మెలకువగా నున్నవాడు నిద్రపోవు వానిని, మృతి నొందిన వానిని నెఱుంగుచుండినను, నా రిరువురు నెఱుకలోనివారే యగుదురు. ఇందు నిదురించుచున్నవానికి, మృతినొందిన వానికి వాసన లనుబ్బద్ధములై యుండుటచేతవారికి ప్రపంచ,

ప్రపంచజ్ఞానములుకలుగుటలేదు. జాగ్రత్స్వప్నములయందున్న వారికి వాసన లుద్బుద్ధములై యుండుటచేత వారికిజాగ్రత్స్వప్న ప్రపంచములు, వానిజ్ఞానములు కలుగుచున్నవి. కావునవారం దఱు నెఱుకలోనివారే యగుదురు. వారికి జనన మరణాది సంసారము తప్పదు. వీరే యచల పరిపూర్ణగురుసార్వభౌముని సన్నిధికిచేరి, యచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, మూలములేకయే తోచుచున్న ఎఱుకయొక్కలేమిని యెఱింగి బట్టబయలను మహాజాగ్రత్తను గాంచినచో తిరిగి జననమర ణాది సంసారమున బడరు. 168

కం॥ ఎరుకే యెరుకకు కొడుకులు। యెరుకేతలి
దండ్రులెరుక - కెరుకే యితరుల్ । ఎరుకేయెరుకకు మూ
లము । ఎరుకకు మూలంబుబయలం - చెల్లందునోయి ॥
ఎరుకేయెరుక - కేమిలేదోయి ॥ ఎరుకలేని యుత్త - పరి
పూర్ణమునుజూచి । యెరుకెతాలేనని - యెగిరిపోయిన పై
పూ - చెల్లిందునోయి ॥ ఎరుకే యెరుకకేమిలేదోయి॥169

భా॥ చిజ్జడస్వరూపముగానున్న మూలములేని యెఱు క తోచగానే, దానియందున్న ఉద్బుద్ధవాసనాను సారముగ సమస్త ప్రపంచ మొకే పర్యాయము తోచుచున్నది. తోచి న పిదప దానియందెఱుకయే పుత్రీపుత్రులుగను, తల్లిదండ్రులు గను, తాతముత్తవలుగను, వేఱువేఱుగా తోపింపజేసి, వాని యందు కార్యకారణభావ సంబంధములను కల్పించుచున్నది. ఈయెరుకకు వేఱొకమూలమెచ్చటనులేదు. దానికదియే మూ

లము. మూలములేని యొకటి కచలపరిపూర్ణబ్రహ్మము మూలము కాదు. నిర్వికారమగుటచే నది దేనికికారణముకాదు. దేనికిని కార్యముగాదు. ఈ మూలములేని యొకటి తనమూలమును విచారించినచో తానే లేకపోవుచున్నది. ఇది స్వతస్సిద్ధమై నిలిచియున్న బట్టబయలగు కేవలాత్మయొక్క యునికిని, మూలము లేకయే తోచెడి తనలేమిని ఎఱింగి యెగిరిపోయినచో నాపై యున్నదనికాని, లేదనికాని యెఱిగిచెప్పే వారెవరు? 169

కం॥ గురుతను కలతోనారి । నరులూరకె వచ్చిపొంది - నయముగ సుతులౌ । వరకన్నియలను గాంచియు । గురువరుచే మేలుకొంచె - గురుతుండదన్నా * ఆపై మాట - నెరిగేదేదన్నా * ఎరుకొక్కటుంటేనే - యేర్పాటులుంచును । నెరుకొక్కటేగితే - యేర్పాటుజేసేటి । గురుతుండదన్నా * ఆ పై మాట - నెరిగేదేదన్నా * 170

తా॥ గురైతిగెడి యొకటియను కలలో స్త్రీలు పురుషులు మొదలగు వారంద రొకేపర్యాయము తోచుచున్నారు. అట్లు తోచుచున్నప్పటికిని ముందు తల్లిదండ్రులు వచ్చినట్లును, వారి సంపర్కమువలన కొడుకులు, కూతుళ్లుకలిగినట్లును, కారణకార్య భావసంబంధములను కల్పించుకొనుచున్నారు. సద్గురు మూర్తి కరుణవలన పరిపూర్ణస్థితియనెడి మెలకువను గనినచో నేగురుతునుండదు. అప్పుడుతల్లిదండ్రులు,కొడుకులు, కూతుళ్ళు మొదలగువారెవ్వరును లేరు. గురైతిగెడి యొకటి యున్నప్పుడే నీయేర్పాట్లన్నియు తోచునుగాని, గురైతిగెడి

యెఱుకయే లేనప్పు డెఱిగేవారెవరుందురు ? 170

కం॥ నినునను నీకలగాంచువు । నినునను కలలోన
గాంచు-నేనొకవేళన్ । నిను నేను నీవు నన్నును । గనుగొన
గా గలమెమేలు - కనినమీదటను * గురుబోధిట్లు - విని
నమీదటను * మునుపు కలిగినయెఱుక - మొదటికేనిలు
వదు । నినునన్ను నేనన్ను - నిను నీవెఱుగుటయెట్లు । కని
నమీదటను * గురుబోధిట్లు - వినిన మీదటను * 171

భా॥ ఒకవేళ నీవు కలగనినప్పుడు నీ కలలో నీవునిన్నును, నన్నును జూచెదవు. అట్లే యొకవేళ నేను కలగనినప్పుడు నాకలలో నేను నన్నును, నిన్నును జూచెదను. ఆ కలనుండి నీవు మేలుకొనిన పిదప నీకలలో దోచిన నిన్నుగాని, నన్నుగాని నీవెఱుగ లేవుగదా ! అట్లే నేనును కలనుండి మేల్కొనినపిదప నాకలలో దోచిననన్నును, నిన్నును నే నెఱుగజాలను. అదేవిధముగా నెఱుకయను కలలోనున్నప్పుడు భ్రాంతిచే నేను, నీవు, వాడు, వీడు, అది, ఇది యని నానావిధములైన నామరూపములను గాంచుచున్నాము. గురుకరుణచే నెఱుకయనెడికలనువిడిచి, పరిపూర్ణస్థితియనెడి మెలకువను గాంచినచో మొదట కలిగిన ఎఱుక యనుకల, ఆ కలలో దోచిన నీవు, నేను, వాడు, వీడు, అది, యిది, అనెడి సమస్త నామరూపములు నిలువనేరవు. 171

కం॥ నినునీవు నన్నునేనును । ననునీవే నిన్నునెరి
గి - నదెకల యిదితా । తననెరుగని దానినిగని । తనకలి

మిమ్మృషనుచు దెలిసి - తానేగెనేని * అదిమేల్కావలి - దాన్నెవడెరిగేని * ననునీవు నేనిన్ను - వినిపించు వినుమ ని । యనుట కిద్దరికిపుడు - మునుపున్న నెరుకేది । తానే గెనేని * అదిమేల్కావలి - దాన్నెవడెరిగేని * 172

భా॥ నీవు విన్నును, నన్నును; నేను నన్నును, నిన్ను ను నెఱుగుటయేకల. ఈ కలయే యెఱుక. ఈ యెఱుకకు మూలములేదు. ఈమూలములేని యెఱుక తోచినప్పుడు దాని తోపాటు సమస్త ప్రపంచము మూలములేకయే తోచుచు న్నది. ఈ మూలములేని యెఱుక తన నెన్నడెఱుగని బట్టబయ లు యొక్క యునికిని గనినచో తాను, తనతోపాటు తోచిన నామరూప నటనాత్మక ప్రపంచము మటుమాయమైపోవును. స్వతిస్సిద్ధమై నిండియున్న బట్టబయలుయొక్క యునికినిగని, తాను, తనతోకూడ తోచినప్రపంచము లేకపోవుటయే యెఱు కకు మెలకువ. ఆ మెలకువలో స్వతిస్సిద్ధమై నిండియున్న బట్ట బయలు యునికి నెఱిగెడి వారెవరును లేరు. అప్పుడు నీవు నన్ను వినిపించుమనుటకుగాని, నేనునిన్ను వినుమనుటకుగాని యెవ రుండెదరు ? పరిపూర్ణస్థితియనెడి మెలకువను గనకపూర్వ ముండిన యెఱుక లేదుగదా ! 172

కం॥ తిమిరారియందు లేనిదె । తిమిరముతనుదానె వచ్చి - తేజోనిసియా । తిమిరారి యునికిగనుగొని । తిమి రము తానిలువనట్లు - తెలిసికోరాద * బయలెరుకల - తెలిసియామీద * భ్రమరూపమైనట్టి - బ్రహ్మాండమెరుకల ।

భ్రమదీసివేసితే - భ్రాంతిపుట్టదు మరల । తెలిసికోరా ॥ * బయలెరుకల - తెలిసియామీద * 173

భా॥ చీకటి సూర్యునియందు లేకపోయినను నదితనం తట తానేవచ్చుచున్నది. ఆ వచ్చినచీకటి సూర్యునియునికిని తెలియగనే తనంతట తానే మటుమాయమై పోవుచున్నది. అది యెచ్చటనుండి వచ్చుచున్నదో, తిరిగి యెచ్చటికి పోవు చున్నదో యెవరికిని తెలియదు. అట్లే బట్టబయలైన కేవలాత్మ యం దెటుక మూలములేకయే తోచుచున్నది. అది తోచిన తోడనే దానితోపాటు బ్రహ్మాండమంతయు తోచుచున్నది. అట్లుబట్టబయలైన కేవలాత్మయందు మూలములేకయే తోచు చున్న ఎఱుకకుగాని, దానితోపాటు తోచుచున్న బ్రహ్మాండ మునకుగాని మూలమెచ్చటనులేదు. అవి యెచ్చటనుండి వచ్చు చున్నవో, తిరిగి యెచ్చటికి పోవుచున్నవో యెవరికిని తెలియదు. నీవు స్వతస్సిద్ధమై నిండియుండిన బట్టబయలైన కేవలాత్మ యునికిని, మూలములేకయే తోచుచున్న ఎఱుకజగముల లేమి ని యెఱిగి, భ్రమరూపమైన యెఱుకజగముల భ్రాంతిని విడిచి పెట్టినచో మరల వీని భ్రాంతి నీ కెన్నడును కలుగదు. 173

కం॥ లేదులేదనుచు నెందరు । వాపించిన లేకపోదు- పరిపూర్ణము దా । పోదుపోదనుచు నిలిపిన । పోవనియను కోకు మెరుక - పోనేపోతుంది * గట్టిగలేచి - పోనేపో తుంది * వాదభేదములేని - వారిచే నెరుకను । పాపుపెకి లించేటి - పద్ధతి నెరిగితే । పోనేపోతుంది * గట్టిగలేచి -

పోనేపోతుంది * 174

భా॥ యథార్థము నెఱుగని పామరులెందఱు స్వతస్సిద్ధమై నిండియున్న అచల పరిపూర్ణ బ్రహ్మమును "లేదులేదు" అని వాదించినను నది లేకపోదు. మూలాలను లేకయే తోచుచున్న ఎఱుకను నెందఱు పామరులు " పోదు, పోదు " అని యనేక శాస్త్రప్రమాణములతో దానిని నిలుపజూచినను నది పోదని యనుకొనకుము. దానికి మూలానులేదు గనుక నది గట్టిగా లేచిపోవును. తమ కనుకూలములైన శాస్త్రములను, యుక్తులను కల్పించుకొని, నిరంతరము తెగవ్రులాడుకొనుచుండు మూర్ఖుల చెంతకు జేరక, వాదభేదములులేని యచలపరిపూర్ణ గురుసార్వభౌముల నాశ్రయించి, బట్టబయలగు కేవలాత్మ యునికినిగని, ఎఱుకకు మూలానులేదని యెఱింగినచో నా మూలాను లేకయే తోచెడి యెఱుక యెందును నిలువజాలక లేచిపోవుచున్నది. 174

కం॥ మేనెఱుకలరెండ్లో నొక । దానిని నెడబాసిచేయ - దరమాపనులౌ । మేనికి నెరుకకుగావున । మేనన నెరు కెరుకయనిన - మేనని యెరుగు * రెంటిని నీవు - నేనని యెరుగు * ఎఱిగి వీనిలొబయలు - నెరిగిమేనెరుకల। తిరిగిచూడకు చూస్తె - గురునిపాదములాన । మేనని యెరుగు * రెంటిని నీవు - నేనని యెరుగు * 175

భా॥ శరీరమును విడిచి యెఱుక యుండదు. ఎఱుకను విడిచి శరీర ముండదు. ఎఱుక తోచినప్పుడు దానితోపాటే

శరీరముకూడ తోచుచున్నది. ఆ శరీర మెఱుకచే నెఱుగబడుచున్నది. ఎఱుకకు శరీరమాశ్రయముగా నున్నది. ఇవి రెండు నొకదానిని విడిచి మఱియొకటి యుండనేరవు. శరీరములేనిదే యెఱుకయుండి యది యే పనులను చేయనేరదు. ఎఱుకలేనిదే శరీరముండియు నే పనులను చేయనేరదు. కావున శరీరము, నెఱుక యొక్కటియే యని చెప్పబడెను. ఈ మే నెఱుకలు రెండునుగూడి నేననబడును. నేననబడెడి మే నెఱుకల రూపముతో నున్న ఎఱుకతో బట్టబయలగు కేవలాత్మయొకటి నెఱిగి, మూలము లేకయే తోచుచున్న మేనెఱుకల రెంటిని తిరిగి నేనని చూడకుము. అట్లు చూచితివేని గురుని పాదములకు తప్పినవాడవగుదువుసుమా ! 175

కం॥ మరపు సుషుప్తియు మూర్ఛయు । మరణం
బు సమాధియనుచు - మానవులెరుకక । పొరగిన యొమ
ని శరీరము । నెరిగెద రానరుడు మేను - నెరుగడోయన్న *
తననైన తా - నెరుగడోయన్న * యెరుగకుండిననేమి -
తిరిగి పుట్టుచునుండు । తిరిగిపుట్టను వాడీ - గురుబోధ
గల్గిన * నెరుగడోయన్న * తననైన తా - నెరుగడో
యన్న * 176

భా॥ మరపునందును, సుషుప్తియందును, మూర్ఛయందును, మరణమునందును, సమాధియందును శరీరములో నెఱుక తెలియబడదు. ఆ యెఱుక తెలియబడని శరీరమును జూచి యితర మానవు లిదిమరపని, యిది సుషుప్తియని,

యిది మూర్ఛయని, యిది మరణమని, యిది సమాధియని నెఱుగుచున్నారు. ఆ మరపునుగాని, సుషుప్తినిగాని, మూర్ఛనుగాని, మరణమునుగాని, సమాధినిగాని పొందినవాఁడా సమయమున తనశరీరమునుగాని, తన్నుగాని యెఱుగుటలేదు. వాఁడా విధముగ నా యవస్థలయందు తన శరీరమునుగాని, తన్నుగాని యెఱుగకుండినను నతనికి జనన మరణాది సంసారదుఃఖములు తప్పనేరవు. అతఁడే యచలపరిపూర్ణ గురుసార్వభౌముల వలన పరిపూర్ణబోధను పొంది, స్వతస్సిద్ధముగ నిండియున్న బట్టబయలగు కేవలాత్మస్థితిని, మూలములేకయే తోఁచెడి నేనెఱుకలలేమిని నెఱిఁగి లేకపోయినచో నతఁడెన్నటికిని జనన మరణాది సంసార దుఃఖములను పొందఁడు. 176

కం॥ పరిపూర్ణ మెఱుక లివియని । యెఱుగని బయ
లందులేని - యెఱుక తనకు దా । నరుదెంచిట గురుశిష్యు
ల । తెరగున మాట్లాడి రెంట్ని - తెలిసితాఁజనును * ఆపై
మాట - పలికేదేదికను * అరమరలేక నే - నెరిగించినట్టి
యీ । గురుబోధ పాత్రుల - నెరుగక తెలుపను । తెలిసి
తాఁజనును * ఆపై మాట - పలికేదేదికను * 177

భా॥ "ఇది పరిపూర్ణబ్రహ్మము, ఇది యెఱుక" అని యెఱుగని బట్టబయలులో మూలములేకయే తనంతటతానుగా తోఁచినయెఱుక గురువుగను, శిష్యుఁడుగనునై, గురువు పరిపూర్ణబోధను శిష్యునకు వినిపించుచున్నట్లును, శిష్యుఁడాబోధను వినుచున్నట్లును తోఁచుచున్నది. శిష్యుఁడా పరిపూర్ణ బోధను

సద్గురునివలనవిని, స్వతస్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, మూలము లేకయే గురుశిష్యులుగా తోచుచున్న ఎఱుకయొక్క లేమిని నెఱింగి పరిపూర్ణస్థితి కలిగియున్న తరువాత నిక యేమాటయును లేదు. పూర్ణస్థితిగలవాడు నే నెఱిగించిన పరిపూర్ణబోధకు పాత్రులుకాని వారికీ బోధ నెఱిగింపరాదు. 177

కం॥ మరపు సుషుప్తియు మరణము। పరిపూర్ణం బునకు సాటి - పరచి యెఱుకకున్। మరినాది మేల్కొ పుట్టువు। లిరుదెరగుల నెఱిగియెరుక - నెగురజిమ్మోయి * ఆపైనుండే - దెరిగేదెల్లోయి * గురుమంత్రమిదెసుమ్మి - మరువక యేప్రొద్దు। స్మరణజేసితివేని - తిరిగిపుట్టవు నీవి। లైగురజిమ్మోయి * ఆపై నుండే - దెరిగేదెల్లోయి*178

భా॥ మరపును, సుషుప్తియును, మరణమును నేమియు నెఱుగనట్లు, అచలపరిపూర్ణ బ్రహ్మముకూడ నేమియు నెఱుగదు. సృష్టియును, మెలకువయును, పుట్టుకయును సర్వము నెఱుగునట్లు, ఎఱుకయును సర్వము నెఱుగుచున్నది. ఈవిధముగా పోల్చుకొని చూడుము. ఏమియు నెరుగక సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును సంపూర్ణముగనిండి స్వతస్సిద్ధముగనున్న బట్టబయలగు కేవలాత్మ యునికిని, మూలము లేకయే నామరూప నటనలుగా తోచి సర్వము నెఱుగుచున్న ఎఱుకయొక్క లేమిని నెఱిగి, లేనియెఱుక నెగురజిమ్మినచో స్వతస్సిద్ధముగా నిలిచియున్న

కేవలాత్మ నేది యెఱుగగలదు ? దాని నెఱుగునదేదియు లేదు. ఇదియే గురురహస్యము. దీనిని మఱవక యెల్లప్పుడు స్మరించు చుండినచో నీవిక తిరిగిపుట్టవు. 178

కం॥ క్షితితోనరుడు పక్వా । న్నతతినిదినికక్కి-
మరల - నాసనె యతి సం । సృతివిడిచి తిరిగిపూనునె ।
వితరణశాలిచ్చినట్టి - విత్తముఁ గునా ॥ సత్యవాది - సత్య
ముఁ గునా ॥ ప్రతిలేని గురుబోధ - స్థితిజెంది యెఱుక
నీ । గతి సంగ్రహింపఁడు - కృతకృత్యు డిచ్చిన । విత్త
మడుగునా ॥ సత్యవాది - సత్యముఁ గునా ॥ 179

భా॥ ఈ ప్రపంచమునందు మానవుడు షడ్రసయుక్త మగు పంచభక్ష్య పరమాన్నములను కడుపునిండ భుజించి క్రక్కి, యా క్రక్కిన దానిని మరల నాతడు భుజింపనట్లును, తీవ్రవైరాగ్యముతో సంసారమును సంపూర్ణముగ పరిత్యజించిన యతీశ్వరుడు మరల నా సంసారమును గ్రహింపనట్లును, వితరణ శాలియగు ధర్మదాత తాను దానమిచ్చిన ధనమును తిరిగి తనకిమ్మని యడుగనట్లును, సత్యవాది తనకెన్ని యిడుమలు ప్రాప్తమినను నతడు సత్యమును విడువనట్లును, సద్గురుమూర్తిబోధచే స్వతస్సిద్ధముగ నిండియున్న బట్టబయలగు కేవలాత్మ యునికిని, మూలము లేకయే తోచెడి యెఱుకయొక్క లేమిని నెఱింగి, యా యెఱిగిన యెఱుకను విడిచి, పరిపూర్ణస్థితి కలిగియున్న కృతకృత్యుడు మరల నా యెఱుకయందుగాని, ఆ యెఱుకవలన తోచెడి సంసారమునందుగాని భ్రాంతినిపొందడు.

కం॥ మరపన తొలిమేనులు మూ । డెరుకన నాలవ శరీర - మీరెండొకచే । పరిపూర్ణమవలి దీవలి । యెరుకను గురువాక్కుచేత - నెగురజిమ్మినను * పోవునులేని - దెరిగెదేగినను * ఎరిగేదేలేకుండు - నేమో యావలిజాడ । నెరిగేవారెవరింక - నింతేచాలెఱుకను । నెగురజిమ్మినను * పోవునులేని - దెరిగేదేగినను * 180

భా॥ మొదటివగు స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహమునీమూడునుకూడిమఱపనబడును.సచ్చిదానందాత్మ ప్రతిబింబముతోగూడినమనస్సును సచ్చిదానందములునుగూడి నాల్గవశరీరముగా చెప్పబడెను. ఈ నాల్గవ శరీరమే యెఱుక. ఈ యెఱుక మఱపు లోకదానిని విడిచి మఱియొకటియుండి వ్యవహరింపనేరవు. కావున నీరెండును నొకటియే యని చెప్పబడెను. ఈ యెఱుకచే నెఱుగబడక, సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగా నిండి, స్వతస్సిద్ధమైయున్న అచలపరిపూర్ణ కేవలాత్మ యెఱుకకావలిది. ఈవలిదగు మూలము లేకయే తోచెడి యెఱుకను సద్గురుని వాక్యము ప్రకారం మెగుర గొట్టినచో నది మూలములేనిది గనుక నెచ్చటను నిలువజాలక లేచిపోవును. ఆ యెఱిగెడి యెఱుక యేగినపిదప స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ బ్రహ్మ మున్నదని యెరుగువారెవరు ? 180

కం॥ నానావిధావయవములు । నానావిధ నామరూప-నటనలు మాయట । నానావిధాల యూహలు । నేననునెరు

కందు నిన్ని - నబిడమైయుండు * బయలునుగనతా -
నిలువలేకుండు * నేను మే నీరెండు - నేనే నేలేకుంటె ।
మేను లేదది లేక - నే నిలిచే దెట్లిన్ని । నిబిడమైయుండు *
బయలును గనతా - నిలువలేకుండు * 181

భా॥ శరీరమునందుగల నానావిధములగు నవయవములు, ప్రపంచమునందుగల నానావిధములగు నామరూపనటనలు, చిత్రవిచిత్రములైన మాయలు, నానావిధములైన యూహలు మొదలగునవన్నియు నెఱుకయందు నిండి నిబిడీకృతములై యున్నవి. మూలములేని యెఱుక తోచినప్పుడు దానితోపాటివియన్నియు మూలము లేకయే తోచుచుండును. మూలములేని యెఱుకతోపాటు తోచిన మూలములేని దేహేంద్రియాది సమస్త ప్రపంచమును నా యెఱుకయే యెఱుగుచున్నది. ఈ యెఱుక కెఱుకవలన దోచిన దేహేంద్రియాది ప్రపంచమే యాశ్రయము. శరీరము, శరీరమునందుండి "నేను, నేను" అనెడి యహంకారముకూడియే నేననెడి యెఱుకయగును. ఇందు 'నేను, నేను' అనెడి యహంకారము లేనిచో శరీరముండదు. శరీరము లేనిచో 'నేను, నేను' అనెడి యహంకారముండదు. కావున నేను మేనులు రెండునుకూడియే నేనను ఎఱుకయగును. ఆ యెఱుకయందే సమస్త ప్రపంచము నిండి నిబిడీకృతమై యున్నది. దీనికి మూలమెచ్చటను లేదు. మూలము లేకయే తోచెడి యీ యెఱుకతోనే మూలములేని సమస్త ప్రపంచము తోచుచున్నది. మూలము లేక

యే తోఁచెడి యెటుక బట్టబయలగు కేవలాత్మయునికి నెఱింగి నచో తాను, తనపరివారముతోఁకూడ నెచ్చటను నిలువక పాఱిపోవును. 181

కం॥ జగమువలన సంకల్పము । జగమూసంకల్ప మునను - జనియించును వే । రగపడదు జన్మమందిర । మగపడదెడబాసినిల్వ - వారెంటెన్నటికి * బయలునుగనినీ- వీ రెంట్నెన్నటికి * ఇగ దలచదోకము - నివిబుట్టు టు ళ్ళక్కి । మృగజలమగపడిన - మిథ్యం చెరిగినమాట్కి । నా రెండెన్నటికి * బయలును గని నీ - వీరెంట్నెన్నటికి*

భా॥ ప్రపంచ మున్నప్పుడే సంకల్పము కలుగుచున్నది. ఆ ప్రపంచము సంకల్పమువలననే తోఁచుచున్నది. ఈ రెం టికి మఱియొక జన్మస్థాన మెచ్చటను కనిపించుటలేదు. ఇవి రెండును నొకదానిని విడిచి మఱియొకటి నిలువజాలవు. ఇవి రెండును మూలములేకయే తోఁచుచున్నవి. సద్గురుమూర్తి కరుణచే స్వతస్సిద్ధమై నిండియున్న బట్టబయలగు కేవలాత్మ యునికి నెఱింగి, మూలము లేకయేతోఁచి, నీకు నానాభ్రాంతు లను గలిగించుచున్న నెఱుకజగముల నెన్నటికిని దలచబోకు ము. వీనికి మూలములేదు గనుక నివి పుట్టినవను మాటయే పాళ్ళక్కి. నీకు ఎండమావులలో జలము తోఁచినప్పు డది మిథ్యయని యెఱిగినవిధమున, నచలపరిపూర్ణ బ్రహ్మమునం దెఱుకజగములు తోఁచిననునీవువానిని మిథ్యయనియెఱుగుము.

కం॥ పరిపూర్ణమనెడి పలకే । యెరుకను బలసాక్షర

మూల - తెచ్చుటగనినజా । తిరమైయున్నది కనుగొని । యెరుకను బలపాక్షరముల - నిక గట్టిపెట్టు * ఎవరికి దెలియ - దిదిమూలగుట్టు * గురుమూర్తి కరుణచే - నెరిగి తెల్పితినే నీ । పరిపూర్ణ బోధను - పరులుచెప్పినబోధ । నిక గట్టిపెట్టు * ఎవరికి దెలియ - దిదిమూలగుట్టు * 183

భా॥ పలకమీాద బలపముతో నానావిధములగు నక్షరములు వ్రాయబడుచున్నట్లు, పరిపూర్ణమనెడి పలకయందు, ఎఱుకయనెడి బలపముచే నామరూపనటన లనెడి యక్షరములు సృజింపబడుచున్నవి. బలపమును, బలపముచే వ్రాయబడిన అక్షరములను విడిచినచో పలకయొక్కటి మాత్రమే స్వచ్ఛమై స్వతస్సిద్ధముగనుండునట్లు, మూలములేక తోచెడి యెఱుకను, యెఱుకచే కల్పింపబడిన మూలములేని నామరూపనటనలను విడిచినచో, బట్టబయలగు కేవలాత్మ యొక్కటియే స్వతస్సిద్ధమై యుండును. ఈ రహస్యమును నేను సద్గురుమూర్తి కరుణచే నెఱిగి నీకు చెప్పితిని. నేను చెప్పిన ఈ పరిపూర్ణబోధను నీవు తెలిసికొని, యితరు లిదివఱకు నీకుచెప్పిన చిల్లర బోధల నన్నిటిని గట్టిపెట్టుము. 183

కం॥ చూపించి చూపరానిది । చూపించితి దానినుంద - జూచితివిగదా । చూపించజూచెనిది దీ । న్నే ప్రొద్దిక దలచబోకు - మిదెగురుబోధ * నిన్నంటదు - నితరమే బాధ * నాపాప నాకూన - నాచిన్ని నాయన్న । నా పెన్న

దానను - నారత్నములకొండ । యివెగురుబోధ * నిన్నం
ఉదు - నితరమేబాధ * 184

భా॥ ఆ యచలపరిపూర్ణ బ్రహ్మమును ' ఇది ' యని విధిముఖముగా చూపింపరానిది. నిషేధముఖముగా మాత్రమే యది చూపింపదగినది. కావున దానియందు మూలములేకయే తోచుచున్న ఎఱుక శరీరజగములను నిషేధించుట మూలముగా, స్వతస్సిద్ధమై నిండియున్న నచల పరిపూర్ణ బ్రహ్మమును నీకు తెలియజేసితిని. నీవు నిషేధముఖముగా దానినుండ జూచితివి గదా ! నేను నిషేధముఖముగా నీకు చూపింపగా నేది దానియునికి నెఱిగినదో, ఆ యెఱిగిన యెఱుక జోలినెప్పుడును దలచకోకుము. ఇదియే యచలపరిపూర్ణ గురుసార్వభౌముల పవిత్రమైనబోధ. నీవీ బోధనుపొంది మూలములేకయే నానావిధ నామరూప నటనాత్మక ప్రపంచముగా దోచుచు, నీకు నా నా భ్రాంతులను గల్పించి, నా నా దుఃఖములను గలుగజేయుచున్న నెఱుకనువిడిచిన చో, నెఱుకలోని దుఃఖము లేవియు నీకు గలుగనేరవు. నాపాపా, నాపసికూనా, నాచిన్నీ, నాయన్నా, నాపెన్నిధానమా, నారత్నముల కొండా, యిదియే యచల పరిపూర్ణ గురుసార్వభౌములు తెల్పెడి పవిత్రమైన బోధ. నీవు దీని నెఱింగినచో నెఱుకలోని బాధ లేవియు నిన్నంటవు. 184

కం॥ నామము రూపము నటన । స్తోమము బయలందు లేదు - చూడుము నీవా । నామము రూపము నటన । స్తో

మము నెఱుకంచుగలదు - చూడుమీ -నిజము * బయలెరు
కల - జూచి చూడకుము * వేమారు నే నెంత - వినజెప్పి
న గాని । యీ మార్గమే తప్పు - యికలేదు రెండోది ।
చూడుమీనిజము * బయలెరుకల - జూచిచూడకుము* 185

భా॥ సర్వకాలములయందును, సర్వదేశములయందు
ను, సమస్త వస్తువులయందును సంపూర్ణముగా నిండి స్వత
స్సిద్ధమైయున్న బట్టబయలగు కేవలాత్మయందు, నామరూప
గుణక్రియాది నటనలేవియు లేవు. ఆ నామరూపగుణక్రియాది
నటనలన్నియు మూలములేక నే తోచుచున్న మాయయొక్క
క యందు కనబడుచున్నవి. దీనిని నీవు విచారించి నిజమును
తెలిసికొనుము. నీవు మొట్టమొదట నామరూపగుణక్రియాది
నటనలేవియు లేక స్వతస్సిద్ధముగానిండియున్న బట్టబయలగు
కేవలాత్మ యునికి నెఱింగి, పిదప నామరూపగుణ క్రియాది
నటనలతో మూలము లేకయే యలరారుచున్న నెఱుకయొ
క్క లేమిని తెలిసికొని, యాలేని యెఱుకయొక్క పొత్తును
విడిచియుండుము. ఎన్నిపర్యాయములు నేను నీకు చెప్పినప్పు
టికి నీమార్గము తప్ప నింతకంటె గొప్పదియగు మార్గము
మఱియొకటి లేదు. 185

కం॥ గురుడు గురుబోధ శిష్యుని । కెఱిగించెడువేళ
శిష్యు - డెఱిగెడువేళ । నిరువురు వైశ్వాసరక । ద్భుర
ములవలె వెలిగియవల - పొడజూపరోయి * అట్ల నెనీవి-
క్కడ దెలియుమోయి * పరిపూర్ణమును నెరుక - నెరిగి

యామీదట । నెరుకను విడుచు పె-గురుబోధం చెరుగుమ ।
పొడజూపరోయి * అట్లనెనీవి - క్కడ దెలియుమోయి *

భా॥ సద్గురుమూర్తి సచ్ఛిష్యునకు పరిపూర్ణబోధను నెఱిగించు నప్పుడును, సచ్ఛిష్యుడా బోధ నెఱుంగునప్పుడును నిరువురు నైశ్వానర కర్పూరములవలె వెలిగి, యటుపిమ్మట నెవ్వరు కనిపింపక మటుమాయమై పోయెదరు. ఇందు సచ్ఛిష్యుడే కర్పూరము. సద్గురు మూర్తియే యగ్నిహోత్రుడు. వీరిద్దఱు జతగూడినప్పుడు వీరిమధ్య బోధరూపమగు వెలుగు వెలిగి యారిపోయిన పిదప గురువుగాని, శిష్యుడుగాని, వారి మధ్య కానవచ్చిన బోధగాని లేక మటుమాయమై పోవుచున్నవి. ఇదేవిధముగా స్వతస్సిద్ధమై నిండియున్న అచల పరిపూర్ణ బ్రహ్మమునందు నెఱుకయను నగ్నిహోత్రుడును, దేహమనెడి కర్పూరమును మూలములేకయే తోచి, యారెండును జతగూడి, నానా విధములగు నామరూపనటనలను కల్పించుకొని, నానా విధ భ్రాంతులనుపొంది, నానా విధ దుఃఖముల ననుభవించి, నాశమైపోవుచున్నవి. కావున నీవు మొట్టమొదట స్వతస్సిద్ధముగ నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికి నెఱింగి, యటుపిమ్మట మూలము లేకయే తోచుచున్న నేనెఱుకల లేమిని తెలిసికొని, లేని నేనెఱుకల జోలిని విడువుము. ఇదియే యచల పరిపూర్ణ గురుసార్వభౌముల బోధయని యెఱుంగుము. 186

కం॥ సతికౌగిట తత్పతి త । త్పతికౌగిట సతియుజేరి-

పవళించికలఁగా । మృతిజెంది మేలుకొని సు । స్థితులై యొక
రొకరికట్టి - చేష్ట దెల్పుదురా * సిగ్గువిడిచి యా - చేష్టనిల్పు
దురా * ప్రతిలేనిగురుబోధ - స్థితిజెందియున్న సం । తత
ము తిరిగెడియెరుక - గతియిట్టిదని దాని । చేష్ట దెల్పుదు
రా * సిగ్గువిడిచియా - చేష్టనిల్పుదురా * 187

తా॥ భార్య కౌగిటిలో భర్తయును, భర్తకౌగిటిలో భార్యయును జేరి రతిసుఖము ననుభవించి, యుభయులు కౌగ లించుకొని పండుకొనిన పిదప భార్యచనిపోయినట్లు భర్తగాని, భర్తచనిపోయినట్లు భార్యగాని కలగని మేల్కొనిన పిదప "నీవు చనిపోతివి, నీవు చనిపోతివి" అని యొకరి కొకరు సిగ్గువిడిచి చెప్పుకొనరు గదా ! ఆ విషయమును మనస్సులో కూడ నుంచుకొనరు గదా ! అట్లే సాటిలేని సద్గురు సార్వ భౌములవలన పరిపూర్ణబోధను పొంది, స్వతస్సిద్ధముగా నిండి నిబిడీకృతమైయున్న బట్టబయలగు కేవలాత్మ స్థితి నెఱింగి, యె ల్లప్పుడును మూలములేక యే తోచుచు, నానావిధ నటనలు సల్పుచు, మరల మటుమాయమై పోవుచునుండెడి యొుక గతి యిట్టిదని యెఱింగి, దానిని విడిచియుండినవారు దానిచేష్ట లిట్టివి యని యితరులకెట్లు చెప్పగలరు ? సిగ్గువిడిచి దాని నెట్లు నిలుపుకొన గలరు ? 187

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశికప్రభు విరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు గురుమంత్రప్రతాప మను నవమాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజ

కాచార్యవర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహా రాజ్ వారిచే వ్రాయబడిన భావార్థదీపికా సహితము.



# 10. బోధదృఢీకరణము

కం॥ రానిదిపోనిది బయలని । లేనిది యీయెఱుక యనుచు - లెస్సగ దృఢమౌ । దానుక నీ వీ మంత్రము । మానక జపియించుచుండు - మానీతికాలి * లేనిదిలేదు - మరువకీజోలి * లేనిదిలేదని - పూనినిశ్చయమైతె । తా నొక్కటుండును - గానియట్లనవిను । మా నీతికాలి * లేనిదిలేదు - మరువకీజోలి * 188

భా॥ రాకడపోకడలు లేక యేకమై స్వతస్సిద్ధముగా నిండియున్నది బట్టబయలగు కేవలాత్మ యనియు, రాకడపోకడలు కలిగి యనేక నామరూప నటనలుగా తోచుచున్నది మూలములేని యెఱుక యనియు తెలిసికొనుము. నీకీ విషయము లెస్సగా దృఢమగువఱకు నీ వీ గురురహస్యమును విడిచి పెట్టక నిరంతరము స్మరించుచుండుము. మూలము లేకయే యనేక నామరూపనటనలుగా తోచుచున్న ఎఱుకయెప్పుడును లేనిదనియే యెఱుగుము. నీకీ మూలము లేకయే యనేక నామరూపనటనలుగా తోచుచున్న ఎఱుక లేనిదని దృఢముగా నిశ్చయమైనచో సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును బట్టబయలగు కేవలాత్మ

స్వతస్సిద్ధముగ నిండి నిబిడీకృతమై యుండును. దానిచెఱుగున దేదియు లేదు. 188

కం॥ ఉన్నది పరిపూర్ణము లేం । దెన్నటి కీ యెరుకయనుచు - నిదివృథమౌదా । కెన్నుము నే బోధించిన । తిన్నని యీ బోధశిష్య - తిలకమరువకుమీ * సుజనుల మ్రోల పలుకవెరువకుమీ * నిన్ను కుమతులువచ్చి - నీలో తడిగితే వారి । కెన్నివిధములను నీ - వెరిగింప కిది. శిష్య। తిలక మరువకుమీ * సుజనులమ్రోల - పలుక వెరువకుమీ *

భా॥ శిష్యతిలకా ! సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగా నిండి స్వతస్సిద్ధమై నిలిచియున్న దచలపరిపూర్ణ బ్రహ్మము. సర్వకాలములయందును, సర్వదేశములయందును స్వతస్సిద్ధముగా నిలిచియుండక, అప్పుడప్పుడు నామరూప నటనలుగా తోచుచు పోవుచున్నది మూలములేని మాయ యెఱుక. ఈ భావము నీకు దృఢమగువఱకు నేను నీకు బోధించిన పవిత్రమైన పరిపూర్ణబోధను స్మరించుచుండుము. నీ కీ బోధ లెస్సగా దృఢమైన పిదప దీనిని నీవు సుజనుల యెదుట చెప్పుట కెంతమాత్రము భయపడవద్దు. దుర్జనులు దీనిని తెలిసికొని నిన్ను వహేళన చేయుటకొఱకు నిన్ను నేకవిధముల గుచ్చి గుచ్చి యడిగెదరు. అట్టి కుమతులకీ పవిత్రమైన యచలపరిపూర్ణబోధ నెంతమాత్ర మెఱింగింపకుము. 189

కం॥ పరిపూర్ణమ్ము నెఱుకను నే । నెరిగించితి నీవు

రెంటి - నెరిగితివిగదా । యెరుకను గురుదక్షిణగా । మరి
వేగిరమిమ్ముపట్టి - మాటలేమిటికి * ఎరుకతోనింక -
కూట మేమిటికి * పరులు నేననియెడు - భావమభావమై ।
నిరతము నొకరీతి - నిలిచియుండుము పట్టి । మాటలేమి
టికి * ఎరుకతోనింక - కూటమేమిటికి * 190

భా॥ శిష్యా ! నీకు నేను స్వతస్సిద్ధముగా నిండియున్న నచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, మూలము లేకయే నానా విధ నామరూప నటనలుగా తోచుచున్న మాయ యెఱుక యొక్క లేమిని నెఱిగించితిని. నీవా రెంటి యొక్క యునికి లేములను చక్కగా నెఱింగితివి గదా ! ఇక నీవు స్వతస్సిద్ధముగా నిలిచియున్న పరిపూర్ణ స్థితిగలవాడవై యుండి వేగమే లేని యెఱుకను నాకు గురుదక్షిణగా నిమ్ము. పట్టిమాటలతో కాలము గడిపినచో నేమి ప్రయోజనము ! నానానామ రూప నటనలుగా తోచుచు, నానావిధ భ్రాంతులను గలిగించి, నానావిధ దుఃఖములపాలు చేయుచున్న మూలములేని యెఱుకతో పొందు నీకేల ! "పరులు, నేను" అని పలువిధములుగా తోచుచున్న నెఱుకలోని భావము లన్నియు నభావములు కాగా, నీవు బట్టబయలగు కేవలాత్మవై నిలిచియుండుము.

కం॥ పరిపూర్ణ మెరుకలిమియని । గురువరుడెరిగించి
యెరుక - కూటమిమాన్పగా । గురునకు గురువేసరియో ।
మరిశిష్యునకింక నోట - మాటవెళ్లునా * పోయిన యెరుక-
మళ్లిమచ్చునా* గురుశిష్యులనియేటి - గురుతెన్నదెరుగక -

నిరతము నొకరీతి - నిలిచున్న బయలందు । మాటవెట్లనా*
పోయిన యెరుక - మళ్ళీమస్నునా * 191

భా॥ సర్వకాలములయందును, సర్వదేశములయందు
ను, సమస్త వస్తువులయందును సంపూర్ణముగా నిండి స్వత
స్సిద్ధముగ నున్నది యచలపరిపూర్ణ కేవలాత్మయనియు, మూ
లము లేకయే నా నా నామరూపనటనలుగా తోచుచు, నానా
భ్రాంతులను గలిగించి, నానా దుఃఖముల పాలుచేయుచు,
మటుమాయమై పోవునది యెఱుకయనియు నెఱిగించి, మూ
లము లేకయే నా నా నామరూప నటనలుగా తోచుచున్న
నెఱుకయొక్క కూటమితో పొత్తును మాన్పించిన గురువున
కా గురువే సాటియగును కాని, యెఱుకలోని పదవులను బో
ధించెడి చిల్లరగురువులు సాటిరారు. ఆ పూర్ణగురు సార్వ
భౌము డెఱుకయొక్క కూటమునందు భ్రాంతిని తొలగించిన
పిదప, నా శిష్యున కిక నోటివెంట మఱి యొక మాటవచ్చునా!
అట్లు వచ్చుటకు పోయిన యెఱుక తిరిగిరాదుగదా ! గురువని
గాని, శిష్యుడనిగాని గుఱుతు నెఱుగక స్వతస్సిద్ధముగ నిలిచి
యున్న బట్టబయలునం దేమాటయులేదు. 191

కం॥ స్థిరమగు పరిపూర్ణము న । స్థిరమగు నీయెరుక
నెరుక - తెలియు జగములన్ । నెరిగిన దెరుకేగద స ।
ద్గురు కృపచే నెరుకపోతే - గురుశిష్యులేరీ * నోరెత్తక -
మరివినరోరి * గురునిపాదములాన - గురుతు లేనటు
వంటి । పరిపూర్ణ మొకటుండు - పలుకరాదట్లుంటె । గురు

శిష్యులేరీ * నోరెత్తక - మరివినరోరి * 192

భా॥ స్వతస్సిద్ధమై యంతట నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, మూలములేకయే తనంతట తానుగా తోచెడి యస్థిరమగు నెఱుకను, ఆ మూలములేని యెఱుకతోపాటు మూలములేకయే తోచి, యా మూలములేని యెఱుకచే నెఱుగబడుచున్న మూలములేని నామరూపనటనాత్మక ప్రపంచమును నెఱుగున దా మూలములేని యెఱుకయే గదా! సద్గురుస్వామి దయవలన మూలములేని యెఱుకను, ఆ యెఱుకతోపాటు తోచిన మూలములేని నామరూపనటనాత్మక ప్రపంచమును విడిచిన దో, నిక నెఱుకతోతోచిన గురుశిష్యు లెట్లుండగలరు ? వారును నా యెఱుకతోనే యేగెదరు. నీవు నోరుమెదపక నేను చెప్పెడి పవిత్రమైన యీ పరిపూర్ణబోధను వినుము. గురుపాదముల సాక్షిగా గుఱుతులేనటువంటి యచల పరిపూర్ణ బ్రహ్మమొక్కటి మాత్రమే స్వతస్సిద్ధముగ నిండియున్నది. దాని నెఱుగునదిగాని, యిట్టిదట్టిదని చెప్పునదిగాని మఱియొక టేదియు దానియందు లేదనినమ్ముము.

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు బోధదృఢీకరణమను దశమాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్య వర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురుమహారాజ్ వారిచే రచియింపబడిన భావార్థ దీపికా సహితము.

# 11. బోధస్థితి పురుషలక్షణము

కం॥ గురుడచల చలములను తన । కెరిగించిన
శిష్యుడెరిగి - యెపుకై యుండగ । ఎరుకను నిలుపకుమని
నను । నెరుకను విడనాడి శిష్యు - డెట్లుండునంటే * అట్ల
నె నేనిం - కెట్లుండునంటే * పురుషుడులేనట్టి - పొలతి
సౌందర్యము । మరిమరిగలిగుండి - మరిలేనట్లనియంటి ।
నెట్లుండునంటె * అట్లనెనేనిం - కెట్లుండునంటే * 193

భా॥ సద్గురుమూర్తి తన ప్రియశిష్యునకు స్వతస్సిద్ధమై
నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని,
మూలములేకయే తోచుచు, పోవుచునుండెడి చంచలమైన
యెఱుకయొక్క లేమిని నెఱిగింపగా శిష్యుడెఱిగియు నా యె
ఱుకను విడువజాలక, తాను యెఱుకయేయైయుండి, యెఱుకచే
నెఱుంగబడెడి నామరూప నటనాత్మక ప్రపంచ భ్రాంతిని
విడువకుండగా, నతనికి సద్గురుమూర్తి యీ యెఱుకకుగాని,
యెఱుకవలన దోచెడి నామరూపనటనాత్మక ప్రపంచమునకు
గాని మూలమెచ్చటను లేదు. కావున నివి యెప్పుడును లేని
వియే యని తెలుపగా, తెలిసికొని, యెఱుకను విడిచిపెట్టిన
శిష్యుడెట్లుండు ననగా స్త్రీ మహాసౌందర్య నతియై యుండి
నను, భర్తలేనిచో నామె సౌందర్యము రాణింపనట్లు, ఎఱు
కను విడిచినవాడు ప్రపంచమున నున్నట్లును, వ్యవహరించు
చున్నట్లును లోకులకు తోచుచుండినను నతడును, నతని వ్యవ

హారములును లేనివనియే యెఱుంగుము. 193

క॥ ఎరుకను విడనాడిన యా । పురుషునిస్థితి యెట్టిదనిన - పొందుగవినుమీ । సరిపడు సరిపడదనకను । సరిగా వర్తించుచుండు - సమరసబుద్ధిన్ * కార్యములందు - సహజప్రవృద్ధిన్ * పరిపరివిధముల - పరువులుబెట్టడు । మరి వైరాగ్యముచేత - మానుకొనుండడు * సమరస బుద్ధిన్ । కార్యములందు - సహజప్రవృద్ధిన్ * 194

తా॥ సద్గురుమూర్తి కరుణచే నెఱుకను విడిచిన పురుషుని స్థితి యేవిధముగ నుండునో, తెలిపెద వినుము. అతడిది సరిపడునదియు చెప్పడు. లేక సరిపడదనియు చెప్పడు. అతడు సమరసబుద్ధితో సమస్తమును సమముగా జూచును. చేయవలసిన సకల కార్యములను సమరసబుద్ధితో సహజముగా చేయుచుండును. ఎండమావులలోని జలముకొఱకు లేడి పఱుగు లెత్తునట్లు, మూలములేకయే తోచుచున్న నామరూపనటనాత్మక ప్రపంచములోని భోగముల కొఱకు కతడు పరుగులు పెట్టడు. లేక యీ మిథ్యాప్రపంచమునందు చేయునదిగాని, పొందునదిగాని యేమియులేదని వైరాగ్యముతో నే కార్యమును జేయక, సర్వకార్యములను మానుకొనియు నుండడు. సమరస బుద్ధితో సహజములైన కార్యములయం దతడు ప్రవర్తించుచుండును. 194

క॥ అవహంకారు డనిమిషుడు । గనుకనె విశ్వంబనేటి - కలగాన దహం । బనువాడు సనిమిషుడుగా । వున

విశ్వంబనెడి స్వప్నో - ద్యోగముబూని * చేయుచునాయు - ద్యోగముమానీ * యనునీస్వప్నోద్యోగ - మునకునేకార ణ। మనితా వనిమిషుడెన్న - డనుకోడీమాట ను। ద్యోగ ముబూని * చేయుచునాయు - ద్యోగముమానీ *. 195

భా॥ అహంకారము లేనివానికి సంకల్ప వికల్పములు లేవు కావున, నతడు నామరూప నటనాత్మక ప్రపంచరూపమగు స్వప్నమును గాంచడు. అహంకారమున్నవానికి సంకల్ప వికల్పములున్నవి గనుక, నతడు నామరూపనటనాత్మక ప్రపంచ రూపమగు స్వప్నమును గనుచున్నాడు. ఆ స్వప్నములో "నీవు, నేను, వాడు, వీడు, అది, ఇది" అనెడి భేదభావము లను కల్పించుకొని, యవియన్నియు సత్యములను భ్రాంతితో నానావిధములుగా వ్యవహరించుచు, నానావిధ దుఃఖములనను భవించుచున్నాడు. అహంకారములేనివాడీ ప్రపంచమున వ్య వహరించుచున్నను దీనిని మిథ్యగాదలంచి, యీ ప్రపంచము నకు నేను కారణమనిగాని, ప్రపంచవ్యవహారములకు నేను కర్తననిగాని, వాని ఫలములకు నేను భోక్తనని గాని తలంపడు. 195

కం॥ కలమేయిరౌన్న పురుషుడు। కలలోపలిబాము లెరుక - గలిగుండగనే। తిలకింపలేడు గురుకృప। తెలి వొందిన వానికింక - తిప్పలున్నవే * తెల్లవరకొద్ది - గొ ప్పలున్నవే * తలిదండ్రి దొరదాత - కులదైవమా ప్తులు। కల బాంధవులు దేశి - కులనినమ్మితె యింక। తిప్పలున్న

వే * తెల్పరకొద్ది - గొప్పలున్న వే * 196

తా॥ కలగని, యాకలలో నానావిధములైన నామరూప నటనాత్మక ప్రపంచమునుజూచి, యా ప్రపంచములో పుణ్య పాపకర్మములుచేసి, నానావిధములైన సుఖదుఃఖముల ననుభవించి, మేలుకొనినవాఁడా మెలకువలో నెఱుకకలిగి యుండియును, కలలోఁజూచినప్రపంచమునుగాని, నచ్చటచేసిన పుణ్య పాపకర్మములనుగాని, యచ్చట ననుభవించిన సుఖదుఃఖ రూపఫలములనుగాని తెలియఁజాలఁడుగదా! అట్లే సద్గురు మూర్తిని శరణుపొంది, యతఁడే తలిదండ్రులు, అతఁడేదొర, అతఁడేదాత, అతఁడే కులదైవము, అతఁడే పరమాప్తుఁడు, అతఁడే సమస్తబంధువులని నమ్మిసేవించి, యతనికరుణచే నచల పరిపూర్ణస్థితియనెడి మహాజాగ్రత్తను పొందినవాఁడీ మిథ్యాప్రపంచమున వ్యవహరించుచున్నట్లు లోకులకు తోఁచినను, వానికీ మిథ్యా ప్రపంచమునఁగల హెచ్చుతగ్గు భేదములతోఁగాని, పుణ్యపాపకర్మములతోఁగాని, సుఖదుఃఖ రూపఫలములతోఁగాని యెంతమాత్రము సంబంధములేదు. 196

కం॥ ఈరీతిస్థితికలిగిన । నేరుపుగా లితరజనుల -
నిందాస్తుతులఁ । తారేగి చేయదెన్నడు । వారలుమరి చేసి
రేని - వలదనియనడు * చెవియొగ్గి కా - వలెనని విన
డు * వారుమీవారు మా - వారు వీరనుకొంచు । సారెకు
వీరితో - పోరాడెవారిని । వలదని యనడు * చెవియొగ్గి
కా - వలెనని వినడు * 197

భా॥ ఈవిధముగ పరిపూర్ణ స్థితిగలిగిన మహనీయుఁ డితర మానవులు తన్ను నిందించుచుండినను నతఁడు తిరిగి వారిని నిందింపఁడు. అట్లే యితరులు తన్ను స్తుతించుచుండినను తిరిగి వారిని స్తుతింపఁడు. ఇతరమానవులు తన్నుగూర్చి యేమిచేసినను తిరిగి వారలకేమియు చేయఁడు. వారు చేయుచుండుటను జూచి మీరిట్లు చేయునలదనికూడ వారికిచెప్పఁడు. వారేమను చున్నను పెడచెవిని బెట్టునేకాని, దేనినికూడ నతఁడు కావలయునని చెవియొగ్గివినఁడు. "వారు మీవారు, వీరు మావారు" అనుకొనుచు, వారికొఱకు మాటిమాటికి వీథిలోబడి పోట్లాడు కొనెడివారిని జూచి మీరు పోట్లాడకుడనియు చెప్పఁడు. ఆ పోట్లాటను కావలయునని చెవియొగ్గి విననుకూడ వినఁడు. 197

కం॥ ధ్వని మొదలగు తన్మాత్రలు । గనుగొనగా
లేశమైన - గాన్పించని చో । టును బట్టబయలుగా గని ।
ధ్వనిముఖ తన్మాత్రలున్న - దానినెరుకగను * గని యీ
రెంట్లో - దేని నెరుగకను * ఉనికిగలిగిన యట్టి - ఘను
ని సన్నుతి జేయ । జనులకు శక్యమం - చనరాదు వినరా
దు । దాని నెరుగకను * గని యీరెంట్లో - దేనినెరుగకను*

తా॥ "శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము" అను నీయైదును పంచతన్మాత్రలనబడును. ఇందు శబ్దగుణము గల భూతాకాశము, శబ్దస్పర్శ గుణములుగల వాయువుండు టకును, శబ్దస్పర్శరూప గుణములుగల అగ్నియుండుటకును, శబ్దస్పర్శ రూపరస గుణములుగల జలముండుటకును, శబ్దస్పర్శ

రూపరసగంధ గుణములుగల భూమియుండుటకును, నీ యెదుట భూతములు పరిణామమైన నానానామరూప నటనాత్మకమగు భౌతికప్రపంచముండుటకు నవకాశమిచ్చుచున్నది. కావున నీ భూతాకాశ మేమియు లేని, యేమియు కాని, నిరాకాశమైన బట్టబయలు కానేరదు. స్థూలశరీరమునకు లోపల సంకల్ప వికల్పాత్మకమగు చిత్తాకాశము కామకర్మాది వాసనలుండుటకును, రాగద్వేషాది గుణములు మొదలగున వుండుటకును నవకాశమిచ్చుచున్నది. కావున నీచిత్తాకాశముకూడ నేమియు లేని, యేమియుకాని నిరాకాశమైన బట్టబయలు కానేరదు. మనస్సునందు పుట్టి నశించెడి సంకల్పములకును, పుట్టబోవు సంకల్పములకును మధ్యనుండి వాని రెంటినెఱిగెడి చిదాకాశము కూడ నేమియు లేని, యేమియుకాని నిరాకాశమైన బట్టబయలు కానేరదు. వీనియన్నిటి సముదాయమే యెఱుకయని నీవెఱుంగుము. ఈ నామరూప నటనలుగా తోచెడియెఱుక యేమియు లేక, యేమియుగాక నిరాకాశమై నిలిచియున్న బట్టబయలు నెఱుగజాలదు. దాని నెఱుగదలచినచో నెఱుకయొక్క స్వరూపమే యెగిరిపోవును. ఎఱుకమఱపుల నెఱుగక స్వతస్సిద్ధమై నిండియున్న పరిపూర్ణస్థితి గలిగియుండిన మహానీయుని సన్నుతించుటకు మానవులకు శక్యముకాదు. శక్యమని చెప్పెడి యితరుల మాటలను చెవులతో వినరాదు. 198

ఇది శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణ తత్త్వకందార్థ దరువులయందు బోధ స్థితిపురుష లక్షణమను ఏకాదశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరి

వ్రాజకాచార్యవర్య, స్వామి, శ్రీబ్రహ్మానందగిరి సద్గురుమహా రాజులచే వ్రాయబడిన భావార్థదీపికాసహితము.

## 12. బోధపఠనలక్షణము

కం॥ నామాట తెల్పవినుమూ । సామాన్యంబనుచు
జూత - బనదీబోధనా । ప్రేమాతిశయమునంగని । వేమా
రిది గురునినోట - వినవలెనుమ్మీ * నిత్యము చదువు -
కొనవలెనమ్మీ * నామరూపక్రియ - నటనలు గలిగిన ।
దేమి వస్తువా దాన్ని - నెటునిల్వ నీయకు । వినవలె
నుమ్మీ * నిత్యము జదువు - కొనవలెనమ్మీ * 199

భా॥ శిష్యా ! నీవు నామాటను చక్కగావినవలయును. ఈ యచలపరిపూర్ణ బోధ సామాన్య బోధలవంటిదికాదు. దీనికి మించినబోధ యెచ్చటనులేదు. నీవీ బోధయం దమిత ప్రేమ గలవాడవై యుండి, దీనిని నీవు సద్గురుమూర్తి చెప్పుచుండ గా శ్రద్ధాభక్తులతో వినవలెను. ప్రతిదిన మీబోధను నీవు చదువుకొని, మనస్సున కెక్కించుకొనవలయును. సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగనిండి స్వతస్సిద్ధమైయున్న బట్టబయలగు కేవలాత్మయొక్క యునికినిగాంచి, మూలములేకయే నామరూపక్రియాదినటనలుగా తోచుచున్న నెఱుకను ఎచ్చటను నిలువనీయక పాఱద్రోలవలయును. 199

కం॥ నే నొకటనిన్ను గనుగొని । యేముక్కలు
నీదుచెవిలో - నిడుడి స్తినొ నీ । వా ముక్కలమూడింటిని।
నే మాత్రము మరవకుండ - నీ బోధని స్తి * అందుకే
యింత - గా బోధజే స్తి * ప్రేమతో జదువుమి - దేమార
కెప్పుడు । కామితార్థమునిచ్చు - పో మీయింటికి దీవిం ।
చి బోధని స్తి * అందుకేయింత - గాబోధజే స్తి * 200

భా॥ బిడ్డా ! నేనునీకు మొట్టమొదటనే స్వతస్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, మూలములేకయే నామరూప నటనాత్మక ప్రపంచరూపముగా తోచుచున్న ఎఱుకయొక్క లేమిని, ఆయెఱుకను విడిచేవిధమును నీ మూడింటిని నీకు స్పష్టముగా జెప్పితిని. నీ వామూడింటిని మఱచిపోకుండుటకై నేనింతగా నీకు బోధజేసితిని. నీవిక మీ యింటికి వెళ్లి, దీనిని మఱచిపోకుండ ప్రతిదినము ప్రేమతో చదువుకొనుచుండినచో, నిది నీవుకోరినట్లు సమస్తభ్రాంతుల కాలవాలమై, మూలములేకయే తోచుచున్న ఎఱుకను తొలగించి, స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ స్థితినికలుగ జేయును. 200

కం॥ అన్నముదిన్నను నాకలి । తిన్నగ నీరంబు
ద్రావ - తృష్ణయు రోగం । బెన్నగ నౌషధసేవను । జన్న
క్రియన్నెరుక నిల్వ - జాలదోయన్న * ఈబోధ నీ - చెవు
లతో విన్న * కన్నులతోజూచి - కడముట్ట జదివిన।నిన్నె
న్నటికి నెదుట - నిలుచుండి కనుగొన । జాలదోయన్నా *

ఈ బోధ నీ - చెవులతో విన్న * 201

తా॥ అన్నముతినినచో నాకలితీరునట్లును, నీరుత్రాగినచో దాహముతీరునట్లును, ఔషధము సేవించినచో రోగముపోవునట్లును, సద్గురుడు బోధించిన అచల పరిపూర్ణ బోధను నీవు శ్రద్ధగావిని, స్వతస్సిద్ధముగా నిండియున్న బట్టబయలగు కేవలాత్మయునికిని గాంచినచో, మూలములేకయే నామరూప నటనాత్మక ప్రపంచముగాదోచి, నానాభ్రాంతులను గొలిపి, నానాదుఃఖములను గలిగించుచున్న యొుక యెండును నిల్వజాలక యేగుచున్నది. నీవీయచల పరిపూర్ణబోధను దెల్పెడి శుద్ధనిర్గుణతత్త్వ కందార్థదరువుల గ్రంథమును చివరివఱకు జదివి, దీని యథార్థమును గ్రహించినచో మూలములేకయే తోచెడి యీ మాయలమారి యొుక నీయెదుట నిలువబడి నిన్నెన్నటికి చూడజాలదు. 201

కం॥ జననమరణ ప్రవాహము । వణచును నీబోధ పట్టు - డని సాధువు లి । చ్చిన నొల్లకుండి వారలు । చనినపు డా బోధ మీద - జనియించి ప్రేమా * వెద కెదరట్టి- జనచేష్టలే మా * యనిలోచి నీకునే - వినజెప్పవలసె నీ । వును నీ బోధను నొల్ల - ననకు దొరకదుమళ్ళి । జనియించి ప్రేమా * వెద కెదరట్టి - జనచేష్టలేమా * 202

భా॥ అచలపరిపూర్ణులైన సద్గురు సార్వభౌములువచ్చి యీ యచల పరిపూర్ణ బోధను పొందుడు. దీనిని పొందినచో నిది మీజననమరణ ప్రవాహరూపమగు సంసారభ్రాంతిని పో

గొట్టును. కావునమీరు దీనిని గ్రకొనుడని యెంతచెప్పినను వినక, కొందఱు వారు వెళ్లిపోయిన తరువాత నాయచల పరిపూర్ణ బోధమీద ప్రేమజనించి, యా యచల పరిపూర్ణ గురు సార్వభౌముల కొఱకు వెదకెదరు. అటువంటి మానవులచేష్టలు మాయయనితోచి, నీకు నేనింతగా చెప్పుచుంటిని. నీవిప్పు డీ యచల పరిపూర్ణ బోధ నాకక్కర లేదనకుము. నేను వెళ్ళిపోయిన తరువాత నీకీబోధమీద ప్రేమజనించినప్పుడు నీవెచ్చట వెదకినను దీనినిబోధించెడి యచలపరిపూర్ణ గురుసార్వభౌములు దొరకుటకష్టము. అప్పుడునీవు పశ్చాత్తాపమును పొందెదవు. 202

కం॥ మరపును తన్మాత్రలుగల । వెరుకను తన్మాత్రలున్న - వీరొందొకటే । పరిపూర్ణమునకు లేవవి । పరిపూర్ణం బెరుకగాదు - మరపుగాదోయి * వెదకినదీని - సరిది లేదోయి * పరిపూర్ణమెరుకల - పరిశోధించి యీ గ్రంథ । ము రచించి నీకి స్తి - మరువకచదువెరుక । మరపుగాదోయి * వెదకిన దీని * సరిదిలేదోయి * 203

భా॥ "శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము" అను నీయైదును పంచతన్మాత్రలు. ఈతన్మాత్రలైదును ఎఱుకకు, మఱపునకునున్నవిగాని, పరిపూర్ణమునకు లేవు. పరిపూర్ణ మెఱుకయుకాదు, మఱపునుగాదు. ఎఱుకమఱపులు రెండును మూలములేకయే తోచుచున్నవి. పరిపూర్ణ మాద్యంతములు లేక స్వతస్సిద్ధముగ నిలిచియున్నది. ఈయచల పరిపూర్ణబ్రహ్మ

ముతో సమానమైనదిగాని, యధికమైనదిగాని యెచ్చటను లేదు. అటువంటి స్వతస్సిద్ధమై నిలిచియున్న అచలపరిపూర్ణ బ్రహ్మమును, మూలములేకయే తోచుచున్న ఎఱుక మఱపులను, పరిశోధించి యీశుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువుల గ్రంథమును రచియించి నీచేతికిచ్చితిని. నీవిని నీవు మఱవక శ్రద్ధగా చదివి దీనియర్థమును గ్రహింపుము. 203

కం॥ అందముగా సద్గ్రంథము । చందము వినిపిం
తు దాని - చదివిన వినినఁ । ముందుగబయలెరుకైయే।
సందునలేనెరుకలేక - చనవలెసుమ్మి * అదెయిదివిని -
చదువుమినమ్మి * యెంచుకు నీ కింక - నితరశాస్త్రముల
జో । లంపు గుర్తుండి పో - దదిగాన నీ యెరుక । చనవలె
సుమ్మి * అదెయిది విని - చదువుమి నమ్మి * 204

భా॥ స్వతస్సిద్ధమై నిండియున్న కేవలాత్మస్థితిని దెల్పెడి గ్రంథమే సద్గ్రంథము. ఇట్టి సద్గ్రంథమును నేను నీకు వినిపించెదను. ఇటువంటి సద్గ్రంథములు నీవు స్వయముగా చదివినను, సద్గురువులవలన వినినను ముందుగానీకు స్వతస్సిద్ధమై నిండియున్న బట్టబయలగు కేవలాత్మయునికి తెలియబడును. అటుపిమ్మట మూలములేకయే నానావిధ నామరూప నటనలుగా తోచుచు, నానావిధ భ్రాంతులను గలిగించి, నానావిధ దుఃఖముల పాలుచేయుచున్న ఎఱుక యెఱుగబడును. తరువాత నా మూలములేని యెఱుక యెచ్చటను నిలువక మటుమాయమైపోవును. ఈ శుద్ధనిర్గుణతత్త్వ కందార్థదరువులను

గ్రంథమట్టి సద్గ్రంథముల కోటిలోనిది. నీవు నామాటనునమ్మి యీ సద్గ్రంథమును సద్గురువుల వలన శ్రవణముచేయుము. దీనినిశ్నీవు బాగుగా చదువుకొనుము. నీవిక ఇతరశాస్త్రముల జోలికిపోకుము. ఇతరశాస్త్రములన్నియు నెఱుకను నిలుపునే కాని, దానిని పోగొట్టజాలవు. కావున నీవు సర్వానర్థములకు కారణమైన యెఱుకను పోగొట్టెడి యీ సద్గ్రంథమునే చదువుము. 204

కం॥ చక్కెరమెక్కక లోకులు । చక్కెర మాధుర్యమెరుగ - జాలరటువలె । యుక్కవతోవిని చదువక । చక్కని గ్రంధార్థమెరుగ - జాలరాజనులు * కావుననీవు - చాలించి పనులు * చొక్కమీగ్రంథము - చూడుము కొన వెళ్ల । నిక్కడితోజన్మ - మెత్తవు సరితెలియ । జాలరా జనుయు * కావున నీవు - చాలించిపనులు * 205

భా॥ చక్కెరను తినని మానవులు చక్కెరయొక్క మాధుర్యము నెఱుగజాలనట్లు, ఈ సద్గ్రంథమును సద్గురువు వలన శ్రద్ధతో శ్రవణముచేయకయు, తాము స్వయముగా చదువకయు నున్నవారీ సద్గ్రంథముయొక్క యథార్థ తాత్పర్యము నెఱుంగజాలరు. కావున నీ వితర కార్యముల నన్నిటిని కట్టిపెట్టి ముందుగా నీ సద్గ్రంథమును చివరి వఱకు చదివి, దీని యర్థమును గ్రహింపుము. అట్లు గ్రహించి యాస్థితి గలవాడవై యున్నచో, నీకిక జననమరణ ప్రవాహరూపమగు సంసార భ్రాంతి కలుగదు. 205

కం॥ గూఢార్థమెరిగి సతతా । రూఢుండగు నతడు గ్రంథ - రుచిగొనడు భువిలో । గాఢతరాజ్ఞానంబున । మూఢుండై యున్నవాడు - మొదటనేవినడు * సుజనులపొంత - ముదమొప్పగనడు * వాడు వీడనరాని - వాడేగ్రంథము విను । వాడు నిశ్చయమిట్టి - వా ర్తలెఱుగనివాడు - మొద టనే వినడు * సుజనులపొంద - ముదమొప్పగనడు * 206

భా॥ అచలపరిపూర్ణ సద్గురుసార్వభౌముని వలన సమగ్రముగ నచలపరిపూర్ణ భావముననెఱింగి యా రూఢుడై యున్న వానికి గ్రంథముయొక్క ప్రయోజనము లేదు కావున నతడు దీనిని వినడు. గాఢతరాజ్ఞానముచే మూఢుడై యున్నవాడు నిరంతర మీ సంసారభ్రాంతిలో పడియుండును కావున నతడు మొదలే వినడు. అట్టివానికి సాధుసత్పురుషుల సాంగత్యము కూడ గిట్టదు. ఇక నచల పరిపూర్ణ భావమునం దారూఢుడై యున్నవాడును, గాఢతరాజ్ఞానముచే మూఢుడై సంసార భ్రాంతిలో జిక్కినవాడునుగాక, యనేకజన్మ సుకృతవిశేషముచే పరిశుద్ధాంతఃకరణము గలవాడై జననమరణ రూపమగు సంసారభ్రాంతి నివృత్తిని గోరు జిజ్ఞాసువే, యీ గ్రంథమును సద్గురుని వలన వినును. అతడే యీ గ్రంథము నామూలాగ్రముగ చదివి దానియర్థమును గ్రహించును. ఇతరుడు వినడు, చదువడు. 206

కం॥ తాబేటి తలపుచేతను । తాబేల్పిల్లల క్షుధా ర్తి - తలగుట దెలియక । తాబేటిగర్భమందున । తాబేలై పుట్టి

కున్న - తరమా యితరులకు * సద్గురుబోధ - ల్లరయ ని
తరులకు * ఏబాధలెరుగని - యా బోధగలవారి ; చే బో
ధ బడయక - చేకొనదలచితే ; తరమా యితరులకు *
సద్గురుబోధ - ల్లరయనితరులకు * 207

భా॥ తాబేలు గ్రుడ్లనుపెట్టి యది యాహారమునకై బయటికేగినప్పు డాగ్రుడ్లు తలంపునకు రాగానే,యవిచిట్టిపిల్లలై వాని యాకలి తీరిపోవుచున్నట్లు, సద్గురుమూర్తి దూరదేశము నందుండినను నుత్తమ శిష్యుడా గురునియందు లక్ష్యముంచి యేకాగ్రచిత్తముతో గాంచుచుండినచో సద్గురుమూర్తి నా యుత్తమ శిష్యునిగూర్చి సంకల్పించినంత మాత్రముచేతనే శిష్యునికి సంసారభ్రాంతి నివృత్తియగుచున్నది. ఇది మనోదీక్ష యనబడును. అట్లే చేపలు గ్రుడ్లుపెట్టి యాగ్రుడ్లను తదేక దృష్టితో లక్షించి చూడగనే యాగ్రుడ్లు చిట్టిపిల్లలైనట్లు, ఉత్తమశిష్యుడు తనసమీపమునందున్న సద్గురుమూర్తి నేకాగ్ర చిత్తముతో, లక్షించిచూచుచున్నచో నా సద్గురుమూర్తి యా యుత్తమశిష్యుని కరుణార్ద్ర దృష్టితో గాంచగనే యతని సంసార బంధములు వీడిపోవుచున్నవి. దీనిని దృగ్దీక్షయందురు. పక్షులు గ్రుడ్లనుపెట్టి పొదిగినప్పు డాగ్రుడ్లు చిట్టిపిల్లలైన విధముగా సద్గురుమూర్తి తన సమీపమునందున్న ఉత్తమశిష్యుని మస్తకమునందు తన శ్రీహస్తమునుంచి మంత్రోపదేశముచేసి బోధించుచుండగా, నాబోధ నేకాగ్రచిత్తముతో శ్రవణము చేసినచో శిష్యుని జననమరణాది సంసారభ్రాంతి నివృత్తియగు

చున్నది. ఇది వాగ్ధీతి యనబడును. తాబేటిపిల్లలు తాబేటి తలపును, చేపపిల్లలు చేపదృష్టిని, పక్షిపిల్లలు పక్షిస్పర్శను తెలియునట్లు, సద్గురుపుత్రులకు సద్గురుబోధ ప్రభావము తెలియునుగాని, యితరులకెంతమాత్రము తెలియదు. జననమరణాది సంసారబాధలేవియులేని యచల పరిపూర్ణ గురుసార్వభౌములచే నీపరిపూర్ణబోధను బడయజాలక, యితరచిల్లర గురువులచే బోధనుపొందిన వారికి జననమరణాది సంసార భ్రాంతులణగవు. 207

కం॥ ఈతాపేక్షను మనుజులు । నూతిదరిందేరి నిలిచి - నోటగొణగినన్ । ఈతేలవచ్చు వారికి । చేతులతో నీళ్ల మీద - చేరి యీదకను * మునునేర్చిన - వారిదించకను * ఈతెరుగనె దేశి - కేంద్రుడు తెల్పక । చాతుర్యమున బోధ - సాధించనయ్యేన । చేరి యీదకను * మును నేర్చిన - వారిదించకను * 208

భా॥ మానవులు నీటిమీద నీదవలయునను కోరికతో దిగుడుబావి యొద్దకుగాని, చెఱువునొద్దకుగాని వెళ్లి, యందులో దిగక యొడ్డునవిలబడి, నోటితోనీతముచ్చట్లు చెప్పుకొనుచున్నచో వారికీత యెట్లువచ్చును. పూర్వమే ఈత నేర్చుకొనినవారిని నీళ్లలోనికి దింపి, తరువాతవీరును నీళ్లలో దిగి యీత నేర్చినవారి సాహాయ్యముతో నీళ్లపైన చేతులతో నీదినచో నీత నేర్చుకొనవచ్చును గాని యన్యవిధముగారా నేరదు. అట్లే యచలపరిపూర్ణ భావము నెఱుంగదలంచిన వా రాభావము

నామూలాగ్రముగ నెఱింగిన పూర్ణ గురు సార్వభౌముల నాశ్ర యించి వారివలన నెఱుంగదగునుగాని, చాతుర్యముతో సచల గ్రంథములను చదువుకొనుట వలనగాని, గాలిమాటలను విను టవలనగాని, యెనరును పరిపూర్ణ భావము నెఱుంగజాలరు. 208

కం॥ ప్రవిమలచిత్తుడు శిష్యుడు । సవినయమున దేశికునకు - శరణాగతుడై । త్రివిధప్రసాదములు గొని । భవనాశస్థితులు లేని - పద్ధతివినిన‌ * తిరిగిరాని - పద్ధతి గనినన్ * భువిలోవానికోసాటి - బోల్పనెవ్వరులేరు। అవిరళభక్తినీ - వారీతినుండు మీ । పద్ధతి వినిన‌ * తిరిగి రాని - పద్ధతిగనినన్ * 209

భా॥ మలవిక్షేపాది దోషములులేని నిర్మలమనస్సుగల యుత్తమశిష్యుడు, వినయవిధేయతలు గలవాడై, యచలపరి పూర్ణ గురుసార్వభౌముని శరణుపొంది, వారు ప్రసాదించిన "ద్వాదశి, షోడశి, పంచదశి" యను త్రివిధ ప్రసాదములను గ్రహించి, చావుపుట్టుకలులేని పరిపూర్ణ బోధయొక్క పద్ధతిని విని, జననమరణాది సంసారదుఃఖములులేని మార్గము నెఱిం గిన వారితో సమానులు ఈభూమియందెవ్వరును లేరు. కావున నీవు సద్గురుసార్వభౌమున కాత్మార్పణ భక్తుండవై జననమర ణాది సమస్త సంసారదుఃఖములులేని యచలపరిపూర్ణ స్థితి గలిగియుండుము. 209

కం॥ ఉపనయనముగానిదె తా । నుపనయనముమీది చదువు - నూహానెరిగినన్ । విపరీతమగును దానను । చన

లుడు బ్రాహ్మణుడుగాడు - చర్చించిచూడ * శూద్రుడు
వాని - నర్చించరేడ * ఉపముచే బోధట్టు - లూహించి ని
క్కేటి । కపటచిత్తుడు సాధు - గణముతో సమమౌనె ।
చర్చించిచూడ * శూద్రుడు వాని - నర్చించరేడ * 210

భా॥ బ్రాహ్మణు డుపనయనము కాకపూర్వము వేదము చదువకూడదను విధిగలదు. బ్రాహ్మణు డా విధిని పాటింపక, యుపనయనము కాకపూర్వమే వేదమును స్వయముగా చదివి దానియర్థమిట్లుండునని యూహించుకొని, నేనును వేదము చదివితిని, దానియర్థము నాకును తెలియుననుట విపరీతమగును. అట్టి చపలచిత్తుడు బ్రాహ్మణుడేకాడు. అతడుశూద్రుడే యగును. అతనికి వేదముయొక్క యథార్థతాత్పర్యము తెలియదు. లోకములో నెవరు నతని గౌరవించి పూజింపరు. అట్లే సద్గురు సార్వభౌముల నాశ్రయించి, పరిపూర్ణ బోధ నెఱుంగక, కొన్ని యచల గ్రంథములను చదివి, కొన్ని గాలిమాటలను విని, వానికి కొన్ని యుపమానములను, యుక్తులను నూహించుకొని, మాకును పరిపూర్ణ బోధ తెలియును, మేమును లోకులకు బోధించెదమని నిక్కెడి కపటచిత్తుడగు పామరుడు అచల పరిపూర్ణ స్థితి గలిగినసాధుపుంగవులతో నెన్నటికిని సమానుడు కాజాలడు. 210

కం॥ మంత్రముచే సంతెట్లగు । తంత్రముతేనన్న
గాదు - తంత్రముచేనన్ । మంత్రముతేకను పడుగిల ।
మంత్రము తంత్రంబులెంప - మరిగూడుకొని * కార్యము

అన్ని - జరిగించుచూని * మంత్రతంత్రములలో - మర్మము
గురుడెరుగు । మంత్రతంత్రములతో - మరుగెరుగు గురు
నిచే । మరిగూడుకొని * కార్యములన్ని - జరిగించుచూని *

భా॥ గర్భాధానమురోజున వధూవరులను పీటలమీద కూర్చుండబెట్టి పురోహితుడు మంత్రములను చదువును. ఆ మంత్రములవలన వారికి సంతానము కలుగజాలదు. అటుపిమ్మట నాదంపతులను గదిలోనికి పంపెదరు. అప్పుడు వారి మైథున తంత్రమువలన సంతానము కలుగుచున్నది. ద్విజబాలునకు వడుగు చేయునప్పుడు పురోహితుడు కేవలము వడుగుతంత్రము జరిపినప్పటికిని నది వడుగుకాజాలదు. మంత్రోపదేశమువలననే వడుగు పూర్తియగుచున్నది. మంత్రశబ్దమునకు రహస్యాలోచన మనియు నర్థముగలదు. లోకములోని సమస్త కార్యములు మంత్రతంత్రములు రెంటితోను గూడి జరుగుచున్నవి. ఈ మంత్రతంత్రములలోని మర్మమును సద్గురుమూర్తి యెఱుగును కావున, శ్రీవారివలన స్వతస్సిద్ధమై నిండియున్న అచల పరిపూర్ణబ్రహ్మమును బోధించెడి ద్వాదశాక్షరీ మహామంత్రమును, మూలములేకయే నామరూప నటనలుగా దోచెడి యెఱుకను బోధించెడి షోడశాక్షరీ మహామంత్రమును నెఱింగి, యటుపిమ్మట స్వతస్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ స్థితిగలిగియుండెడి తంత్రమును, మూలములేకయే నామరూప నటనలుగా దోచెడి యెఱుకయొక్క స్వరూప స్వభావముల నెఱింగి, దానిని విడిచెడి తంత్రమును నెఱుంగుము. 211

కం॥ సంకల్పాదిక గుణముల । సంకుల మీయెరుక
యందు - సమకూడుండుగా । సంకల్పాదిక గుణముల ।
సంకులమచలమును జూడ - జాడలేదన్నా * ఈరెంటికి -
నీకుగావన్నా * కొంకక యీరెంటిన్ - గూర్చి గ్రంథము
జేస్తి । సంకోచింపక చదువు - శంకబుట్టదుయింక । జాడ
లేదన్నా * ఈరెంటికి - నీకుగావన్నా * 212

భా॥ మూలములేకయే నామరూపనటనలుగా తోచు
చున్న ఎఱుకయందు కామసంకల్ప వికల్పాది సమస్త గుణ
ములు నిండియుండును. ఈ కామసంకల్ప వికల్పాది గుణము
లేవియు స్వతస్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మము
నందు లేవు. ఈ కామసంకల్ప వికల్పాది గుణములులేక స్వత
స్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మమును, కామసంక
ల్పవికల్పాది గుణములతో మూలములేకయే నామరూప నట
నలుగల లేనియెఱుకయును సమానములుకావు. అయిన నీ రెం
టిని, పీని యునికిలేములను దెలుపుటకొఱకే శుద్ధనిర్గుణతత్త్వ
కందార్థదరువుల గ్రంథమును నేను రచియించితిని. దీనిని నీవా
మూలాగ్రము సకోచింపక చదువుము. చదివిన తరువాత స్వత
స్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యుని
కిని, మూలములేకయే నామరూప నటనలుగా తోచుచున్న
ఎఱుకయొక్క లేమిని యెఱుంగుము. అప్పుడు నీ సర్వసంశయ
ములు నశించిపోవును. 212

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణ దేశికప్రభు విరచిత శుద్ధ

నిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు బోధపరచమను ద్వాదశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.

---

# 13. భద్రాద్ర్యంకితము

కం॥ అలభద్రాచలమనిన బ । యలుగా గుర్తెరుగ వలయు - నెరుకను విష్ణ్వం । దులదోచి గురునికృపచే । నిలువక విష్ణ్వేగిరిపోతే - నిశ్చయముదెరా * కృష్ణదాసు - నిశ్చయమిదెరా * ఇలలోననెవరైన - నీకందార్థములలో । పలిగూఢార్థముదెలియ - భ్రమను జెందరువారు । నిశ్చయమిదెరా * కృష్ణదాసు - నిశ్చయమిదెరా * 213

భా॥ సర్వకాలములయందును,సర్వదేశములయందును, సమ స్తవస్తువులయందును, సంపూర్ణముగా నిండి నిబిడీకృతమైయుండిన బట్టబయలును భద్రాచలముగను, మూలములేకయే నామరూప నటనలుగా దోచెడి యెఱుకను విష్ణుమూర్తిగను భావింపవలయును. సద్గురుమూర్తి కృపచే నెఱుకయనెడి విష్ణువు నెగరగొట్టినచో బట్టబయలైన భద్రాచలము శేషించి స్వతస్సిద్ధముగ నిలిచియుండును. ఇదియే శ్రీభాగవతుల కృష్ణ దేశిక ప్రభువుల నిశ్చయము. ఇట్టి నిశ్చయమును పొంది వ్రాయబడిన యీ శుద్ధనిర్గుణతత్త్వ కందార్థదరువులయందు నిగూ

ఛమైయున్న భావార్థమును తెలిసికొనినవారు మూలములేక యే నానానామరూప నటనలుగా తోచుచున్న ఎఱుకలోని భ్రాంతుల నెంతమాత్రము పొందరు. 213

కం॥ భాగవతులనారాయణ । యోగికి జానకియనేటి - యువిదామణికిన్ । బాగుగ పుత్రుడనై భూ । భాగమునం గృష్ణుడనగ - ప్రభవించినాను * అనంతికి - ప్రభువునై నాను * నాగురుని కృపచేత - నయమైన యీ బోధ । నే గంటి కన్నంత - నీకుదెల్పుట కిట్లు । ప్రభవించినాను * అనంతికి - ప్రభువునై నాను * 214

భా॥ నేను భాగవతుల నారాయణయోగికిని, జానకమ్మ యను సువిదామణికిని పుత్రుడనై పుట్టితిని. ఈ భూమి యందలి జనులు నన్ను కృష్ణదాసని పిలిచెదరు. అనంతమ్మయను స్త్రీరత్నమును వివాహమాడి యామెకు నేను భర్తనైతిని. నా సద్గురుదేవుని దయవలన నీపవిత్రమైన యచల పరిపూర్ణ బోధ నెఱింగితిని. నే నెఱిగిన యచలపరిపూర్ణ బోధను సమగ్రముగ నీకు దెలుపుటకొఱ కీ గ్రంథమును వ్రాసితిని. 214

కం॥ దేశాటనంబుజేసితి । వ్రాసితిగ్రంథములు కొన్ని - వరగురుశిష్యుల్ । చేసెడి చర్చలువింటిని । రోసితి మోక్షెద్యపేక్ష - రూఢిగావినుమీ * నీవిట్టి యా - రూఢత గనుమీ * దేశసుఖయమిట్టి - జేసిశుశ్రూషోప । దేశము గొని యుప - దేశమిచ్చితి మెచ్చి । రూఢిగావినుమీ *

సీవిట్టి యా - రూఢతగనుమీ * 215

భా॥ నేను బహుదేశములు తిరిగితిని. ఆ దేశములలో పేరెన్నికగన్న గురుశిష్యులు చేసికొనెడు వేదాంతచర్చలను వింటిని. కొన్ని వేదాంతగ్రంథములను వ్రాసితిని. నేను సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్యాది పదవుల యపేక్షను, మోక్షాపేక్షను రోసినిడిచితిని. దీనిని నీవు గూఢిగా వినుము. నీవుకూడ నిట్టి యారూఢతను పొందుము. నేను సద్గురుస్వామికి దయ కలుగునటుల ప్రవర్తించుచు, వారికి చతుర్విధ శుశ్రూష లాచరించుచు, వారివలన నచలపరిపూర్ణ భావము నుపదేశము పొందితిని. వారివలన నేను పొందిన యచల పరిపూర్ణ భావమునే నీప్రవర్తనకు మెచ్చి నేనునీకుపదేశించితిని.

కం॥ హఠమున కుటిలాత్మనిజం। పుటకై భటకోటి కాజ్ఞ - భూపతియిడినన్ । భటులటువలె జేసెడి లో। పట కుటిలుడు పడెకుపాట్లు - పాటించికనునా * అట్లనె గురుని - నోటతావినెనా * ఇటువంటిబోధను - నెటువంటి నరుడైన - నటువెన్క తనచేష్ట - లెటువంటివో వాని। పాటించి కనునా * అట్లనెగురుని - నోటతావినెనా * 216

తా॥ కుటిలాత్ముడైన యాతతాయిని జంపవలయునని పట్టుదలతో రాజు భటులకాజ్ఞాపించినప్పుడాకుటిలాత్ముని రాజభటులు పట్టుకొని చంపులోపల నాకుటిలుడు పడెడిపాట్లు నతడాకాలమున గమనింపజాలనట్లు, సద్గురుమూర్తి యిటువంటి పరిపూర్ణ బోధను బోధింపగావిని పరిపూర్ణ స్థితుడై యున్న

వాడెవడైనను తనవెనుకటి చేష్టలెటువంటివో వానిని పాటించి కనజాలడు. 216

కం॥ సకలజనుల సమ్మతిగా । నొకడైనను నడువ
జాల - దుర్వీస్థలిపై । మకరాంక జననిజనకా । ద్వ్యకళం
కులలోన నేనీ - వననేమిగణన * బోధందితర - జనులేమి
గణన * వికలమానసుడవై - వెతనొందబోకు నీ । వమల
భక్తుండ - వని తెల్పితిబోధ । ననవేమిగణన * బోధం
దితర - జనులేమిగణన * 217

భా॥ లోకములో సర్వమానవులకు సమ్మతముగా మన్మథుని తల్లిదండ్రులైన లక్ష్మీనారాయణులు గాని, భారతీబ్రహ్మలుగాని, పార్వతీపరమేశ్వరులుగాని, ఇంద్రాది దేవతలు గాని, మఱియెవ్వరైనగాని నడువజాలరు. ఇక [illegible] నేను సకల జనుల సమ్మతముగా నడువగలనా? నడువజాలను. అదే విధముగా నీ యచలపరిపూర్ణ బోధను బుద్ధిమంతులైన కొందఱు మాత్రమే మెచ్చెదరు. పామరజను లీబోధను మెచ్చరు. నీవా పామరుల మాటలను విని చంచల మనస్సుగలవాడవై బాధపడకుము. నీవు నిష్కల్మష హృదయముగల భక్తుడవని నీకీ పవిత్రమైన పరిపూర్ణబోధను తెల్పితిని. 217

కం॥ బలధనవిద్యలు దుష్టుల । కిలగల్గిన నౌరుల
నొంతు - రెంతయు నిర్వ్యాజ । బలధన విద్యలు శిష్టుల ।
కిలగల్గిన నౌరులబ్రోతు - రెంతోమోదమున * నీవిరెంటి -

నెరిగి మోవమున * కలలోనసైన దు - ష్టుల చెంతజేరకు ।
మెలమి శిష్టులచెంత - కలనైన వదలకు । మెంతో మోవ
మున * నీవీరెంటి - నెరిగిమోవమున * 218

భా॥ దుష్టులకు బలము గలిగినను, ధనము గలిగినను, విద్యగలిగినను వారు తమదరికి జేరిన సామాన్య మానవుల నున్నతస్థితికి రానీయకుండ నీర్ష్యతో వారి నణగద్రొక్కెదరు. శిష్టులకు బలము గలిగినను, ధనముగలిగినను, విద్యగలిగినను వారు సంతోషముతో తమదరికి జేరిన సామాన్య మానవులను కాపాడి వారి నున్నతస్థితికి తీసికొని వచ్చెదరు. కావున నీవి యిరుతెగలవారి స్వభావములను గుర్తెరిగి కలలోనైనను నీవు దుష్టులచెంతకు జేరకుము. శిష్టులసాంగత్యమును నీవు కలలోనైనను విడిచిపెట్టకుము. 218

కం॥ అంకమగు స్వాతివర్షపు । బిందువులెందెందు
బడునొ - పృథ్విస్థలి త । ద్బిందువు లుపాధివశమున ।
జెందును తగునామరూప - చేష్టాదికమును * అట్లనెనీవు -
చెందేవిన్నియును * నుందితో జతగూడి - మాట్లాడినంత
లో । నందుకే సహవాస - మరయుము తగువాని । చేష్టాది
కమును * అట్లనెనీవు - చెందేవన్నియును * 219

భా॥ స్వాతికార్తెలో కురిసిన వర్ష బిందువులు ముత్యపు చిప్పలోబడి మంచిముత్యములుగా నగుచున్నవి. రేగడి నేల యందుబడి తియ్యని జలముగా నగుచున్నవి. చవిటి నేల యందు బడి నుప్పని జలముగా నగుచున్నవి. ఇసుక నేలయం

డు బడి రూపనామములు లేకపోవుచున్నవి. ఇట్లీసర్ష బిందువు లుపాధుల సంబంధమువలన వేఱువేఱు రూపనామగుణములను పొందుచున్న విధమున, నీవుకూడ జారులతో సాంగత్యము చేసినచో జారుడనగుదువు. చోరులతో సాంగత్యము చేసినచో చోరుడనగుదువు. భక్తులతో సాంగత్యము చేసినచో భక్తుడ వగుదువు. జ్ఞానులతో సాంగత్యము చేసినచో జ్ఞాని వగుదువు. పరిపూర్ణస్థితి కలిగియుండినవారితో సాంగత్యము చేసినచో పరిపూర్ణుడనగుదువు. కావున నీవు చక్కగా విచారించి పరిపూర్ణస్థితిగలిగియున్న వారితో సాంగత్యముచేయుము.

కం॥ జారులకు లోకులందరు । జారులవలె తోచబడుట - సహజగుణంబౌ । చోరులకు సకలజనములు । చోరకులని మదికి దోచు - చునికి సహజమురా * అట్లనె దుష్టా - త్మునికి సహజమురా * పారములేని సం - సారాబ్ధి దాటించు । వారిని తమవంటి - వారిగగనునట్టి । యునికి సహజమురా * అట్లనె దుష్టా - త్మునికి సహజమురా*220

తా॥ జారులకు లోకులందఱు తమవంటి జారులుగనే తోచుచుందురు. ఇది వారి సహజగుణము. చోరులకు మానవు లందఱు చోరులుగనే తోచుచుందురు. ఇది వీరి సహజగుణము. దుర్మార్గుల కీ ప్రపంచములోని జనులందఱు దుర్మార్గులుగనే తోచుచుందురు. ఇది వారి సహజగుణము. అట్లే పామరజనులకు పారములేని జనన మరణాది సారావారమును దాటించెడి పరిపూర్ణ గురుసార్వభౌములు తమవంటి పామరులు

గనే తోచుచుండురు. ఇది వారిసహజగుణమని తెలిసికొనుము.

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కంచార్థ దుమ్మలయందు భద్రాద్ర్యంకిత మను త్రయోదశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య స్వామి శ్రీబ్రహ్మనందగిరి సద్గురు మహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థదీపికా సహితము.

## 14. సద్గురులక్షణము

కం॥ బయిబెరుకలు శిష్యునకు । దయతో గురు
దెరుకజేసి - తరువాతను సం । దియమేమిలేక యెరుకను ।
నయమున విడిపించు గురుడు - నయశాలిగాదా * నీమది
కిది - నాపెనాలేదా * భయభక్తి గురుసార్వ - భౌముని
సేవని । శ్చయముగ జేసితే - జయమందెదవు గురుడు ।
నయశాలిగాదా * నీమదికిది - నాపెనాలేదా * 221

భా॥ తన ప్రియశిష్యునకు స్వతస్సిద్ధమై సంపూర్ణముగ నిండియుండిన బట్టబయలగు కేవలాత్మయునికిని, మూలము లేకయే నామరూప నటనలుగా తోచుచున్న ఎఱుకయొక్క స్వరూప స్వభావములను తెలిపించి, యటుపిమ్మట మూలము లేకయే నామరూప నటనాత్మకముగా తోచుచున్న ఎఱుకను సమూలముగా విడిపించుచున్న సద్గురుసార్వభౌముడే సర్వోత్తముడు. ఈ విషయమును నీవు మనస్సునందు బాగుగా నా

పు ముత్త - దీబట్టబయల్ । ఏమియులేదని పల్కిన । నీ మంత్రమె ద్వాదశాక్ష - రింకొకటివినుమీ * ఎప్పుడునోట - నిదిమరువ కనుమీ * ఈమూలంలేని గు - ఱ్ఱెరిగే శరీర ము । ఏమిలేదనియంటె - నిది షోడశాక్షరి । యింకొకటి వినుమీ * ఎప్పుడు నోట - నిదిమరువకనుమీ * 223

భా॥ శిష్యా! నేనునీకు ద్వాదశాక్షరీ షోడశాక్షరీ మహా మంత్రములను రెంటిని చెప్పెదను వినుము. ఇందు "అయం వ్యర్థః బాహ్యాకోఽపి న భవతి" (ఈ యుత్తబట్టబయ లేమియు లేదు) అనునది ద్వాదశాక్షరీ మహామంత్రము. దీనిని నీవెల్ల ప్పుడు మనస్సులో నిలుపుకొని, దీనియర్థమును సద్గురుముఖతః నెఱింగి, భావింపుచుండుము. "మూలాభావ మిదం జ్ఞాతం శరీ రం కిమునా స్తిహి" (మూలములేని యీ గుఱ్ఱెఱుగు దేహ మేమిలేదు.) అనునది షోడశాక్షరీ మహామంత్రము. దీనియర్థ మును సద్గురుముఖతః విని యిది యెప్పుడు లేనిదని తెలిసి కొనుము. 223

కం॥ తొలిమంత్ర పర్థమెక్కడ । గలదోయని వెదక నేల - కలదంతట నా । వలిమంత్ర పర్థమెక్కడ । గలదో యని చూడనేల - కాదా చూచేది * వినేది య - నేది తినే దీ * అలలొలుతదాన్ని నీ - వవలోకనము జేసి । కలకాల మెరుకను - గలదాన్ని విడు మెరుక । కాదాచూచేది * వి నేది య - నేది తినేది * 224

తా॥ శిష్యా ! నీవు మొదటిదియగు ద్వాదశాక్షరీమహా మంత్రార్థ మెచ్చటనో యున్నదని వెదకవలసిన పనిలేదు. అది సర్వకాలముల యందును, సర్వదేశముల యందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగ నిండి స్వతస్సిద్ధమైయున్న బట్టబయలగు కేవలాత్మయని తెలిసికొనుము. రెండవదియగు షోడశాక్షరీ మహామంత్రార్థ మెచ్చట నున్నదోయని చూడ వలసిన పనిలేదు. అది మూలములేకయే వినబడు శబ్దముగను, శబ్దమును వినెడి యెఱుకగను, స్పృశింపబడు స్పర్శముగను, స్పర్శము నెఱిగెడి యెఱుకగను, చూడబడెడి రూపముగను, రూపమును జూచెడి యెఱుకగను, గ్రహింపబడు రసముగను, రసమును గ్రహించెడి యెఱుకగను, వాసనచూడబడెడి గంధ ముగను, గంధము నెఱిగెడి యెఱుకగను, నీవిధముగ నెఱుగబ డెడి సమస్త పదార్థములుగను, వానినన్నిటి నెఱిగెడి యెఱుక గను తెలియబడు చున్నది. ఇందు నీవు మొదటి మహామం త్రార్థమైన బట్టబయలగు కేవలాత్మ యునికి ననలోకనము చేయు ము. తరువాత నీవు రెండవ మహామంత్రార్థమైన మూలము లేకయే తోచుచుండెడి శబ్ద స్పర్శరూపరస గంధాత్మకమగు నామరూప నటనలను, వాని నెఱింగెడి యెఱుకను కలకాలము విడిచి యుండుము. 224

కం॥ ఇదితప్ప యేమిలేదని । మొదటిది మొరబెట్టు చుండు - ముదమున వినుమీ । యిది యేమిలేదు పొమ్మని। వదలక రెండవది లెస్స - వదరుచుండును రా * బయలె

రుకల - నిదినిశ్చయమురా * అది గాననీరెంటి - నరసి నీవిప్పుడు । విదితముగా నెరుక - విదరమంత్రములిట్లు । వదరుచుండునురా * బయలెరుకల- నిదినిశ్చయమురా * 225

భా॥ మొదటిదియగు ద్వాదశాక్షరీ మహామంత్రము సర్వత్ర సంపూర్ణముగానిండి నిబిడీకృతమైయున్న అచల పరిపూర్ణ బ్రహ్మమొక్కటి మాత్రమే స్వతస్సిద్ధమై నిలిచియున్నది. దానికంటె భిన్నముగా నేమియు లేదని మొరపెట్టుచున్నది. రెండవదియగు షోడశాక్షరీ మహామంత్రము మూలములేకయే నామరూపనటనలుగా తోచుచున్న ఎఱుక యెప్పుడును, నెచ్చటను లేదని గట్టిగా వదరుచున్నది. కావున నీవు ద్వాదశాక్షరీ మహామంత్రము చెప్పుచున్న అచల పరిపూర్ణ బ్రహ్మము యొక్క యునికిని, షోడశాక్షరీమహామంత్రము చెప్పుచున్న మూలములేకయే నామరూప నటనలుగా తోచుచున్న ఎఱుకను నెఱిగి, మూలములేకయే తోచుచున్న ఎఱుక యెప్పుడును, నెచ్చటను లేనిదని తెలిసికొని దానిని సంపూర్ణముగా విడిచిపెట్టుము. 225

కం॥ పరిపూర్ణ మిదిగొ యిదిగో । యెరుకనిచూపించి లేని - యెరుకను లేదం । చెరిగించిన గురుదేసరి । యెరుకను నిల్పేటి గురుడు - ఎందుకోయన్నా * తదోప్భధ నీ - కెందుకోయన్నా * శరణన్నవారి మ - స్తకమందు చెయిబెట్టి । తిరముగ నెరుకను - తీసివేయని వాడు । ఎందుకోయన్నా * తదోప్భధ నీ - కెందుకోయన్నా * 226

తా॥ నామరూప గుణ క్రియాదులు లేక, సర్వకాలముల యందును, సర్వదేశములయందును, సమస్తవస్తువుల యందును సంపూర్ణముగా నిండి నిబిడీకృతమై, విధిముఖ ప్రతీతికి విషయముకాక, దానియందు కల్పితమై తోచుచున్న నామ రూప గుణకర్మ జ్ఞానములతో త్రివిధ పరిచ్ఛేదములు గలిగి యున్న సమస్తవస్తువులను నిషేధింపగా స్వతస్సిద్ధమై శేషించి యున్న అచలపరిపూర్ణ బ్రహ్మమిది యనియును, నామరూప గుణ కర్మజ్ఞానములు గలిగి, విధిముఖముగా మూలములేకయే తోచుచున్న ఎఱుక యిదియనియు నెఱిగించి, యటుపిమ్మట నీ మూలములేకయే నామరూప నటనలుగా తోచుచున్న ఎఱుక ఎందును లేదని యెఱిగించి తీసివేసెడి గురుడే సరియైన సద్గురుడు. మూలములేకయే నామరూప నటనలుగా తోచు చున్న ఎఱుకను సత్యమని బోధించి, దానిని నిలిపెడి వాడు సద్గురువుకాడు. అటువంటి చిల్లరగురువుల బోధలను నీవు విన వద్దు. జననమరణాది సంసార ప్రవాహమును దాటింపుడని శరణుజొచ్చిన శిష్యుని శిరస్సునందు తన శ్రీహస్తమునుంచి, నానావిధ నామరూపనటనలుగా తోచి, నానాభ్రాంతులను గలిగించి, నానాదుఃఖములపాలుజేయుచున్న ఎఱుకను తీసివే యని గురుని వలన ప్రయోజన మేమియు లేదు. 226

కం॥ పరిపూర్ణబోధ నెఱిగిన । గురువరుచే బోధ గొన్న - గొప్పఫలంబౌ । పరిపూర్ణ బోధనెఱుగని । గురు వరుచే బోధగొన్న - గొప్పఫలమౌనా ∗ అది యెట్లన్న -

కూడి రతిలోన * పురుషునిచే సంతు - పొలతిబడయును
బడయ । తరమౌన వారికి - తమనండి వారిచే । గొప్పఫల
మౌనా * అని యెట్లన్న - కూడిరతిలోన * 227

భా॥ సంతానాపేక్షగల స్త్రీ పురుషునితో రతిసల్పినచో సంతానమును బడయునుగాని, తనవంటి మఱియొక స్త్రీతో గూడియుండినచో సంతానము కలుగనట్లు, అచలపరిపూర్ణ బోధ నామూలాగ్రమెఱిగిన పూర్ణ గురు సార్వభౌముల వలన బోధను వినినచో జననమరణాది సమస్త సంసార భ్రాంతి నివృత్తిరూపమగు గొప్పఫలము లభించునుగాని, యచల పరిపూర్ణ బోధనెఱుగని యల్పగురుబోధ పరాయణులగు చిల్లర గురువుల బోధలను వినినచో నాబోధలవలన సంసార భ్రాంతి నివృత్తి రూపమగు గొప్పఫలము లభింపక పోగా, సంసార భ్రాంతు లింకను నభివృద్ధియై నానాదుఃఖములను గలిగించుచున్నవి. 227

కం॥ పరిపూర్ణ బోధ నెరుగని । గురుశిష్యులు బోధ
కొరకు - కోరవనిబడుఁ ౹ గురువర్యు నొకని మరలను ।
హరువరమున బుట్టినట్టి - యాశిఖండికిని * భార్యైనట్టి -
యబలతంద్రికిని * వరులనిద్దరిని దే - వలె నీయల్లుడు నే
ను । వరియింతుమని చెప్ప - వనితనంపిన యట్లు । లా
శిఖండికిని * భార్యైనట్టి - యబలతంద్రికిని * 228

తా॥ పాంచాల దేశమును పాలించెడి ద్రుపదమహారాజు

నకు సంతానములేదు. అతడు సంతానము కొఱకు పరమ శివునిగూర్చి తపస్సుచేసెను. అతని తపస్సునకుమెచ్చి పరమ శివు డాతని కొకకుమార్తె కలుగునట్లు వరమిచ్చి వెడలిపోయెను. తరువాత ద్రుపదమహారాజున కొకపుత్రిక జనించెను. తనకు పుత్రసంతానము లేనికారణమున తనయనంతరము తన రాజ్యము నితరులకే వశమగునని తలంచి, ద్రుపదుడు తన పుత్రికను పుత్రుడని వెల్లడిచేసి, యతనికి శిఖండియని పేరుబెట్టెను. శిఖండికి యుక్తవయస్సు రాగానే ద్రుపదు డతనికి వివాహము చేయదలంచి, కాశీరాజు పుత్రికను మాట్లాడి కత్తికి కంకణము కట్టించి వివాహము చేసెను. వివాహమైన తరువాత నా కాశీరాజు కుమార్తె అత్తవారింటికివెళ్ళి యచ్చట నెన్ని సంవత్సరములుండినను తనభర్త తనతో సంపర్కము కలిగియుండక పోవుటచేత నామె కారణ మారయదలంచి, తనచెలికత్తెలను విచారించి, వారివలన తనభర్తకూడ తనవంటియాఁడుదేయని తెలిసికొని, తనతండ్రికి, నీవిదివరకు పొరపడినట్లు, పొరపడక చక్కగా విచారించి, నాకును, నీయల్లునకును నిరువురు భర్తలను తేవలయునని యుత్తరమువ్రాసి, తన చెలికత్తెచేత తనతండ్రియొద్ద కాయుత్తరమును పంపించెను. ఆయుత్తరమును చూడగనే ద్రుపదుడుచేసిన మోసమునకు కాశీరాజు కోపోద్దీపిత మానసుడై, పాంచాల దేశముపై యుద్ధమును ప్రకటించెను. అది గ్రహించి, తనకవమానము కలుగునని తలంచి, శిఖండి యడవులకు పాఱిపోయి, యందొక యక్షుని వలన పురుషత్వమును పొంది, తిరిగివచ్చి తనభార్యకును, నత్త

మామలు, తల్లి దండ్రులు మొదలగు బంధువులందఱకును సంతోషము కలిగించెను. అటువలెనే పరిపూర్ణ బోధ నెఱుగని గురునివలన బోధను పొందినవాడు జననమరణాది సంసార భ్రాంతిని విడువజాలఁడు. కావున మరల్ నాగురువును శిష్యుడును మఱియొక పూర్ణ గురు సార్వభౌముని నాశ్రయించి, వారి వలన పూర్ణ బోధను పొందవలయును. 228

కం॥ దృష్టాంత మెరుకకేదని । యోష్టము గదిలింపగానె - యొరుఋ కలనుచుఁ । దార్ష్టాంతమునుగ బోధకు । స్పష్టముగా కప్పురవుదీ - పముజూపవోయి * యూయుక్తిలో - పముజేయకోయి * తుష్టి నొందెదరిట్లు - తోచి చెప్పితివేని । శ్రేష్ఠమౌనీబోధ - చేకొన్న వారికి దీ - పముజూపవోయి * యూయుక్తిలో - పము జేయకోయి *

భా॥ అధికారులగు నుత్తమశిష్యులు పరిపూర్ణ బోధ తెల్పుమని నిన్నాశ్రయించినప్పుడు వారికి నీవు ద్వాదశాక్షరీ మంత్రార్థమును బోధించుట మూలముగా స్వతస్సిద్ధమై నిండియున్న అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికిని, షోడశాక్షరీ మంత్రార్థమును బోధించుట మూలముగా మూలము లేకయే నామరూప నటనలుగా తోచుచున్న యెఱుకయొక్క లేమిని తెలుపగా వారు నామరూప నటనలుగా తోచుచున్న ఎఱుకయొక్క లేమికి దృష్టాంతమేదియని నిన్నడిగినప్పుడు నీవు వారికి "స్వప్నే ప్రతీయ మానాని రూపాణి యథాతథా" (కల

లో దో చెడి రూపము లేలాగో అలాగే" అను పంచదశాకుదిని బోధించి, దాని యర్థమును వివరముగా దెలుపుము. స్వప్న ప్రపంచమువలె దృశ్యమగునదియు, నాద్యంతముల యందు లేనిదియు, చిజ్జడరూపాత్మకమును, దేశకాల వస్తుకృత పరిచ్ఛేదములు గలదియు, స్వతస్సిద్ధముగా నున్నదాని యునికి నెఱింగినచో నిలిచియుండనిదియు నగు నెఱుక యొల్లప్పుడును లేనిదేయ నెడి దృష్టాంతమును జెప్పుము. నిన్ను వారు చిజ్జడములైన యెఱుకశరీరములు రెండును నేకకాలములో తోచి, యేకకాలములో కలిసి వ్యవహరించి, యేకకాలములో కలిసి యేగున నెడి దానికి ప్రత్యక్షానుభవ మేదియని యడిగినప్పుడు నీవు కర్పూరమును, అగ్గిపుల్లను దెప్పించి, యారెండును వేఱువేఱుగా నున్నంతవఱకు నవి యేకార్యమును జేయుట లేదు. అగ్గిపుల్ల నుగీచి కర్పూరమున కంటించినచో నవి రెండును కలిసి, కొంతసేపు వెలిగి, యాఱిపోవుచున్నవి. ఆమంట యాఱిపోయిన పిమ్మట నేదియు మిగిలియుండదు. అట్లే యెఱుకను విడిచి శరీరముగాని, శరీరమును విడిచి యెఱుకగాని యే పనియు చేయజాలవు. అవిరెండును కలిసియే వచ్చుచున్నవి. కలిసియే కార్యముల నన్నిటిని జేయుచున్నవి. తిరిగి కలిసియే మటుమాయమై పోవుచున్నవి. ఇవి యెచ్చటనుండి వచ్చుచున్నవో, తిరిగి యెచ్చటికి పోవుచున్నవో యెవరికిని తెలియదు. దీనిని నీవు శిఖకర్పూరముల మూలమున దెల్పితివేని వారి సమస్త సందేహములు దీరిపోయి సంతోషమును పొందెదరు. 229

కం॥ ఎరుకభ్రమ గల్గుశిష్యుని । పరితాపము మాన్పి

నట్టి - పండితుడెతడో । గురువతడెగాని గురువులె । గు
రువులమని పొట్టకొరకు - గొణిగేవారెల్ల * వారికీబోధ -
తెలియుటకల్ల * పరిపూర్ణ ము ఏ లేని - యెరుకనేర్పరదెప్పి।
యెరుకను విడిపించ - నెరుగక గురువులై । గొణిగేవా
రెల్ల * వారికీబోధ - తెలియుటకల్ల * 230

భా॥ మూలములేకయే నామరూప నటనలుగా తోచు
చు, నానా భ్రాంతులను గలిగించుచు, నానాదుఃఖముల పాలు
జేయుచున్న ఎఱుక భ్రాంతిలోబడి పరితపించుచున్న శిష్యుని
పరితాపమును మాన్పిన గురువే సరియైన సద్గురుదేవుడు. పొట్ట
కూటి కొఱకు వేషములు వేసికొని, నానావిధములైన మం
త్రములను నోటితో గొణుగుకొనుచుండెడి వారు సద్గురువులు
కారు. వారి కీ యచల పరిపూర్ణ బోధ యొంతమాత్రమును తెలి
యదు. సర్వకాలముల యందును, సర్వదేశముల యందును,
సమస్త వస్తువులయందును సంపూర్ణముగా నిండి స్వతస్సిద్ధమై
నిలిచియున్న అచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క యుకికి,
మూలములేకయే నామరూప నటనలుగా దోచుచు, నానావిధ
భ్రాంతులను గొలుపుచున్న ఎఱుకను, ఆయెఱుకను విడిపించే
మార్గమును నెఱుగక నోటితో మంత్రములను గొణిగెడివారు
పరిపూర్ణ గురువులుకారు. వారి కీ బోధయొక్క మర్మము
తెలియదు. 230

కం॥ గురుశుశ్రూష యొనర్పుట । నెరిగించెద నెట్టు
లనిన - నేర్పడవినుమీ । నరులిష్టదై వములుమం । బరిచర్య

లొనర్చునట్లు - భ క్తి తోడుతను * గురుమూ ర్తి క - త్యు క్తి తోడుతను * నిరత మరమరలేక - నీవు సల్పితి వేని । గురుబోధ మరుగు స - ద్గురునిచే దెలిసేవు । భ క్తి తోడు తను * గురుమూ ర్తి క - త్యు క్తి తోడుతను * 231

భా॥ సద్గురుమూర్తిని సేవించెడి విధానము నెఱిగించెదను. నీవు సావధానచిత్తముతో వినుము. మానవులు తమ యిష్టదైవములకు "శ్రవణము, కీర్తనము, దాస్యము, పాద పూజనము, వందనము, సేవనము, అర్చనము, సఖ్యము, ఆత్మ నివేదనము" అను నవవిధభక్తులతో నర్చించుచున్నట్లు, సద్గురు మూర్తిని నీవు త్రికరణ శుద్ధితో తమ యిష్టదైవమునుగా భావించుచు, హృదయమున నరమరలులేని వాడవై, యతనికి చతుర్విధ శుశ్రూషలు సలుపుచు సేవించుచున్న చో, నాసద్గురు మూర్తికి దయగలిగి పరిపూర్ణ బోధయొక్క మఱుగు నీ కెఱిగించును. 231

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణత త్త్వ కందార్థదరువులయందు సద్గురు లక్షణమను చతుర్దశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్య వర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే రచియింపబడిన భావార్థ దీపికాసహితము.

## 15. సచ్ఛిష్యుని లక్షణము

కం॥ తనుధనమనములుగురునకు। వినయంబున ధార
వోసి - వేడ్కగునుని చే । ననువైన బోధబడసిన । ఘన
మతిమంతునకు సాటి - గలరా యీ భువిని ॥ లోకుల
మ్రొక్క - వలదా చెవులవిని ॥ తననిత్యపు తా - ననర
యేమాటను । వినక పరిపూర్ణత - దనపునానికి సాటి। గలరా
యీభువిని ॥ లోకుల్మ్రొక్క - వలదా చెవులవిని ॥ 232

భా॥ ఉత్తమాధికారియగు సచ్ఛిష్యుడు వినయభయ భక్తి శ్రద్ధలతో సద్గురుమూర్తికి తన తనువు, ధనము, మనస్సు సర్పించి, యతనికి చతుర్విధశుశ్రూషలు చేయవలయును. తన శరీరము నిష్టానుసారముగా ప్రవర్తింపనీయక గురువాజ్ఞ ప్రకారము సత్కార్యములయందు ప్రవర్తింప జేయుట తనువర్పణము. ధర్మమార్గమున స్వార్జితముగ ధనమును సంపాదించి, తాను సంపాదించిన ధనమును స్వేచ్ఛగా ఖర్చుపెట్టక, గురువాజ్ఞాపించిన ధర్మకార్యములకు మాత్రమే వినియోగించుట ధనార్పణము. మనస్సును తన యిష్టానుసారము విషయముల వైపునకు పోనీయక నిగ్రహించి, గురువాక్యానుసారము దానిని పరమార్థ విషయములయందు వర్తింపజేయుట మనోఽర్పణము. ఈవిధముగ తన తనుధనమనముల యందుగల తన పెత్తనమును సద్గురుమూర్తి కర్పించి, యాతని మెప్పును

బడసి, యతనివలన పరిపూర్ణబోధను పొందిన బుద్ధిమంతునితో నీ భూమియందు సమానులెవ్వరునులేరు. అటువంటి మహాత్ములు "నేను, నీవు, నాది, నీది" అను భేదభావములను పొందక, లోకుల చీకాకుమాటలను వినక, నిరంతరము పరిపూర్ణ స్థితియందుండెదరు. అట్టి స్థితిలోనున్న మహాత్ములతో సమానులీ భూమియం దెవరుండెదరు? అటువంటి వారినిగూర్చి వినిన మానవులు వారికి చేతులెత్తి మ్రొక్కెదరు. 232

కం॥ జలము నెడబాయనొల్లని । జలచరముల తీవి
బూని - సచ్ఛిష్యుడు హృ - జ్జలజంబను పీఠముపై । నిలిపి
తరముమాని గురువు - నేగొల్చుసుమ్మి * తసుత్తల - నే
తలచునమ్మి * కలకాల మీరీతి - గడపుచు నే ప్రొద్దు ।
తలిదండ్రి దారజాత - దైవమనుచు గురువు । నేగొల్చు
సుమ్మి * తసుత్తల - నే తలచునమ్మి * 233

భా॥ జలమునందు చరించెడి చేపలు మొదలగు జలజంతువులు జలమును విడిచిపెట్టని విధమున, సచ్ఛిష్యు డిది వఱకు తాను పూజించుచుండిన యితర దేవుళ్ల నందఱిని విడిచి పెట్టి తనకు పరిపూర్ణ జ్ఞానము నుపదేశించిన సద్గురు సార్వభౌముని తన హృదయ కమలమనెడి పీఠముపై నిలిపి, యతడే తల్లియు, దండ్రియు, దారయు, దాతయు, దైవమునని నమ్మి నిరంతరమతనినే కొలుచుచు, నతడు చెప్పిన పరిపూర్ణబోధను, నాబోధ దృఢపడుటకు చెప్పిన యుపమానములను మాత్రమే స్మరియించు చుండును. 233

కం॥ సతి పొరుగూరికి బోయిన । పతిరాకడ గోరు
నట్లు - భావములోనఁ । మతిమంతుఁడు సచ్ఛిష్యుఁడు । స
తతము గురురాకగోరు - సత్యమువినరా * వానితోటి -
సాటెవ్వరనరా * హితునిరాకడను స్నే - హితుడుగోరిన
యట్టు । లతిదరిద్రుఁడు ద్రవ్య - తతిని గోరినయట్లు । స
త్యము వినరా * వానిసాటి - సాటెవ్వరనరా * 234

భా॥ పతివ్రతయైన స్త్రీ తన మనస్సులో పొరుగూరికి
పోయిన తనభర్తయొక్క రాకడనే నిరంతరము కోరుచుండు
నట్లును, అన్యోన్యాను రాగములుగల స్నేహితులు దూర
ప్రదేశము నందున్న స్నేహితుని రాకడను గోరుచుండు
నట్లును, అతిదరిద్రుఁడైనవాఁడు నిరంతరము ద్రవ్యమునే రా
గోరుచుండు నట్లును, బుద్ధిమంతుఁడైన సచ్ఛిష్యుఁడు నిరంత
రము సద్గురుని రాకనే గోరుచుండును. ఇది సత్యము. వీనితో
స్త్రీప్రపంచమున గల మానవులెవరును సమానులుకారు. 234

కం॥ అతివల రతిచతురతలా । యతివలచే వారితం
బ్రు - లరయ రనుచు త । ద్వతులరయరె రతినప్లనె । మతి
మంతుడు గురుడుబోధ మానినగాని * తద్బోధతా - మాన
డు పూని * అతిదరిద్రునిచే వి - ద్యార్జించి నతగాడు ।
చదువుపడై వి త్తమా - ర్జనసేయుచుండుటె । మానినగాని *
తద్బోధతా మానడు పూని * 235

భా॥ స్త్రీలయొక్క రతిచాతుర్యము లా స్త్రీలవలన

వారి తంత్రములు తెలిసికొనరుగాని, యా స్త్రీల భర్తలు వారి రతి చతురత్వములను చక్కగా తెలిసికొందురు. అట్లే బుద్ధిమంతుడైన శిష్యునకు గురుబోధను సంపూర్ణముగా పొందిన పిదప నతనికి గురువుబోధ చేయుటను మానివేసినప్పటికిని తానా బోధను మానక యితరులకు బోధించుచునే యుండునుగాని దానినతడు విడిచిపెట్టడు. ఆతని బోధయొక్క చతురత్వము లాతని శిష్యులెఱుంగుచుందురు. మఱియు అతిదరిద్రుడైన గురునివలన విద్య నభ్యసించినవాడు తన విద్యాభ్యాసము పూర్తియైన పిదప తనగురువు ధనము సంపాదింపక పోయినను తాను పెద్ద యుద్యోగమును సంపాదించి, చతురత్వముతో ధనమును సంపాదించునుగాని, తనగురునివలె సంపాదనను మాని యుండడు. అట్లే బుద్ధిమంతుడగు శిష్యుడు తనకు సద్గురువు పరిపూర్ణ భావమును సంపూర్తిగా తెలిపినపిదప గురువు బోధించుట మానివేసినప్పటికిని పరిపూర్ణుడైన శిష్యుడు బోధించుటను మానడు. 235

కం॥ పరిపూర్ణబోధ తెలిపే । పరియంతము సేవజేసి - బహునమ్రికగా । గురుమూర్తికి తరువాతను । మరి కన్నుల గననివాని - మార్గముచీచీ * తలచరాదా - మాట చీ చీ చీ * గురువాజ్ఞ యివని దె - గురువై శిష్యులగూర్చి । గురుబోధ దెల్పేటి - గురువంచకుని యొక్క । మార్గము చీచీ * తలచరాదా - మాట చీ చీ చీ * 236

తా॥ పూర్వ మొకగురువు బహుధనమును సంపాదించి,

యాధనమును సువర్ణనాణెములుగా మార్చి తన బొంతలో పెట్టి కుట్టియుంచెను. ఈ రహస్యము నెరిగిన యాషాఢభూతి యను మోసగాడొక డా గురునియొద్ద శిష్యుడుగా జేరి, యతి పాపభీతి గలవానివలె నటించుచు, గురువును నమ్మించుచుండెను. ఒకనాడొక గృహస్థు డా గురుశిష్యుల కిరువురకు భిక్ష నిడెను. ఆ గృహస్థునింటిలో గురుశిష్యులిద్దఱు భుజించి, వారి యొద్ద సెలవు తీసికొని పోవుచుండిరి. కొంతదూరము పోయిన తరువాత శిష్యుడు తనబట్టకు గ్రుచ్చుకొనియున్న చీపురు ముల్లును జూచి, గురువుగారితో, అయ్యో ! నేడు నేను మహాపాపము చేసితిని. మనకు భిక్షనిచ్చిన గృహస్థుని యింటినుండి యీ చీపురుముల్లు నాబట్టకు గ్రుచ్చుకొని మనతో వచ్చినది. అగ్నిని తెలిసి తాకినను, తెలియక ముట్టుకొనినను నది కాల్చివేయునుగదా ! అట్లే దొంగతనము తెలిసిచేసినను, తెలియక చేసినను నాపాపఫలము మనలను కాల్చివేయును. కావున నే నీ చీపురుముల్లును భద్రముగా తీసికొనివెళ్లి యా గృహస్థున కొప్పగించి వత్తునని గురునియొద్ద సెలవుతీసికొనిపోయి, దాని నెచ్చటనో పాఱవైచి. కొంతసేపటికి గురునియొద్దకువచ్చి, స్వామీ ! ఇప్పటికి మనము కృతార్థులమైతిమి. చోరత్వ దోషము నివృత్తియైనదని చెప్పెను. ఆమాటల కా యమాయక గురువు, ఇతడు నిజముగా పాపభీతి గలవాడని నమ్మియుండెను. ఒకనాడతడు బహిశ్శంకకు వెళ్ళవలసి వచ్చుటచే శిష్యున కాబొంత నప్పగించి, నీవీ చెట్టుక్రింద కూర్చుండుము. నేనా యేటియొద్దకువెళ్లి, బహిశ్శంక తీర్చుకొని, స్నానముచేసి వ

చ్చెదనని చెప్పి యతఁడేటికైనపురకు వెళ్లెను. అప్పుడు శిష్యు డిక నాపాచిక బాగుగా పారినదని సంతోషించి యతఁడా సువర్ణ నాణెములున్న బొంతతో పలాయనము చిత్తగించెను. అదేవిధముగ ఆషాఢభూతులవంటి శిష్యులు కొందఱు సద్గురువును జేరి పరిపూర్ణ బోధ తెలుసుకొనుటకు వినయభయభక్తి శ్రద్ధలు గలిగిన శిష్యులవలె నటించుచు, వారికి చాలావిధ శుశ్రూషలు చేయుచు వారిని బాగుగానమ్మించి, పరిపూర్ణబోధను పొందిన పిదప నాగురువును కన్నెత్తియైనను చూడరు. అట్టి వారు బహునీచులు. వారిమార్గము నీచమైనది. ఛీఛీ వారి మాటకూడ తలంచరాదు. మఱియు తమకు సద్గురుమూర్తి శిష్యులకు బోధించుమని యాజ్ఞ నీయకుండగనే తామే స్వయముగా గురువులై కొందఱు శిష్యులను జేర్చుకొని, వారికి గురుబోధను చెప్పెడి గురు వంచకులు నీచాతినీచులు. వారి మార్గము నీచాతినీచమైనది. ఛీఛీ వారిని మాటమాత్రముగానైన తలంచరాదు. ఈ యిరుతెగల నీచులు భ్రష్టులు కావున వీరినిజేరిన వారుకూడ భ్రష్టులగుదురు. ఈ భ్రష్టులకు నరక కమేగతి. 236

కం॥ తనశిష్యుఁడు వినిరనునటి । వినయంబున గొ
లుచు కొరకు - వినుము లొనర్చుఁ । తనగురువును గుఱు
డింటికి । జనుదెంచిన జూచి శుశ్రూ - ష నొనర్పకుండు*
లేమినిదెల్పి - చనుమనుచుండు * వినుముకుచ్చితశిష్యా -
గ్రణి వీడువీడెల్లు । మనబోధో కస్థితి - గనునో గురువను

శుశ్రూ । ష నొనర్పనుంకు* లేమిని చెల్పి-చనుచునుచుండు*

భా॥ తనశిష్యులు తన్ను గొప్పగా గౌరవించి, వినయముతో సేవించుటకొఱకు తనగురువు సమీపమునలేని సమయమున నతడు తనశిష్యులయొద్ద తనగురువును గొప్పగా స్తుతించుచు, తాను తనగురువు నెంతగనో పూజించి సేవించియున్నట్లు చెప్పుచుండును. తనగురువు తన్ను జూచుటకొఱకు తన యింటికి వచ్చినప్పు డతని కే శుశ్రూషలు చేయకపోగా మీరిప్పు డెందులకు వచ్చితిరి. ఈ ప్రాంతములో వర్షములు సరిగా కురియక పంటలు సరిగాపండలేదు. వ్యాపారముకూడ సరిగా సాగుటలేదు. మీ కేమైన నీయవలెనంటె నాయొద్దనిప్పు డేమియు లేదని చెప్పుచుండును. ఇటువంటి కుత్సితబుద్ధిగల శిష్యుడు గొప్పదియైన పరిపూర్ణ బోధనెట్లు పొందగలడు? 237

కం॥ కుటిలాత్ము డైన శిష్యుం । డిటువలె తాబలుకు గురుడు - నింటికివస్తే । ఎటుబోవుచుండివస్తిరో । యిటకికదర్శనము మరల - నెప్పుడయ్యేనో * యెవరికి దెలియు-నెప్పుడేమౌనో * ఎటుదోచదేమైన - నిత్తామంచనుకొంటె-తటుకున నొకరాగి - దుడ్డైన లేదిప్పు । డెప్పుడయ్యేనో * ఎవరికి దెలియు - నెప్పుడేమౌనో * 238

భా॥ సద్గురుమూర్తి తనయింటికి వచ్చినప్పుడు కుటిలబుద్ధిగల శిష్యుడు చూచి, యీరోజున నతడు తన యింటి యొద్ద నుండునేమో! యతనిని వెంటనే సాగనంప వలయునని తలంచి, అయ్యా! మీరిప్పు డెచ్చటనుండి వచ్చుచుంటిరి ?

ఎచ్చటికి వెళ్లుచుంటిరి? మరల మీదర్శనము నాకెప్పుడగును? ఎప్పుడేది యెట్లుజరుగునో యెవరికిని తెలియదుగదా! మీరె చ్చటికో ప్రయాణము పెట్టుకొని పోవుచు నన్ను చూచిపోవుట కిట్లు వచ్చినట్లు తోచుచున్నది. ఒకరోజు మిమ్మిచ్చట నిలుపు కొందమను కొన్నను నిప్పుడిచ్చటి పరిస్థితులేమియు బాగుగా లేవు. మీరకస్మాత్తుగా వచ్చివెళ్ళుచుండుటచే నేమైన దక్షిణ గా సమర్పించు కొందమనుకొన్నను ఇప్పుడు నాచేతిలో నొక రాగిపైసయైనను లేదు. ఎప్పుడెవరికేది ప్రాప్తమగునో యెవరికి తెలియరాదుగదా! యనిచెప్పి యతనిని వచ్చినదారినే తిరిగి సాగనంపును. ఇట్టి కుటిలాత్మునకు పరిపూర్ణబోధ యెట్లు పట్ట గలదు? 238

కం॥ జపములు తపములు సయుపును । విపరీతస్మర ణజేయు - వేదాంతార్థం । బపరిమితంబుగ జెప్పును । కప టాత్ముడు శిష్యకోటి - గని మెచ్చుకొరకు * మెచ్చిద్రవ్య- మును నిచ్చుకొరకు*అపకీర్తిచేపల - కదరినట్లగుపడి । యు పమచే బ్రదుకుచు - నుండు లోకులతన్ను । గనిమెచ్చు కొరకు * మెచ్చిద్రవ్య - మును నిచ్చుకొరకు * 239

భా॥ కపటాత్ములైన గురువులు కొందఱు తమశిష్యు లు తమ్ముజూచి వీరు చాలగొప్పవారని మెచ్చుకొని, తమకు విపరీతమైన ధనమునిచ్చుట కొఱకు బ్రాహ్మీ ముహూర్తమున నే లేచి స్నానసంధ్యాదుల నొనర్చి తులసీరుద్రాక్షాది మాల లను చేతబట్టుకొని, జపములు చేయుచుందురు. మఱికొందఱు

కాయక వాచకమానసికాది తపములొనర్చుచుందురు. ఇంక కొందరు భగవంతుని నామమును విపరీతముగ స్మరియించుచుందురు. వేరు కొందరు వేదికలపై కెక్కి వేదాంతార్థము నపరిమితముగ నుపన్యసించుచుందురు. వీరందరు తమశిష్యుల దగ్గర చెడ్డపనుల కదిరిపడునట్లు కనబడుదురు. ఈవిధముగా కపటాత్ములగు గురువులు నానావిధములైన పాట్లుబడుచు, నుపాయముగా ద్రవ్యమును సంపాదించుచుందురు. 239

కం॥ గురుమూర్తి కెదురహంకృతి । దొరకొన్నను
దొంగత్రోవ - త్రొక్కిన చెవులన్ । గురునింద వినిన
చేసిన । నరునకు పరిపూర్ణబోధ - నలవియే తెలియ * కూ
డదు వాన్ని - తెలియకకలియ * గురుడు తెల్పునిదే పు -
స్తకరీతిచే పూర్ణ । మరసితినని యెంతో - మురిసిన నీబో
ధ । నలవియే తెలియ * కూడదువాన్ని - తెలియకకలియ *

భా॥ సద్గురుమూర్తి యెదుట దురహంకారముగా మాటలాడు వారికిని, గురునకు కనిపించక దొంగత్రోవల దిరుగుచు, దొంగగురువుల బోధలను వినువారికిని, ఇతరులు తనగురువును నిందించుచుండినచో దానిని చెవియొగ్గి వినువారికిని, గురుని స్వయముగా నిందించువారికిని, పరిపూర్ణబోధ యెన్నటికిని తెలియజాలదు. ఇటువంటి ధూర్తుల హృదయములను తెలిసికొని వారితో స్నేహమెన్నటికిని చేయరాదు. సద్గురుమూర్తి తనకుపరిపూర్ణబోధను తెలుపకయే తానుస్వయముగా యచల గ్రంథములనుజదివి, నేనును పరిపూర్ణబోధనెఱింగితినని యెంత

మురిసినను నీపరిపూర్ణ బోధ నెఱుంగుట యెంతవారికిని సాధ్య పడదు. 240

కం॥ నాలుగుశుశ్రూషణములు । లోలతగావించు కొనుచు - లోకాతీతం । బాలోకించియు గురునిచే । నీలోక ముఁగోలి వినుపు - మింతేచాలన్నా * నీతోగూడ - నిది మరువకన్నా * కీలుదెలియని చదువు - చాలా చదివెందుకు । వాలించి నీవిట్టి - కీలుదెలిసితివేని । యింతేచాలన్నా * నీతో గూడ - నిది మరువకన్నా * 241

భా॥ సద్గురు మూర్తి నివసించెడి యాశ్రమమునుగాని, గృహమునుగాని నిత్యమునూడ్చి పరిశుభ్రపఱచుట, నలంక రించుట, ఫలపుష్పపత్రాదుల నిచ్చు వృక్షములను పెంచుట మొదలగు కార్యములను జేయుట స్థానశుశ్రూష. సద్గురుమూర్తికి స్నానము చేయించుట, షడ్రసయుక్తమగు భోజనఫలాహార పానీయాదుల నిచ్చుట, మృదువగు శయ్యాసనాదులను సమకూర్చుట, పాదము లొత్తుట మొదలగు పనులు చేయుట అంగశుశ్రూష. సద్గురుమూర్తికే వేళ కేది కావలసియుండునో, యెప్పటి కప్పుడు వారిమనోభావములను గుర్తించి, వానినిసమ కూర్చుట భావశుశ్రూష. సద్గురుమూర్తి బోధించిన దానిని మఱువక, నిరంతరము హృదయమున ధరించి చింతించుచుం డుట ఆత్మశుశ్రూష. శ్రీ సద్గురుమూర్తి కీ నాలుగు శుశ్రూషలు నిరంతరము చేయుచు నామరూప నటనలుగా తోచు చున్న ప్రపంచమున కతీతమై స్వతస్సిద్ధముగ నిండియుండిన

అచలపరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికి నెఱింగి, సద్గురుమూర్తి కరుణచే నామరూప నటనలుగా తోచుచున్న నీప్రపంచమును, దీని నెఱుగుచు "నేను నేను" అని యహంకరించుచున్న నెఱుకను విడిచిపెట్టిన చాలును. దీనిని నీవు మఱువవద్దు. సద్గురుమూర్తి వలన నీ కీలు నెఱుంగజాలక యెన్ని చదువులు చదివినను ప్రయోజనము లేదు. కావున నీ చా చదువుల నన్నింటిని చాలించి, సద్గురుమూర్తి వలన నీ కీలును తెలిసి కొనుము. ఇతర చదువులతో పనిలేదు. 241

కం॥ దేహమని చరణతీర్థము । కాశీగంగయని గురుని - గనుగొన్నను వి । శ్వేశుడని యతడు తనకుప । దేశం బొనరించినట్టి - దే తారకమని * మనసందుతా - నీ తీరునగని * యే సీమయందున్న - కాశీప్రయాగరా । మే శుని స్థిరమై ప్ర - కాశించు నాసీమ । దే తారకమని * మనసంధుతా - నీతీరునగని * 242

భా॥ లోకములో మానవులు కాశీలోని గంగాజలమును, విశ్వేశ్వరస్వామిని, రామతారక మహామంత్రమును, మహాగొప్పవిగా భావించుచున్నట్లు, ఉత్తములైన సద్గురుపుత్రుడు శ్రీ సద్గురుస్వామి పాదప్రక్షాళనము చేసిన జలమును కాశీలోనున్న పవిత్రగంగాజలముకంటెను, శ్రీ సద్గురు సార్వభౌముని విశ్వేశ్వరునికంటెను, సద్గురుమూర్తి తనకుపదేశించిన మంత్రమును శ్రీరామతారకమహామంత్రముకంటెను నతి పవిత్రములైనవని మనస్సులో భావింపవలయును. మఱియు

ప్రపంచమునగల పుణ్యక్షేత్రములలో కాశీప్రయాగ రామేశ్వరము నుత్తమ పుణ్యక్షేత్రములుగా లోకులు భావించుచున్నట్లు, ఉత్తముడైన సద్గురు పుత్రుడు సద్గురుమూర్తి నివసించు ప్రదేశము నా యుత్తమ పుణ్యక్షేత్రములకంటెకూడ సత్యోత్తమ పవిత్రక్షేత్రముగా భావింపవలయును. 242

కం॥ గురుచరణజలము గోదా । వరియని గురుమూర్తిరామ - భద్రుండని త । త్పురమును భద్రాచలమని। గురుమంత్రమె తారకమని - గురిగల్గినట్టి * తిరిగిరాని - మరుగెరిగినట్టి * నరుడున్నచోటె సుం - దరశేషగిరిభద్ర । గిరి రంగనాయక - పురమనదగియుండు । గురిగల్గినట్టి * తిరిగిరాని - మరుగెరిగినట్టి * 243

భా॥ గురుదేవుని పాదప్రక్షాళన జలమును గోదావరీ జలముకంటెను, గురుమూర్తిని శ్రీరామచంద్రునికంటెను, గురుడు నివసించెడు ప్రదేశమును భద్రాచలముకంటెను, గురు మంత్రమును శ్రీరామతారకమహామంత్రముకంటెను, నతిపవిత్రములని తలంచి, సద్గురుమూర్తియందు లక్ష్యముంచి, యతని వలన జననమరణ రూపసంసార సముద్రమునుదాటించెడి పరిపూర్ణ భావము నెఱింగిన మహానుభావుడున్న ప్రదేశమే శేషాద్రి, భద్రాద్రి, శ్రీరంగము మొదలగు సమస్త దివ్యక్షేత్రములకంటెను గొప్పదియగు పవిత్రపుణ్యక్షేత్రమై విరాజిల్లును.

కం॥ గురుడునరుడనుచు దలచిన । గురుమంత్రము మరచియున్న - గురుపుత్రుల నా । దరణ యొనర్చకయుం

డిన । గురువును విడనాడి యింకో - గురుని జేరినను *
సద్గురుబోధ - నెరిగి దూరినను * నెరుకమహాత్మ్యము -
నెరిగిన యిటువంటి । నరునకు తప్పదు - నరకము నిజమిం
కో । గురుని జేరినను * సద్గురుబోధ - నెరిగిదూరినను *

భా॥ తనకు నచల పరిపూర్ణభావము నెఱిగించిన సద్గురు సార్వభౌముని సామాన్య మానవుడని తలంచినవానికిని, గురు మంత్రమునుగాని, గురువు బోధించిన యచలపరిపూర్ణ భావమునుగాని, మఱచిపోయిన వానికిని, గురుపుత్రులు కనిపించినప్పుడుగాని, తనయింటికి వచ్చినప్పుడుగాని వారినాదరింపక నిర్లక్ష్యము చేయువానికిని, సర్వసమర్థుడైన సద్గురునితో వైరమూనిగాని, దోషమెంచిగాని, చపలచిత్తముతోగాని, వారిని విడిచిపెట్టి మఱియొక గురువును జేరినవానికిని, సద్గురువు బోధించిన యచలపరిపూర్ణబోధను వినియు, దాని గొప్పదనము నెఱుంగజాలక దూషించిన వానికిని, పరిపూర్ణభావము నెఱింగియు నెఱుకలోని మహిమలనుగాంచి భ్రమనొంది, వానిని ప్రశంసించు వానికిని నరకము తప్పదని తెలియుము. 244

కం॥ జ్ఞానవైరాగ్య భక్త్యస । మానసదీస్నానదే
వ - మంత్రపఠన త । ధ్యానముఖతంత్రములు పర । మౌ
న నియతిగోరునట్టి - మనుజసంఘముకు * బోధను దె
ల్పు - మనినవారలకు * తానుబోధించుట - తగదు బోధిం
చితే । తానునేనను భ్రాంతి - తలగేదేలా గట్టి । మనుజ
సంఘముకు * బోధనుదెల్పు - మనినవారలకు * 245

భా॥ ప్రత్యగభిన్న పరబ్రహ్మబోధక జ్ఞానమార్గమునం దు వర్తించువారుగాని, సతీసుతులాది సమస్త సంసారమును విడిచిపెట్టి, యతమానము, నేకేంద్రియము మొదలగు నపరా వైరాగ్యమును బూనువారుగాని, శ్రవణ కీర్తనాది నవవిధభక్తి మార్గములయందు వర్తించువారుగాని, పుణ్యప్రదములని తలంచి యసమానములైన గంగాయమున సరస్వతి నర్మదాది నదులలో స్నానములు చేయువారుగాని, వివిధములగు దేవతా మంత్రములను నోటితో జపించుచుండెడివారుగాని, ఆ మంత్రాధిష్ఠాన దేవతలను తనహృదయమున బ్రతిష్ఠించుకొని, మనస్సు నచ్చట నిలిపి ధ్యానించువారుగాని, యజ్ఞయాగాది క్రతువు లొనర్చువారుగాని, తంత్రశాస్త్రములలో చెప్పబడిన తంత్రములయందు వర్తించువారుగాని, దేహమును, ఇంద్రియములను, మనస్సును నిగ్రహించి, కాష్ఠమౌనము, వాఙ్మౌనము, మనోమౌనము మొదలగు నియమములను బూనువారుగాని, పరిపూర్ణబోధను తెలుపుడని తనయొద్దకు వచ్చినప్పటికిని భ్రాంతులగు నాపామరుల కచల పరిపూర్ణ భావమును బోధించరాదు. ఒకవేళ దయదలచి వారికి పూర్ణ బోధను దెలిపి నప్పటికిని నా భ్రాంతులకు "నేను వేఱు, నీవు వేఱు" అనుభ్రాంతి తొలగి పోనేరదు. 245

కం॥ ఇంగితమునెరిగి సద్గురు । పుంగవుచే నరుడు భుక్తి - ముక్తిక్రియలణా । సంగాసంగము లెడలిన । శృంగారమె వానిచేష్ట - చూచేవారలకు * వాడున్నట్లు - తోచే

వారలును * మంగళసూత్రమే - భంగిశృంగారమౌ । శృం
గారవతికి న - శృంగారవతి రట్లు । మాచేవారలును * వాను
న్నట్లు - లోచేవారలును * 246

భా॥ పరిపూర్ణస్థితి కలిగిన వివేకి భుక్తికొఱకు కృషి
వాణిజ్యాది లౌకిక కర్మములను, ముక్తికొఱకు నిత్యనైమిత్తి
కాది వైదికకర్మములను లోకులవలె చేయుచున్నప్పటికి, నత
డు సద్గురునిచే కర్మములను చేసెడికర్త, చేయబడుకర్మములు,
వానిఫలములు మిథ్యయని యెఱింగినవాడగుటచే, నవి సత్య
ములను బుద్ధితో వానియందాసక్తిని జూపడు. మిథ్య యను
దృష్టితో వానిని విడిచి పెట్టడు. వానియందు సంగాసంగము
లు లేనివాడై లోకులవలె చేయుచుండును. కావున నతడు
చేయుకార్యము లమంగళకరములు కానేరవు. పామరుడీ మి
థ్యా సంసారమును సత్యముగా తలంచి, భుక్తికొఱకు కృషి
వాణిజ్యాది లౌకిక కర్మములను, ముక్తికొఱకు నిత్యనైమిత్తి
కాదివైదికకర్మములనుసత్యంతాసక్తితో చేయుచున్నాడు. లేక
యివియన్నియు బంధములని తలంచి వానిని విడుచుచున్నాడు.
ఇట్లాసక్తితో చేయుట, విడుచుటలు రెండును మిథ్య యగుట
చే నవి యమంగళకరములు. మంగళసూత్రము కలిగియున్న
చో సౌందర్యముగల స్త్రీగాని, సౌందర్యములేని స్త్రీగాని
శృంగారముగా కనిపింతురు. మంగళసూత్రము లేనిచో వా
రిరువురు శృంగారముగా కనిపింపరు. అట్లే పూర్ణబోధను పొం
దినవాడు సంసారమునందున్నను, సంసారమును విడిచినను

వారిచేష్టలు మంగళకరమగు పూర్ణ స్థితిని కలిగించును. పూర్ణ బోధను పొందనివారు సంసారముతందున్నను, సంసారమును విడిచినను వారిచేష్టలమంగళకరమగు సంసారస్థితినికలిగించును.

కం॥ జనులందరు గురుబోధను । గని రాజనులంయు నేను - గలియకయున్న । ననుమన్నింతురె వారని । మనసున దలపోస్తె బోధ - మర్మమబ్బునా * అబ్బినవారి - ధర్మమబ్బునా * జననమరణములేని - ఘనమైనత్రోవనే । గననై తినని బోధ - గనకున్న నీబోధ । మర్మమబ్బునా * అబ్బినవారి - ధర్మమబ్బునా * 247

భా॥ గ్రామములోని వారందఱు గురుబోధను పొంది రొయొక సంఘముగానున్నారు. నేనుకూడ నుపదేశమును పొంది యాకోటిలో చేరకపోయినచో, వారునన్ను మన్నింపక, చుల కనగా జూచెదరను నుద్దేశముతో, నుపదేశమై యీ సంఘము లో జేరినంతమాత్రమున నాపూర్ణ బోధయొక్క మర్మము తెలియబడదు. ఒకవేళ చిరకాల మాపూర్ణభావజ్ఞుల సాంగత్య ముచే నాబోధను తెలిసికొనినను, పూర్ణస్థితి కలిగియున్న మహా త్ముల ధర్మ్మములవడదు. జననమరణములను బోగొట్టెడి యచ ల బోధ నెఱుగవలయున నెడి యాసక్తితో, పూర్ణగురుసార్వ భౌము నాశ్రయించి వారివలన పూర్ణబోధను పొందినవారికే యీబోధయొక్క మర్మము తెలియును. వారికే పూర్ణస్థితియం దున్న మహాత్ముల ధర్మము పట్టుబడును. 247

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ

నిర్గుణతత్త్వ కందార్థదరువులందుండు శిష్యలక్షణమను పంచదశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురుమహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థదీపికాసహితము.

## 16. గురుశిష్యోభయ లక్షణము

కం॥ హృదయగ్రంథి విముక్తై । సదయత నీ బో
ధదెల్ప - జనవాగురుడై । వదలక చిత్తము కో. గురు । పద
యుగళము దలపవలదె - భక్తుడైనపుడు * భ్రాంతిరహి
తా - సక్తుడైనపుడు * కుదురవివి రెండును - గురుశిష్యు
లకు గాక । కదలికలేనట్టి - ఘనబోధోత్కస్థితి । భక్తుడై
నపుడు * భ్రాంతిరహితా - సక్తుడైనపుడు * 248

భా॥ సద్గురుమూర్తి దయతో శిష్యుని హృదయగ్రంథి విడిపోవుటకొఱకు పరిపూర్ణబోధను తెలుపవలయును. భ్రాంతిరహితము కావలయునని కోరెడి ప్రపన్నుడైన సచ్ఛిష్యుడు సద్గురుమూర్తి పాదపద్మములను తన హృదయకమలమున నిలిపి, నిరంతరము ధ్యానించుచుండ వలయును. ఇవి రెండును నుత్తములైన గురుశిష్యులకే కుదురునుగాని, యితరులకు కుదరవు. ఇవి రెండును కుదిరినప్పుడే శిష్యుడచల పరిపూర్ణస్థితిని పొందగలడు. 248

కం॥ గురుడాస వదలకుండిన । మరిశిష్యుడు ద్రవ్య

లోభ - మున్నందైనన్ । మరియాప దక్కదిరువుర । తె
రిగుండుము వీరలతి వి - హీనులోయన్నా * గట్టిగదుర
భి - మానులోయన్నా * గురుకు శిష్యుని కన్న - కొడు
కుగగనకున్న । గురునిపై శిష్యుడా - గురినిల్పకుండిన ।
హీనులోయన్నా * గట్టిగదురభి - మానులోయన్నా * 249

భా॥ గురుడాశచే చూచినదంతయు కావలయునని కోరుచుండినను, శిష్యుడు పరమలోభియై నాయొద్ద నేమియు లేదని చెప్పుచుండినను, వారిరువురి మర్యాదదక్కదు. వీరిద్దఱు దురభిమాన పిశాచగ్రస్తులగుటచే, వీరిని లోకు లతివిహీనులుగా జూతురు. సద్గురువు శిష్యుని పుత్రవాత్సల్యముతో జూచుకొనవలయును. శిష్యుడా గురునియందు వినయభయభక్తిశ్రద్ధలు గలవాడై వర్తింపవలయును. అప్పుడే వారిద్దఱి మర్యాద దక్కును. 249

కం॥ గురుగురుశోధల చేతను । పరిపూర్ణమునెరిగి
యెరుక - బాసిన యతనిన్ । గురుతెరుగ నౌరులశక్యమె ।
యెరిగిన నరులిట్టి బోధ - నెరిగేరోయన్నా * వారెరుగని -
మరుగుండదన్నా * చిరుత పాపనిరీతి - మరిపిశాచము
భాతి । తిరుగుచునుండు వె - ర్రిపురుషాకృతి గురుడెట్టు ।
తెలిగేరోయన్నా * వారెరుగని - మరుగుండదన్నా * 250

భా॥ సద్గురుమూర్తి బోధించెడి గొప్పదియగు పరిపూర్ణ బోధవలన స్వతస్సిద్ధమై నిండియున్న యచల పరిపూర్ణ

బ్రహ్మమునెుక్క యునికి నెఱింగి, మూలము లేకయే నామ రూపనటనలుగా దోచుచున్న నెఱుక భ్రాంతినివీడి సంచరించువారి నితరులు గుర్తెఱుగ జాలరు. వారిస్థితిని పరిపూర్ణ బోధ నెఱింగిన బుద్ధిమంతులే యెఱుగగలరు. వారికి తెలియని రహస్య మేమియు నుండదు. వాసనా రహితముగా నెఱుకను విడిచి, పరిపూర్ణస్థితియందున్న మహానుభావులు బాలోన్మత్త పిశాచములవలె, 'విధినిషేధ రహితులై' యూను కాదనక సహజ సమరసభావముతో వర్తించుచుందురు. (59)

కం॥ మలయాద్రిచెంత చెంచుల । కిలచందన భూ
రుహములె - యింధనమట మి । క్కిలిగయుగ బట్టి యట్టు
లె । చులకనసుమి యింటగలుగు - సూరిభూషణుడు *
బహుమాన్యుడు - దూరస్థుడెప్పుడు * తెలియని వారికి - తె
లిపేది కఠినము । తెలివిచే దెలిసితే - తెలియజేయును బో
ధ । సూరిభూషణుడు * బహుమాన్యుడు - దూరస్థుడెప్పుడు *

భా॥ మలయపర్వతమునందు మంచిగంధపుచెట్లు విస్తారముగా నుండుటచే, నచ్చట నివసించెడి చెంచులు మొదలగు నాటవికులు వానివిలువను తెలియజాలక, మంచిగంధపుచెట్లనే నఱికి, వంటచెఱుకుగా నుపయోగించుకొనెదరు. అదేవిధముగ నిరంతరము తనసమీపమునందు వర్తించుచున్న పూర్ణగురు సార్వభౌముని గొప్పదనమును తెలియజాలక, పామరులు వారి నలక్ష్యముగా జూచెదరు. దూరమునందుండి వచ్చినవాడు ఎటువంటి వాడైనను, ఏమియు తెలియని వాడైనను వానిని గొ

ప్పగా గౌరవించెదరు. అజ్ఞానులు వారియొక్క తారతమ్యము నరయ జాలరు. అటువంటి మూర్ఖులకు మనసమీపమునం దున్న మహాత్ముడు చాల గొప్పవాడని తెలియ జెప్పుటచాల కష్టము. వారికి పరిపూర్ణమును బోధించుటయును కష్టమే. 251

కం॥ దూరమునసుండి విన్నను । చేరును సజ్జనుడు
గురుని - చెంతకు బోధకై । గోరి దుర్జనుడు గోరడు । దూ
రస్థుడుగాక గురుని - తో గూడియుండి * యెట్లని య
న్న - దూరానసుండి * కోరితుమ్మెద తమ్మి - జేరి తేని
యగ్రోలు । నాకిరినెరుగవు - చేరికప్పలు తమ్మి । తోగూ
డియుండి * యెట్లనియన్న - దూరానసుండి * 252

భా॥ ఎంతదూర ప్రదేశమునందుండినను, తుమ్మెద తామర కమలముయొక్క సుగంధమును గుర్తెరిగి, దాని దరికి జేరి, యా తామరకమలముపై వ్రాలి, దానియందున్న మధువును తృప్తిగా గ్రోలుచున్నది. కప్పలు నిరంతర మా తామర కమలముపై తిరుగులాడుచున్నను, దానియందున్న మధువును గ్రోలజాలవు. అదేవిధముగా సజ్జనుడు సద్గురువుయొక్క గొప్పదనమును విని యతడెంత దూరప్రదేశమునందు నివసించుచున్నను, వారి సమీపమునకేగి, వారికి శరణాగతుడై, చతుర్విధ సుశ్రూష లాచరించి, వారివలన పరిపూర్ణబోధను పొందుచున్నాడు. దుర్జనుడు నిరంతరము సద్గురు సార్వభౌముని సమీపమునందుండినను నా సద్గురు సార్వభౌముని వలన పరిపూర్ణబోధను పొందజాలడు. 252

కం॥ చూచియువెదిసి శిష్యుని । యాశయముకు త
గినబోధ - నతనికి దెలియగా । జేసి ముదమొందజేసెడి ।
దేశికుడే ముఖ్యుడనుచు - తెలిసికోవోయి * కని యతనిని -
కలిసికోవోయి * చేసేను దయతో నీ - యాసనంపూ ర్తిట్లు ।
వ్రాసివేసికొనిన - చూచేవు తార్కాణ । తెలిసికోవోయి *
కని యతనిని - కలిసికోవోయి * 253

భా॥ తనయొద్దకు జేరిన శిష్యుని మనస్సును బాగుగా దెలిసికొని, శిష్యుని యాశయమునకు తగినబోధ నతని కెఱిగించి, సంతోషింపజేసెడి సద్గురువే గురువులందఱిలో శ్రేష్ఠుడు. కావున నీ వాతనిని కలిసికొని సేవింపుము. అతడు దయతో నీవు కోరిన ప్రకారము బోధించి నీ యాశయమును దీర్చగలడు. నీ వీ మాటను వ్రాసిపెట్టుకొనినచో నీకు దీని తార్కాణ తెలియగలదు. 253

కం॥ మంతనమున గురుబోధను । నెంతో వింతను
చు నమ్మి - తింతేగద యే । వింతలుగనరావని ధా । వంత
ము నొందేటివాని - బ్రమ కెంతకంతే * చింతలులేని - గ
తిగానడింతే * అంతకంతకు వాని - కతివాద స్తమెరాని ।
సంతకూటముతోడ - సంతోషించెడివాని । బ్రదుకెంత కం
తే * చింతలులేని - గతిగానడింతే * 254

భా॥ హంసలు మానససరోవరమునందుండి జాతిరత్నములను భక్షించుచుండును. కొంగలు సామాన్యమైన మడు

గుల చెంతజేరి నత్తలు, పీతలు, చేపలు, కప్పలు మొదలగు వానిని దినుచుండును. ఒకనాడు కొన్ని హంసలు విహారార్థమై యాకాశ మార్గమున నేగుచుండగా, మడుగునొద్దజేరి నత్తలు, పీతలు, చేపలు, కప్పలు మొదలగు వానిని తినుచున్న కొంగలు వానినిజూచి, యివియు మనజాతి పక్షులవలె నున్నవని తలంచి, వానిని సగౌరవముగా నాహ్వానించినవి. హంసలు వాని యాహ్వానము నంగీకరించి క్రిందికిదిగివచ్చి, యామడుగు నొద్ద వ్రాలినవి. వానినిజూచి కొంగలు ఓహో! మీరు మా జాతిపక్షులవలె నున్నారే! మీ నివాసము లెక్కడ? అని యడిగెను. అందులకాహంసలు మానససరోవరము మానివాస స్థలమని చెప్పినవి. అచ్చట మీ కాహారమేమని కొంగ లడిగి నవి. హంసలు నేనచ్చట జాతిరత్నములను భక్షింతుమని చెప్పినవి. అందులకు కొంగలు మీ కచ్చట నత్తలు, పీతలు, చేపలు, కప్పలు దొరకవా? యని యడిగెను. హంసలు నే మింతవరకు వాని పేరులనైన విని యుండలేదని బదులు చెప్పి నవి. అందులకు కొంగలునవ్వి, ఇదియేనా మీ గొప్పదనము. నత్తలు, పీతలు, చేపలు, కప్పలులేని కొలనులోనా మీరుండు నది! ఇక చాలునులే మీ గొప్పతనమని హేళనచేసి సాగ నంపినవి. అట్లే చిల్లరగురువులనుజేరి, వారి చిల్లరబోధలను వినుచున్న మానవులు అచల గురుప్రోక్తమైన యచల బోధ గొప్ప దనమును గొనియాడుచుండుటనుగాంచి, దానియం దెన్నియో విచిత్రము లుండునని తలంచి, యచల గురువుల నాశ్రయించి, యచలపరిపూర్ణబోధను పొంది, యందే విచిత్రములనుగానక,

పూర్ణబోధ యనగా నిదియేనా ? ఇందులో నాదము, బిందువు, చిత్కళలు మొదలగు విచిత్రము లేమియు గనిపించ లేదని హేళన చేయువాని బ్రదుకెంతకంతగనే యుండును. వా జే చింతలులేని పరిపూర్ణభావము నెఱుంగజాలడు. అట్టివాడు చిల్లర గురువుల నాశ్రయించి, చిల్లర బోధలను పొందుచుండిన కొలది వాని చావ స్తమంతకంతకు హెచ్చుచుండునుగాని తగ్గిపోదు. సంతలో నొకచోటికి చేరిన జనులు వారివారి పనులు ముగియగనే విడిపోయి, యెవరియిండ్లకు వారు వెళ్ళిపోవునట్లు, ప్రారబ్ధాను సారముగ సంసారమునందొకచోటికి చేరెడి స్త్రీ పుత్రమిత్ర గృహారామ క్షేత్ర ధనధాన్యాది పదార్థములను జూచి యీ పామరు లివి సత్యములనియు, సుఖసాధనము లనియు భ్రమించి, వారినిగాంచి సంతోషించుచు తుద కెవరిదారిని వారు మటుమాయమై పోవునప్పు డేడ్చుచుందురు. ఇటువంటి పామరుల బ్రదుకెంత కంతగనే యుండును. వారికి సంసార చింత లెన్నడు నశింపవు. 254

కం॥ తనగురుడోధను తాజది । విన వినుజనవి తతి ఘదికి - వింతై యీ బో । ధను నేర్వకున్న వ్యర్థము । జన నంబనితోచి శరణు - శరణనునట్లు * వెంటనేవారు - దరిజేరునట్లు * ఘనమైన యుక్తిచే - కొనుచాడె శిష్యుడు । అనుమానమేమిందు - గనరాదు వినవోయి । శరణనునట్లు * వెంటనే వారు - దరిజేరునట్లు * 255

భా॥ ఉత్తమశిష్యుడు తనగురువు తనకు బోధించిన పరి

పూర్ణ బోధయొక్క గొప్పదనమును నిరంతరము ప్రశంసించుటచేతను, పరిపూర్ణ బోధను దెలిపెడి గ్రంథములను నేస్తుగా చదివి వినిపించుటచేతను ప్రజల మనస్సులను రంజింప జేయవలెను. ఈబోధ నెఱుంగకున్న చో మనజన్మములు వ్యర్థములని వారికి తోచవలయును. వెంటనే వారు పూర్ణ గురువుల నాశ్రయించి యుద్ధరింప బడవలయునను నుద్దేశముతో వారి క నేకయుక్తులను బోధించి, పూర్ణ గురువులనుపొంది, శరణుశరణనునట్లు చేయవలయును. అట్లుచేసినచో వారిమనస్సు లాకర్షింపబడి, పూర్ణ గురువుల నాశ్రయించి, పరిపూర్ణ బోధను పొంది, జననమరణరూప సంసారప్రవాహమును దాటగలరు. ఇట్లుచేసిన వాడే నిజమైనశిష్యుడు. ఇం దనుమాన మెంతమాత్రమును లేదు. 255

కం॥ తనభార్య రూపురేఖలు । తనపుత్రుల సద్గుణములు - తనసంపదయున్ । తన పెరటిమంచి చెట్టును । తనగ్రామపు సాధుజనులు - తనకుమెప్పౌన * ఈయిలలో నెం - తటి వానికైన * వినలేదె నీవహ - ల్యనుజూచి మోహించె । ఘనవాహనుండు చ - క్కని భార్యగలిగుండి । తనకుమెప్పౌన * ఈయిలలోనెం - తటివానికైన*256

భా॥ ప్రపంచములోని మూఢమానవులు తమ భార్యలెంత చక్కనివారైనను వారిని ప్రేమింపరు. కురూపులైనను పర స్త్రీలనే ప్రేమించుచుందురు. తమబిడ్డలెంత సుగుణవంతులైనను మెచ్చుకొనరు. నిరంతరము పరులబిడ్డలనే మెచ్చు

కొనుచుండును. తనకెంత సంపదయున్నను తృప్తిపడడు. పరు లసంపదలనే శ్లాఘించుచుండును. ఎంతయమూల్యములైన మూలికలైనను తనపెరటియందున్న చో తృణీకరించును. వ్యయప్రయాసలతో దూరదేశములనుండి తెప్పించిన మూలికలు పనికిమాలినవైనను, వానిని ప్రాణప్రదముగ జూచును. అదే విధముగ పామరులు తమగ్రామమునందుడిన సద్గురువులెంత గొప్పవారైనను వారిని చులకనగా జూచును. దూరమునుండి వచ్చినవా డెటువంటి యల్పుడైనను, వానిని గొప్పగా గౌర వించును. దేవేంద్రుడు తనభార్యయైన శచీదేవి యందాలరాసి యైనను, నామెనువిడిచి నానాపాట్లుపడి, యహల్యనుపొంది నానాబాధలనుభవించినట్లు పురాణములయందు వినుచుంటిమి గదా! అట్లే యెంత గొప్పవారైనను పామరులు తమగ్రామ ములోనున్న సద్గురువులను గౌరవింపరు. దూరస్థులనే గౌర వింతురు. 256

కం॥ జతనముగ దాచి చదువుము । రతనమ్ముల హా
రమిదియు - రసికుల గళమా । యతనము దీనికినేబహు ।
యతనము గావించితెచ్చి - యిస్తిర నేడు * బోధకు బం
డో - బస్తారచూడు * రతనాలెట్లో రాళ్లు - రతనాలంచని
యుండె । రతనాలెపవ్యాలే - రసికు లెరిగెద రివి నీ । కిస్తిర
నేడు * బోధకుబండో - బస్తారచూడు * 257

భా॥ ఈశుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువుల గ్రంథమును నీవు పదిలముగా దాచుకొని నిరంతరము చదువుచుండుము.

ఈ గ్రంథములోని కందార్థదరువుల సముదాయము రత్నాల పేరతుల్యమని తెలిసికొనుము. ఇది యెల్లప్పుడు రసజ్ఞులకంఠ స్థానము నలంకరించియుండును. నేను సద్గురుదేవు నాశ్రయించి వారికి తనుధనమనములర్పించి, చతుర్విధ శుశ్రూషలు జేసి, బహుప్రయత్నముతో నచలపరిపూర్ణ బోధను బడసితిని. తరు వాత దేశదేశములు తిరిగి, యచ్చట నుత్తములగు నచలగురు శిష్యుల సంభాషణలనువిని, వానిని బాగుగా దృఢపఱచు కొంటిని. పిదప వానిని కందార్థదరువుల గ్రంథముగా రచి యించి నీ చేతికిచ్చితిని. నీవు దీనిని పదిలముగా దాచుకొని ని త్యము చదువుచున్నచో నేను నీకు చేసిన యచలపరిపూర్ణ బోధ బాగుగా దృఢపడును. ఇవి కొండరాళ్ల సమానములని వీనిని నిరాదరణ చేయకుము. ఇవి నవరత్నతుల్యములు. వీని విలువ రసజ్ఞులకు తెలియునుగాని, యరసికులగు పామరులకు తెలియదు. 257

కం॥ వినవేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలో ని - మర్మము దెలియున్ । వినజెప్పనేరకుండిన । మను జులు నీబోధలోని - మర్మమెరిగేరా ✱ దీనందుండే - ధర్మ మెరిగేరా ✱ జనులే కొబ్బరికాయ - తిననేర్పుగల వారు । తిననేర్చునా కోతి - తనకొకాయబ్బిన । మర్మమెరిగేరా ✱ దీనందుండే ధర్మమెరిగేరా ✱ 258

భా॥ ఈ గ్రంథమును సద్గురువువలనవిని, దీనియర్థమును చక్కగా గ్రహించి, యితరులకు చక్కగాబోధించెడి నేర్పు

గలవారికే యీ గ్రంథములోని మర్మమును, నిందలి ధర్మమును తెలియును. గీనిని సద్గురునివలన వినక, ఇతరులకు చెప్పజాలకున్న వారి కీ గ్రంథములోని మర్మము తెలియబడదు. దీని లోని మర్మమే తెలియనివారి కిందలి ధర్మములెట్లు బోధపడును ? మానవులకు కొబ్బరికాయ దొరకినచో దానిని నేర్పుగా పగలగొట్టి, దానియందున్న కొబ్బరిని తినగలుగుచున్నారు. ఆ కొబ్బరికాయయే కోతికిదొరకినచో దానిని పగలగొట్టి యందలి కొబ్బరిని తినెడు నేర్పుదానికి లేదుగదా ! అటువలెనే యీ గ్రంథమును సద్గురువులవలన విని, యితరులకు చెప్ప నేర్చిన వారియొద్ద నీ గ్రంథమున్నచో, వారు దీనిలోని మర్మమును, నిందలి ధర్మములను నెఱుంగగలరుగాని, గురునివలన వినక, యితరులకు చెప్పనేరకయున్న వారియొద్ద నీగ్రంథముండినను వారి కిందలి మర్మముగాని, ధర్మముగాని తెలియబడదు.

కం॥ తానెంత లెస్సచదివిన । దీనిని తెలియంగ గలదె - దేశికవర్యు - పూని సేవించకుండిన । మానవుడది యెట్లనన్న - మరిపినవోయి * నామాటంచు - మనసుంచవోయి * వానకాలములోని - వర్షపు బిందొక్కటి । పైన మిట్టమునిల్వ - దదినిశ్చయమె కాదా । మరిపిన వోయి * నామాటంచు - మనసుంచవోయి * 259

భా॥ వర్షాకాలమునందు కురిసిన వానసీరు మెరక ప్రదేశమునం దొక బిందువైనను నిలువక పల్లమువైపునకే పఱుగెత్తి పోవునట్లు, ఈ గ్రంథమునయొక్క మర్మమును, దీనియం

దు ప్రతిపాదింపబడిన ధర్మములను సద్గురుమూర్తిని సేవించి, వారిని మెప్పించి, వారివలన దెలిసికొనక, తామెంత విద్యావంతులైనను, నీగ్రంథమును స్వయముగా నెన్నిమారులు చదివినను, దీనిమర్మ మణుమాత్రమును తెలియజాలరు. 259

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధనిర్గుణతత్త్వ కందార్థదరువులయందు గురుశిష్యోభయ లక్షణ మను షోడశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.



## 17. గురుదత్తాభయదానము

కం॥ నన్నాశ్రయించితావని । యన్నా యాబోధ నీకు - నతుసటకొరకై । యెన్నో యుక్తులు జెప్పితి । విన్నావా దీన్ని నీవు - విడువకెప్పటికి * నాయాజ్ఞను - గడువకెప్పటికి * ననునీవు నిన్ననే - గన్న వేశ్టిదో । ననునీవు విడలేవు - నిన్ను నేవిడలేను । విడువకెప్పటికీ * నా యాజ్ఞను - గడువకెప్పటికి * 260

భా॥ బిడ్డా ! నీవు నన్నాశ్రయించుకొని యున్నావని, నీకీ యచల పరిపూర్ణ బోధను దెలిపి, యిది నీమనస్సునకు బాగుగా పట్టుటకొఱకు ఎన్నియోయుక్తులను, నుపమానములను జెప్పితిని. వానినన్నిటిని నీవు విన్నావుగదా ! ఇక నీ వీ బోధ

నెన్నటికిని విడిచిపెట్టకుము. ఎప్పుడును నాయాజ్ఞ నుమీరి నడువకుము. నన్ను నీవును, నేనునిన్నును చూచిన శుభముహూర్త మెట్టిదోకాని, నన్ను నీవును విడిచిపెట్టి యుండలేవు. నేనునిన్నును విడిచిపెట్టి యుండలేను. నీవుమాత్ర మీబోధ నెన్నటికిని విడిచిపెట్టకుము. 260

కం॥ పతియైనను సతియైనను । నతిసాహస పరులు గాక - యాంతర్యమునన్ । రతివేళలజ్జపడ సం । రతిగలుగదు చూడుమట్లు - తగదు లజ్జింప * గురుశిష్యులు - తగు లజ్జనొంప * మతిని నీవిట్లు స - మ్మతి చేసి యే యేసం । గతినన్నడుగుము బోధ - స్థితినీకు దృఢపరతు । తగదు లజ్జింప * గురుశిష్యులు తగులజ్జనొంప * 261

భా॥ భార్యాభర్తలు పడకగదిలోజేరి యొకశయ్యపై పరుండినప్పుడు భర్తగాని, భార్యగాని లజ్జనువిడిచి, యొకరి నొకరు కౌగలించుకొని, రతిసల్పినచో సంతానము కలుగును గాని, లజ్జచే భార్యాభర్తలిద్దఱు చేరియొకపై పునకు తిరిగి పండుకొనినచో వారికి సంతానము కలుగనట్లు, గురుశిష్యులిద్దఱు నొకచోట జేరినప్పుడు శిష్యుడులజ్జచే గురుదేవునేమియు ప్రశ్నింపక యూరక కూర్చుండినచో, శిష్యునకు పరిపూర్ణ బోధ తెలియబడదు. కావున నతడు లజ్జనువిడిచి, తనకుకలిగిన సందేహముల నన్నిటిని గురుదేవునడిగినచో, నతడు వానికన్నిటికిని తగు సమాధానములనుజెప్పి, శిష్యునకు పరిపూర్ణ బోధ దృఢపడునట్లు చేయును. 261

కం॥ రతికోరకుగాదె సతి పతి । కతిహితమతిసేవ
జేయు - నటుపలె బోధ । స్థితినీకు కుదురుటకు స । మ్మతి
తోగురు సేవజేయు - మా నీతి మంతా * అభిమానము -
పోనీ నీదంతా * అతనికి దయవస్తే - అరనిముషమున బో
ధ । స్థితినీకు గుదిరించు - సిగ్గువిడిచి కొలువు - మానీతి
మంతా * అభిమానము - పోనీ నీదంతా * 262

భా॥ సంభోగ సుఖమాసించి భార్య భర్త నతిసంతోషముతో సేవించి పోషించునట్లు, నీవును పరిపూర్ణబోధ స్థితి కుదురుట కొఱకు సద్గురుమూర్తికి సంతోషముతో చతుర్విధ శుశ్రూషలనాచరించుచు, నీతి నియమములతో ప్రవర్తింపుము. సద్గురుమూర్తిని సేవించుటయందు నీవేమాత్రము నభిమానము నుంచుకొనకుము. నీవు నిష్కల్మష హృదయముతో నభిమాన రహితుడవై యతని సేవించుచుండినచో నతనికి నీయందు దయకలుగును. అతనికి దయకలిగినచో నరనిమిషములో నీకు పరిపూర్ణ బోధ స్థితిని గలిగించగలడు. కావున నీవతని నభిమాన రహితుడవై సేవింపుము. 226

కం॥ నీమానమున సంశయ । మేమాత్రము నిల్ప
బోకు - మికనాతోడే । నామాట నిశ్చయమునే । నేమాత్ర
ము దాచలేదు - నీతోడు సుమ్మీ * యింతకు మిక్కి - లి
కలేదు లెమ్మీ * నామీద తలపుంచు - ననుపురవకిక నే
ను । నీమీద దయయుంతు - నిజమిందుకిదె యొట్టు । నీ

తోడు సుమ్మీ * యింతకుమిక్కి - లికలేమలెమ్మీ * 263

భా॥ బిడ్డా ! నీవు నామాటల యందెంతమాత్రమును సంశయము పొందకుము. నామాటలయందు నీవు సంశయ ముంచినచో నాతోడేసుమా ! నామాటలను నీవు నిశ్చయము లని నమ్ముము. నేనునీకు పరిపూర్ణబోధను సాంతముగా నెఱి గించితిని. నేనేమాత్రమును దాచలేదు. దాచినచో నీతోడే సుమా ! నీకునేను బోధించిన పరిపూర్ణ బోధకంటె నెక్కు వేమియులేదు. నీవెల్లప్పుడు నన్ను మఱువక నీమనస్సును నా యందే యుంచుము. నేనెల్లప్పుడు నీయందు దయ జూపుదు ను. ఇందుకు తప్పినచో పెద్దయొట్టుసుమా ! ఇదినిజము. 263

కం॥ నీగురుబోధను నీచే । బాగుగవిని యింపసే
యు - భ్రష్టులమాటల్ । తోగొని విడిచేవివి నీ । కేగురు
డీలాటి బోధ - నెరిగించడోయి * యెవకరోని - దెరిగిం
చునోయి * ఆ గురుబోధల - నన్నింటి నెరిగుండి । నా
గురుబోధనే - నయముగ నీకిస్తి । నెరిగించడోయి * యె
రుకతోని - దెరిగించునోయి * 264

భా॥ నీగురుడనగు నేను నీకుచెప్పిన పరిపూర్ణబోధను, కుమతులు కొందఱు నీచేత చెప్పించుకొని, వినినపిదప ఇదియే నా! నీగురువు నీకు చెప్పినదని నిందింతురు. ఆనిందించెడి భ్ర ష్టుల మాటలను విని నీవు పరిపూర్ణబోధను విడిచిపెట్టెద వేమో! దీనిని విడిచిపెట్టినచో నీవుకూడ భ్రష్టుడవయ్యెదవు. మరల నీకిటువంటి పరిపూర్ణబోధ నే గురువును బోధింప

జాలడు. ఏగురువు బోధించినను నీకెఱుకలోని మార్గములను మాత్రమే బోధించును. ఆగురువులు బోధించెడి యెఱుకలోని మార్గముల నన్నిటిని నేనెఱిగియుండియును, నవి సరియైనత్రోవలు కావని, వానినన్నిటిని త్రోసిపుచ్చి, నాగురుదేవుడు నాకు ప్రసాదించిన అతీతమగు నచలపరిపూర్ణబోధను ప్రేమతో నీకు దెలిపితిని. నీవు దీనిని విడిచిపెట్టకుము. 264

కం॥ నిక్కముగ బీరపీచుల । చిక్కు సుమీ విచ్చ
రాదు - ఛీ యీ యెరుకన్ । చిక్కువనే శోధించిన । చ
క్కని బోధాగ్నిచేత - సాధించు పోరా * విచ్చునుచింత -
చాలించుకోరా * చొక్కమౌ నీ బోధ - తెక్కలికీడౌను ।
చక్కనబోధల - దిక్కుచూడక దీన్ని - సాధించుపోరా *
విచ్చునుచింత - చాలించుకోరా * 265

భా॥ బిడ్డా! ఎఱుకలోని మార్గములను దెలిపెడి బోధలన్నియు బీరపీచు చిక్కులవంటివి. బీరపీచుచిక్కులను విడదీయుటకు సాధ్యముకాని విధమున, ఎఱుకలోని మార్గములను దెలుపుబోధల చిక్కులనుగూడ విడదీయుటకు సాధ్యముకాదు. కావున నీవాయెఱుకలోని చిక్కులబోధలకు ధిక్కారము చెప్పి, నేను బోధించిన ఎఱుకలేని పరిపూర్ణబోధను గ్రహింపుము. అట్లు గ్రహించినచో నెఱుకలోని మార్గములను దెలుపు బోధల చిక్కులన్నియు వీడిపోవును. ఎఱుకలోని చిక్కులబోధలన్నియు స్వచ్ఛమైన పరిపూర్ణబోధకు సాటిరావు. కావున నీవా యెఱుకలోని చిక్కుల బోధల దిక్కునుజూడక పరిపూర్ణ

బోధను గ్రహింపుము. 265

కం॥ అడవియుసిరికయు జలనిధి । బొడమిన లవ ణంబటంచు - బొగడినరీతిన్ । పుడమిని నీస్థలముంమన । కడువేడుక నీవునేను - గలియుట వినరా * నీ నా ప్రేమ - గలసె నగ్గొనరా * విడలేవీవు నన్ను - విడలేను నేనిన్ను । పొడజూపినే నీవె । క్కడ బోకనిలిచిట్లు । గలియుట విన రా * నీ నా ప్రేమ - గలసె కన్గొనరా * 266

భా॥ అడవిలోగాచిన యుసిరికాయ, సముద్రజలము నుండి కలిగిన ఉప్పు, నొకచోటికిజేరి రుచినిగలిగించునట్లు, ఎ క్కడనోపుట్టిన నీవును, ఎక్కడనోపుట్టిన నేనును నీ స్థలమునం దు గలసి పరిపూర్ణబోధను చెప్పుకొనుట కడువేడుకగా ను న్నది. నీనాప్రేమలు కలసి పెనవేసికొని పోయినవి. వానిని విడదీయుట కెవరితరమునుగాదు. నీవునన్నును విడిచియుండ లేవు. నేను నిన్నును విడిచియుండలేను. మనమిద్దఱు మిచ్చట కలసినపిదప నన్నువిడిచి నీవుగాని, నిన్నువిడిచి నేనుగాని యెక్కడికిపోక నిరంతరము విడదీయరాని ప్రేమానురాగ ములతో ప్రవర్తించుట పరమానందముగానున్నది. 266

కం॥ పెద్దలనింద యొనర్చకు । పెద్దల సేవించు కొరకు పెద్దదివియకుమే । పెద్దలతో వాదింపకు । పెద్ద లు చెప్పేటి బుద్ధి - పెడచెవుల వినకు * పెద్దలునడిచే - నడత నే మనకు * పెద్దలకన్న నే - పెద్దనంచను కోకు ।

పెద్దల గనుగొన్న - ప్రియముతో మ్రొక్కుము । పెడచెవు
ల వినకు * పెద్దలునడిచే - సదత నే మనకు * 267

భా॥ కుమారా! నీ వెప్పుడు నేపెద్దలను నిందింపకుము. పెద్దలను సేవించుటయందు బిడియపడి వెనుకంజ వేయకుము. ఏపెద్దలతో నైన నెదిరించి వాదింపకుము. పెద్దలుచెప్పెడి పరి శుద్ధమైన పరిపూర్ణబోధను పెడచెవినిబెట్టక శ్రద్ధగావినుము. పెద్దలు నడిచేనడత నాక్షేపింపకుము. పెద్దలందరికంటె నేనే పెద్దన నెడి గర్వమును పొందకుము. పెద్దలను జూడగనే వారికి ప్రేమతో నమస్కరింపుము. వారుచెప్పెడి పరిపూర్ణబోధను చక్కగా నాలకింపుము. 267

కం॥ పెత్తనమున నేనుంగిల । చెత్తను దినవలసె
చీమ - చిన్నతనమునే । హత్తుకొని తినును చక్కెర ।
ని త్తరి నీరెంగ్లోనికు - నిష్టమేదైతే * చేకొనుమదే - స్ప
ష్టమేదైతే * పెత్తనమున చేచె - పెంపొందుచుండును ।
చిత్తములో దెలియు - చిన్నతనమే మేలు । ఇష్టమేదై
తే * చేకొనుమదే - స్పష్టమేదైతే * 268

భా॥ లోకులచేత పెద్దదనిపించుకొను చుండిన ఏను గెల్లప్పుడును చెత్త తినుచుండును. చిన్నదనిపించు కొను చుండిన చీమ యెల్లప్పుడును చక్కెరనే తినుచుండును. అదే విధముగ నీవు లోకులచేత గొప్పవాడననిపించు కొనవలెనను నుద్దేశముతో మదపుటేనుగువలె నాడంబరముగా ప్రవర్తించు చున్నచో నీకు చేటు వాటిల్లకతప్పదు. లేక చీమవలె చిన్న

తనమనను వహించియున్నచో నీవు పెద్దలవలన చక్కెరవంటి మృదుమధురములగు పూర్ణబోధ వాక్యములనువిని, జనన మరణాది సంసారప్రవాహమును తరింపగలవు. కావున నీకీ రెంటిలో నేదియిష్టమో దానిని నీమనస్సులో బాగుగా విచారించి చేకొనుము. 263

కం॥ తనను శరణన్న వారల । మనసెట్టిదొ తర
చిచూచి - మరి తెల్పఁగవలెఁ । వినువారికి తగినట్టిది । యని
రిట్లు మహానుభావు - లతిచాతుర్యమున * వినికని నీమన -
సతి చాతుర్యమున * ఘనమైన యీబోధ - తరుణీ స్త్రీ దీన్ని
చ । చ్చినదాక నిదుర వ - చ్చినదాక మరువకు । మతి
చాతుర్యమున * వినికని నీమన - సతి చాతుర్యమున *

భా॥ మహానుభావులైన మనపెద్దలు పరిపూర్ణబోధను పొందుటకొఱకేవరైనను సజ్జనులను శరణుపొందినప్పుడు వారిమనస్సెటువంటిదో బాగుగా పరీక్షించి తెలిసికొనినపిదప వారిమనస్సులకు తగినబోధలను చేయనలయునుగాని, యపరిపక్వ చిత్తులకు ముందుగా పరిపూర్ణబోధను తెలుపరాదని చెప్పిరి. నీమనస్సు చాలమంచిదనియు, పరిపక్వస్థితి గలదని యు లోకులు చెప్పగావినియును, నేను స్వయముగా పరీక్షించి తెలిసికొనియును నీమీాందదయతో నీకీనొప్పుదియగు పరిపూర్ణ బోధనెఱిగించితిని. నీవుదీనిని నిత్యము నిదురవచ్చువఱకును, సహము చచ్చువఱకును, లేక శరీరము పతనమగువఱకును మఱువకుము. 269

కం॥ చెప్పదగు గురుడుబోధను । చెప్పిన పనిజేసె నేని - శిష్యాగ్రణికిౙ । చెప్పదగదు చెప్పినపని । తప్పని వాదించెనేని - దయదలచిబోధ * యిద్దరికుండ - దగు నిట్టిమేధ * చెప్పిముందుగబోధ - చెప్పుడి పనులన్న । చెప్పగూడదువాని - తిప్పలుబెట్టక * దయదలచిబోధ * యిద్దరికుండ - దగునిట్టిమేధ * 270

భా॥ సద్గురువులను శరణుపొందు శిష్యులు "ప్రపన్నుడు, ఛాత్రుడు, సామాన్యుడు" అని మూడువిధములుగ నుందురు. ఇందు ప్రపన్నుడైన యుత్తమశిష్యుడు గురువుచెప్పక పూర్వమే యతని భావములను గ్రహించి, యతనికార్యములను చక్కగా నెరవేర్చుచుండును. ఛాత్రుడైన మధ్యమశిష్యుడు గురువుచెప్పిన కార్యములను శ్రద్ధతో జేయుచుండును. సామాన్యుడైన అధమశిష్యుడు గురుచెప్పిన పనులను తప్పని వాదించుచు, వానిని జేయకుండును. గురువుచెప్పెడి పనులు ధర్మవిరుద్ధములుగా నుండకూడదు. శిష్యుడు వానిని తప్పని వాదించరాదు. గురుశిష్యులిద్దరీ ధర్మమును పాటింపవలయును. అధముడైన శిష్యుడు తనగురువుతో మీరు ముందుగా నాకు పరిపూర్ణబోధ నొనగింపుడు. తరువాత నేను మీరుచెప్పినపనులను జేసెదనను. అట్టివాడు కుచ్ఛాత్రుడు. ఆ కుచ్ఛాత్రునియందు దయగలిగి యతనికి పరిపూర్ణబోధ నొసగింపరాదు. ముందువాని ననేకవిధములుగ తిప్పలుబెట్టి వాని మనస్సును చక్కబఱుపవలయును. అతనిబుద్ధి చక్కబడి చె

ప్పిన పనులను శ్రద్ధతో నాచరించినప్పుడే వానికి పరిపూర్ణ బోధ నెఱిగించవలెను. 270

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువులయందు గురుదత్తాభయ దానమను సప్తదశాధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య, స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.



## 18. సుజనలక్షణము

కం॥ ఇదివినుమనినను సుజనులు । చెవియొగ్గెద రి
వియు సృష్టి - జేసి కృతికిబల్ । చవిబుట్టింతు రదెట్లన ।
శివుడు కళానిధిని చక్క - జేసేనలేదా * నీమదిశంక -
పాసెన లేదా * అవనిలో శ్రీరాము - లవగుణి నహల్యను ।
నెవరేమియనకుండ - సవరించి సుగుణిగ । జేసెనలేదా *
నీ మదిశంక - పాసెనలేదా * 271

భా॥ చంద్రునియందనేక దోషములుండినను శివుడతనిని తన శిరస్సునందు బెట్టుకొని చక్కదిద్దినట్లును, దుశ్శీలయై భర్తచే శాపమునుపొంది పాషాణమై పడియుండిన అహల్యను శ్రీరామచంద్రుడెవరును కోరకపోయినను నామె దోషములను బాపి సుగుణిగా జేసినట్లును, సజ్జనుల నీ గ్రంథమును వినుడని వారికి వినిపించినచో, వారు దీనిని శ్రద్ధగావిని దీనికి చక్కగా

మెఱుఁగులుదిద్ది రసవంతముగా జేసెదను. ఇందుల కెంతమాత్రము సందేహానులేదు. 271

కం॥ గురుసూచనైననరులను । మరియును వినుమను
చు జదువు - మా పద్యములఁ । గురుసూచన యెరుగని
యా । నరులను వినుమనుచు జదువ - నగుబాటౌగదరా *
అదియెట్లన్న - నిక నేదెల్పెదరా * పురుషసంగతిలేని -
బాలతి కొక్కోకశాస్త్రు । మరసి మెచ్చునెదాన్ని - సతిప్రౌఢ
సతివలె।నగుబాటౌగదరా*అదియెట్లన్న-నికనేదెల్పెదరా *

భా॥ పురుషసంపర్కములేని బాలిక కొక్కోకశాస్త్రమును జదివినచో, నందలి యనుభవము నెఱుంగని దగుటచే దానిని మెచ్చుకొనక, పరిహాసము చేయును. ఆ కొక్కోకశాస్త్రమునే పురుషసంపర్కముగల ప్రౌఢస్త్రీ చదివినచో, నందలి యనుభవము తనకు చక్కగా తెలియును కావున దానిని జూచి మహదానందము పొందును. అట్లే పూర్ణగురువుల సూచన నెఱుంగని పామరులను వినుడని వారిముందీ కందార్థ దరువులను చదివినచో వారందలి భావము నెఱుంగక పరిహాసము చేసెదరు. సద్గురుమూర్తివలన పూర్ణభావము నెఱింగిన పుణ్యపురుషుల కీకందార్థదరువులను వినుడని వారిముందు నీవు చదివినచో, వారు చాలసంతోషించెదరు. 272

కం॥ ఎవరుంటె నేమిభయమురా । సవరింతురుతప్పు
లుంటె - సాధువులున్నఁ । సవరింపనిమ్ము నిదివిని । య
వినీతులు నిందజేస్తె - అయ్యేదేమోయి * అందులోపమనది-

చేష్టలకు సంతోషించుకొనెదరు. అదేవిధముగా నత్తవారింటి యందున్న కోడలు దిట్టరితనముగా ప్రవర్తించినచో, నామె నత్తింటి వారందఱు తిట్టెదరు. అంతటితో నూరుకొనక చేతుల కొలది కొట్టెదరు. అట్లే సద్గురుమూర్తి దగ్గర నతని ప్రియశిష్యుడు దిట్టరితనముగా ప్రవర్తించినను చూచిసంతోషించును గాని, యతనిని తిట్టికొట్టడు. ఇతరభూర్తమానవుల సమీపములో దిట్టరితనముగా ప్రవర్తించినచో నాధూర్తు లతని ననేక విధములుగా తిట్టుటయేగాక, పైనబడి కొట్టెదరు. కావున ధూర్తులయొద్ద నీదిట్టతనమును జూపకుము. 274

కం॥ అందముగ ఘనులుమెచ్చెద । రెందుకు మెచ్చెదరు చీన్ని - నితరజనంబుల్ । చందురు డుదయంబందిన । సింధువు చెలరేగినట్లు - చెలగునె చెరువుల్ ✱ కోనేర్లు నూ - తులు బావులేర్లు ✱ మందయానల పొందు - మగవారె నుతిసేతు । రెందుకునుతిసేతు - రిలషండ పురుషులు । చెలగునె చెరువుల్ ✱ కోనేర్లు నూ - తులుబావులేర్లు ✱

భా॥ చంద్రు డుదయించినచో సముద్రముప్పొంగును గాని, చెఱువులు, నూతులు, దిగుడుబావులు, ఏరులు మొదలగునవి యుప్పొంగవు. అట్లే మందయానలగు మగువల సంపర్కమును పుంసత్వముగల మగవారే ప్రశంసింతురుగాని, నపుంసకులు ప్రశంసింపరు. అదేవిధముగ జననమరణాది సంసార ప్రవాహమును దాటించెడి యీ సద్గ్రంథమును పరిపూర్ణ భావజ్ఞులైన మహానుభావు లానందముతో మెచ్చుకొనెదరు

గాని, జననమరణాది సంసార ప్రవాహమునబడి కొట్టుకొని పోవుచున్న పామరులు దీని నెంతమాత్రము మెచ్చుకొనరు. 275

కం॥ కాకంబులు సంపూర్ణత । టాకస్థజలంబులెట్లు - ద్రావక తృషచే । గైకొను నా సంభజలము । లీకలియుగ మందు దుష్ట - లింపు మీరగను * నిల్వరుబోధ - కంపు బారినను * మీరు దీనికె లంకె - మాకేలయిట్టి చీ । కాకు కొకొక్కకమైతె - గైకొందుమందురు * ఇంపు మీరగను * నిల్వరు బోధ - కంపుబారినను * 276

భా॥ కాకు లెంత దప్పికగొనియుండినను సంపూర్ణము గా నిండియుండిన తటాకములలోని పరిశుద్ధ జలమును గ్రోలక, నిండ్ల కడ కుండలయొద్ద మురిగియున్న నీటిని ద్రావి దాహము తీర్చుకొనును. అదేవిధముగ నీ కలియుగములోని పామరులగు దుష్టమానవు లీ పరిపూర్ణ బోధ నింపుగా వినకపోగా, నీ బోధ యొక్క కంపుబారినచో దూరముగా తొలగిపోవుదురు. ఈ వేదాంతము మీకు రుచించును కావున దానికిని మీకును సరిపోవును. అదిమాకెందుకు పనికివచ్చును? మాకు కొక్కొక శాస్త్రమును చదివి వినిపించినచో సంతోషముతో విననగ మ నెదరు. 276

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కంబార్థదర్పులయందు సుజనలక్షణమను అష్ట దశాధ్యాయమునకు, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య, స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.



## 19. కుజన లక్షణము

కం॥ కుచ్చితమతియగు పురుషుని । చెచ్చెర విను
మనుచు జదువ - శిష్టులవలె దా । ముచ్చటపాటుగ విన
డివి । కుచ్చుల కుళ్లాయి కుక్క - కూన కెందుకురా * పిడు
దుకుదుగ్ధ - పానమెందుకురా * హెచ్చైన ముత్యాల - ప
చ్చల పతకము । గ్రుచ్చి పేరుగజేసి - తెచ్చి వేసినకోతి ।
కూన కెందుకురా * పిడుదుకు దుగ్ధ - పానమెందుకురా*277

భా॥ కుక్కపిల్ల నెత్తిమీద కుచ్చుల కుళ్ళాయిపెట్టిన చో దానిని కాలితోలాగి చింపివేయును. గోవు పొదుగులో నున్న పిడుదు, పొదుగులోని రక్తమును పీల్చి త్రాగును గాని పాలను త్రాగదు. మంచిముత్యాలను పేరుగా గ్రుచ్చిపొదిగిన పచ్చలపతకము కోతిమెడలో వేసిననది కొఱికి పాఱవేయును. అట్లే కుచ్చితుడగు దుష్టుని సద్గ్రంథమును వినుమని యతని ముందు చదివినచో నతడు శిష్టులవలెవిని యానందింపకపోగా దీని నవహేళన చేయును. వారి కీ బోధ పనికిరాదు. 277

కం॥ అక్షయబోధస్థితిగల । లక్షణవేత్తలకు మెప్పు -
లైన కృతులలో । కక్షకు తప్పులుకనుతి ప । రీక్షింపుచు
నుండునెన్నో - కీతులవినుమీ * తప్పావమీ - రీతినికనుమీ *
మక్షిక మెప్పుడు - మాని సుగంధాదు । లీక్షించు వ్రణము
ప్ర - త్యక్షమెకద యెన్నో । రీతుల వినుమీ * తప్పావ

మీ - రీతిది కనుమీ * 278

భా॥ క్షుద్రమైనయీగ పరిమళము గుబాళించు సుగంధద్రవ్యములమీద వ్రాలి వాని పరిమళమును గ్రహింపక చీముతో చితచితలాడెడి పుండుకొఱకు వెదకుచుండునట్లు, అక్షయమగు పరిపూర్ణ బోధనుపొందిన లక్షణవేత్తలగు పెద్దల మెప్పును పొందిన ఉత్తమగ్రంథముల యందున్న గొప్పదనమును గ్రహింపజాలక నీచుడెల్లప్పుడు నీర్ష్యాసూయలతో నీచమైన యీగవలె తప్పులనే వెదకుచుండును. నీచుల స్వభావగుణము నెవరును చక్కబెట్టజాలరు. 278

కం॥ రమ్మనిపిలువనిదే ప । ద్యమ్ములు చదువంగ
వచ్చి - యతినిందించున్ । సమ్మతిగాక కుమతివిని । యి
మ్మహినిదియెల్లటన్న - నిట్టులేవినుమీ * వానిబుద్ధి - నట్టు
లే కనుమీ * బొమ్మలాటలోదిచ్చు - బొమ్మ తానొకటిచీ ।
పొమ్మనియనిన హా - స్యమ్మొనర్చదె పోక । యిట్టులే
వినుమీ * వానిబుద్ధి - నట్టులేకనుమీ * 279

భా॥ తోలుబొమ్మలాడునప్పుడు కథామధ్యమున కేతిగాడు తనంతటతానేవచ్చి హాస్యమొనర్చుచుండును. వానినెందఱు చీకొట్టి తొలగిపొమ్మనినను తొలగిపోక, కొంతసేపు హాస్యమొనర్చిన పిదప, తనంతటతానే పోవును. అట్లే దుష్టబుద్ధి గలవాడు తన నెవరు నీకంబార్థదువులను చదువుమని పిలువక పోయినను, కేతిగానివలె తనంతటతానే వచ్చి యెందఱు చీకొట్టినను పోక, కొంతసేపు చదివి యవిబాగుగా నుండలేదని

వానిని నిందించిపోవును. 279

కం॥ వటియించిన చన్నుగవల । కుటిలాలకనింద జేయు - గుప్తపురవికల । నెటువలె తనకప్పెరుగక । యటువలె గ్రంథమునుమెచ్చ - నతిమర్జనుండు * లేనిదె తప్పు - వెదకుచునుండు * ఇటువంటిబోధనే - నెరిగేదె ట్లనుకోక । కటువాక్యములు బలికి - ఘనులగాసిలజేయు । నతిమర్జనుండు * లేనిదెతప్పు - వెదకుచునుండు * 280

భా॥ శుష్కించిపోయిన చన్నులుగల స్త్రీ తన శుష్కించిన చనులను మఱుగుపఱచి, పీనస్తనములుగల దానివలె నటించుచు, గుప్తముగానున్న రవికనుజూచి, ఇది నాకు పనికిరాదని దానిని నిందించునట్లు, దుర్జను డీపవిత్రమైన యచల గ్రంథమును మెచ్చక, దానిలో తప్పులు లేకుండినను, నిరంతర మతడు దానిలోలేని తప్పులనే వెదకుచుండును. ఇటువంటి పవిత్రమైన పరిపూర్ణ బోధ నేనేవిధముగా నెఱుగగలనను పరితాపమును పొందకపోగా, నాదుష్టుడు కటువాక్యములతో నిందించి పెద్దల హృదయములను గాసిల జేయును. 280

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువులయందు కుజనలక్షణమను ఏకోనవింశతి అధ్యాయమునకు శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్యవర్య స్వామి శ్రీ బ్రహ్మానందగిరి సద్గురుమహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.

# 20. శిష్యవిజ్ఞాపనము

కం॥ గురువర మీ నా సంధున । నెరుకను తెరగలిగి
యుండె - నిన్నాళ్ళు గొలెన్ । కరుణారసేక్షణములం । దెర
తీసితి రెరుకమాట - దీరెనిక్కడికి * చాలునుబోధ - దూ
రెదెక్కడికి * పరిపూర్ణ మునులేని - యెరుకనుజూపించి ।
యెరుకలేదనియంటి - రెరుకలేదాయెను । దీరెనిక్కడికి *
చాలునుబోధ - దూరెదెక్కడికి * 281

భా॥ గురుదేవా ! ఇన్నిదినములనుండి మీరు ఎఱుక కతీతులై దానిని దాటియున్నారు. నేను ఎఱుకయను తెర లోపలనున్నాను. కావున మనయిద్దఱిసందున నెఱుకయనెడి తెరఅడ్డముగానున్నది. మీరాకరుణారసదృష్టులనునామీఁదబఱపి, నాయొఱుక భ్రాంతియను తెరను తొలగించితిరి. ఇక నెఱుక పనియే తీరిపోయినది. ఎఱుక పోయినపిదప నికబోధ యెవ్వరికి కావలయును. మీరు సర్వత్రనిండియున్న పరిపూర్ణబ్రహ్మము యొక్క యునికిని, మూలములేకయే నామరూప నటనలుగా తోచుచున్న నెఱుకయొక్క లేమిఁదెలిపి, లేనియొఱుక భ్రాంతిని లేకుండజేసితిరి. ఇక నాయొఱుకభ్రాంతి సాంతముగా దీరిపోయినది. కావున బోధతో పనికూడ తీరిపోయినది. 281

కం॥ ధారణి కొంత చరించి వి । చారించితిగాని
యీ వి - చారమునే నె - వ్వారలు జెప్పగవినలే । దార
య మీనోటవింటి - నయ్యా గురుమూర్తీ * నాతరమాను

తి - చెయ్యమీ కీ ర్తి * సారసనయన పు - రారి సిరజజ
ల్యం । వారసముఖులైన - నేరక మిమునెరియ । సయ్యా
గసుమూర్తి * నారసనుతి - చెయ్య మీ కీర్తి * 282

భా॥ గురుదేవా ! నేను ప్రపంచములో బోధకొజకు
కొంతవఱకు తిరిగివిచారించి చూచితిని గాని, యిటువంటి పూర్ణ
బోధను నేనెవ్వరు చెప్పగను వినియుండలేదు. ఈ మహత్తమ
మైన పరిపూర్ణ బోధను మీరు చెప్పుచుండగా మాత్రమే నేను
వింటిని. మహానుభావా! మీ ప్రభావమును బ్రహ్మవిష్ణు మహే
శ్వర సురేశ్వరాది బృందారక సందోహమైన నెఱింగి స్తుతి
జేయ జాలనప్పుడు సామాన్యుడనైన నేనెట్లు మీ మహాత్మ్య
ము నెఱింగి స్తుతి జేయగలను స్వామీ ! 282

కం॥ ఘటమెదుటబెట్టి చూపిన । యటువలె బయలుం
బజూపి - యతిమాయలచే - నటియించుచున్న యెరుకను ।
ప్రటిలోవిడిపి స్థిరపడు - కొలగెనాశంక * యిక పుట్టుప -
నేరీతిశంక * ఎటుబోచ కిలువెడలి - యిటు మిమ్ము జూచి
న । ప్పటినుండి దయచేసి - ప్పటిదాక బోధింప । కొలగెనా
శంక * యిక పుట్టుట - నేరీతిశంక * 283

భా॥ స్వామీ ! కుండ నెదుటబెట్టి దాని యునికిని జూ
పిన విధముగా సర్వత్ర స్వతస్సిద్ధమై సంపూర్ణముగ నిండియుం
డిన బట్టబయలగు కేవలాత్మయునికిని దెలిపి, యటుపిమ్మట
మూలము లేకయే నానావిధ నామరూప నటనలుగా నటించు
చున్న మాయలమారి యెఱుకను నెఱిగించి, తరువాత నా

మాయలమారి యొకనికను తృణములో నటునూయను చేసి తిని. జననమరణాది సంసార భ్రాంతిలోబడి, నానాదుఃఖముల ననుభవించుచు దరిగానక, ఇంటినుండి బయలుదేరి, యీ సంసార దుఃఖములను నివారించు సద్గురువులను వెదకుచు నెందరినో గురువులను జూచియు నా మనస్సునకు సరిపోక, తుదకు మీ పాదముల సన్నిధికి జేరితిని. నేను మీపాదముల సన్నిధికి జేరినప్పటినుండి యిప్పటివఱకు మీరు నాకు పరిపూర్ణ బోధను జేయగా ఇప్పటికి నాకు జననమరణాది సంసారభ్రాంతి నశించినది. నా సందేహములన్నియు తీరిపోయినవి. ఇక నామనస్సులో నేసంశయమును పుట్టదు. 283

కం॥ ఇరులు నేననక నిండిన । దెరిగింపుమదేమొ, బయలు - ఏనొరులనుచున్ । ఎరుగు నీవెవరు ఈ లే । నెరుకను, ఉన్నావు, ఉండే - నేలేనంచనుకో * నేనో, నిను నీ - మదిని లేననుకో * ఎరిగియీ లే నెరుక - యిట్లులే కుండిన । పరిపూర్ణమో, దాన్నే - పగిది గుర్తెరిగేము । నే లేనంచనుకో * నేనో, నినునీ - మదినిలేననుకో * 284

భా॥ ఈకందార్థము ప్రశ్నోత్తర రూపముగానున్నది.

ప్రశ్న :- ఇతరులనియు, నేననియు ననకుండ సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్త వస్తువులయందును సంపూర్ణముగనిండి స్వతస్సిద్ధముగానున్న దేది ?

ఉత్త :- బట్టబయలగు కేవలాత్మ.

ప్రశ్న :- ' నేను, ఇతరులు ' అనుచు నెఱిగెడి నీ వెవరవు ?

ఉత్త:- మూలములేకయే తోచుచున్న లేనియొఱుకను.

ప్రశ్న :- ఉన్నావుగదా !

ఉత్త :- ఉంటే నేను మూలములేకయే తోచుచుంటిని కావున నేనెప్పుడును లేననియే యనుకొనుము.

ప్రశ్న :- నే నుంటినిగదా !

ఉత్త :- నీవును మూలములేని యెఱుకవే కావున నిన్నుకూడ నీవులేనని యనుకొనుము.

ప్రశ్న :- మూలములేని యెఱుక యీ విధముగా నెఱిగిలేకపోయిన తరువాత పరిపూర్ణబ్రహ్మ ముండునుగదా !

ఉత్త :- అది సర్వకాలముల యందును, సర్వదేశముల యందును, సమస్త వస్తువులయందును సంపూర్ణ ముగనిండి స్వతస్సిద్ధమై యుండినను దాని నేవిధముగా నెఱుగగలము ? ఎఱుకయుండినప్పు డది పరిపూర్ణబ్రహ్మము నెఱుగ జాలదు. ఎఱుకను విడిచిన పిదప దానిని గుర్తెఱుగునదియే లేదుగదా! ' నేను నేను ' అనుకొనుచున్న నీవు నిన్నువిడచి యుండిన చాలును. పరిపూర్ణ బ్రహ్మము స్వతస్సిద్ధమై యుండును.234

కం॥ నాబుద్ధికి సరిపడ్డది । నీబుద్దేకాని యెన్ని - నే ర్పుల గనినన్ । చీబుద్ధుల యాబుద్ధులు । నాబుద్ధికి మెప్పు రావు - నాతంత్రివినరా * నెబాసుని - న్నేతంత్రిగనెరా * ఈబుద్ధినికమాన - కేబుద్ధి బూనకు । మేబుద్ధి బూనిన -

నీబుద్ధి చెడిపోవు । నాతండ్రివినరా * సెబాసుని - న్నే
తండ్రి గనెరా * 285

భా॥ బిడ్డా ! ఎన్ని విధములు విచారించి చూచినప్పటికిని, నా బుద్ధికి సరిపోయినది నీబుద్ధియే కాని, సంసారమునందు దేహేంద్రియాది సంఘాతములతోను, స్త్రీపుత్ర ధనాదిపదార్థములతోను బంధింపబడిన బద్ధులయొక్క బుద్ధులు చీ నాబుద్ధికి మెప్పును గలిగింపజాలవు. నీకిటువంటి సద్బుద్ధిగలుగుటకు నిన్నే తండ్రి కనెనోకదా ! సేబాస్, నీ బుద్ధి నాకు మెప్పును గలిగించినది. నీవీ పవిత్రమైన పరమార్థబుద్ధిని నూనకుము. దీనిని మాని సంసారబంధములలో చిక్కుకొనిన భ్రాంతుల బుద్ధులను బూనిన చో నీబుద్ధి చెడిపోవును. 285

కం॥ కొట్టితి తిట్టితిశ్రమలం । బెట్టితి నీపనవి చెవిని - బెట్టక పెడచా । బెట్టితిమొట్టితి వెడలన్ । గొట్టితి నీ మనసు దెలియ - కోపములేక * సరితెలిసె నీ - యోపిక పోక * పట్టుమిచ్చెదనింక - నష్టేమియని దయ । బుట్టి యిచ్చితిబోధ - గట్టివాడవురోరి । కోపములేక * సరితెలిసె నీ - యోపికపోక * 286

భా॥ బిడ్డా ! నామనస్సులో నీమీద నేమాత్రము కోపములేక పోయినను నీమనస్సుయొక్క దృఢత్వమును తెలిసికొనదలంచి నిన్న నేక పర్యాయములు తిట్టి కొట్టితిని. ఎవరు తప్పుచేసినను నిన్నే శిక్షించితిని. ఇంక నిన్న నేక విధములుగా శ్రమలుపెట్టి బాధించితిని. నీవేదైన మనవి చేసికొనదలంచి

దగ్గరకు వచ్చినప్పుడు నీమనవిని వినక నిన్ను కసరికొట్టితిని. చీటికిమాటికి నీనెత్తిపైన మొట్టితిని. నీ వీ యాశ్రమములో నుండతగవని బైటకి నెట్టితిని. నేను నిన్నెన్ని బాధలుపెట్టినను నీవు వాని నన్నింటిని సహించుకొని, పంచ గాచుకొని పడి యుంటివి. నీ యోపిక, నీసహనము, నీ పట్టుదల, నీ పరమార్థ కాంక్ష నాకు సంతోషమును గలిగించినవి. కావున నీమీద నాకు సంపూర్ణమైన దయగలిగి నీ కీ పరిపూర్ణ బోధ నిచ్చితిని. నీవు చాల గట్టివాడవు. 286

కం॥ నీవెంత కొట్టితిట్టిన । నేవిడిచేవాడగాను - నీచ రణంబుల్ । చావైన పెండ్లియైనను । నేవిడువనటంటివ ట్టి - నిజభక్తుడవెరా * నేకనుగొంటి - నీనిష్ఠనెరా * కావున నీకిట్టి - ఘనమైన యీబోధ । వేవేగనయచేస్తి - నీవిది విడువకు । నిజభక్తుడవెరా * నేగనుగొంటి - నీ నిష్ఠనెర * 287

భా॥ బిడ్డా! నీవు నన్నెంత కొట్టినను, ఎంతతిట్టినను నీ పాదపద్మములను విడువనంటివి. చావైనను, పెండ్లియైనను నీ పాదముల యొద్దనే జరుగవలయునుగాని, నీపాదములను విడిచి పోనంటివి. నిజముగా నీవటునంటి నిజమైన భక్తుడవే యగుదువు. నేను నిన్ను నేకవిధములుగా పరీక్షచేసి నీదృఢబుద్ధిని తెలిసి కొంటిని. నీవిట్టి నిశ్చయబుద్ధి గలవాడ వగుటచేతనే నీ కిట్టి గొప్పదియైన పరిపూర్ణబోధ నతిత్వరలో నొసఁగించితిని. నీవు దీనిని విడువకుము. 287

కం॥ నానోటిమాట వెంబడి । తానెప్పుడు సంచరించె - తగనీచిత్తం । బేసదిగని యీబోధ ని । ధానము నీకి స్తి దీన్ని - దాచుకోసుమ్మి * నిత్యము నీవు - చూచుకోనమ్మి * యేనరుడైన ని - న్నీబోధనడిగితె । వాని మనసరయక - వానికి తెల్పేవు । దాచుకోసుమ్మి * నిత్యము నీవు - చూచుకోనమ్మి * 288

భా॥ బిడ్డా! నీమనస్సెల్ల ప్పుడును నానోటిమాటకెదురు చూచుచుండి, నామాట జైటికిరాగానే దాని ననుసరించి నీ వతి శ్రద్ధతో సమస్తకార్యముల నొనర్చుచుంటివి. నేనిటువంటి నీ సద్బుద్ధిని దెలిసికొని గొప్పదియైన యీ పరిపూర్ణ బోధను నీకెతీగించితిని. దానిని నీవు మఱచిపోకుండ నిత్యము చదువుకొనుట కొఱకీ కందార్థ దరువుల గ్రంథము నిచ్చుచున్నాను. దీనిని నీవు పదిలముగా దాచుకొని, నిత్యము చదువుకొనుచుండుము. ఎవడైన నిన్నీ పరిపూర్ణ బోధను తెలుపుమని యడిగినచో వాని మనస్సును పరీక్షించి తెలిసికొనిన పిదపనే యతని కీ పరిపూర్ణ బోధ నొసంగుము. 288

ఇది శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థదరువులయందు శిష్యవిజ్ఞాపనమను వింశతి అధ్యాయమునకు, శ్రీమత్పరమహంస, పరివ్రాజకాచార్య వర్య, స్వామి శ్రీబ్రహ్మానందగిరి సద్గురుమహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితము.

—•○:•:○•—

# 21. గ్రంథపరిసమాప్తి

కం॥ కూడీ గురుశిష్యులిద్దరు । వేడుక బయలెరుక లున్న - విధమెరిగెరుకన్ । వీడిరిది లేని దని మా । టాడుట కిక యేమిదోచ - దదియేమొకాని * వింటిరెమీర - లిది యిందుతోని * జాడమీ కెరుకని - వేడితి వినుడంచు । ఈడకుసరి, ముచ్చ - టాడుటకిక దోచ । దదియేమొ కాని * వింటిరె మీర - లిదియిందుతోని * 289

తా॥ వేఱువేఱు ప్రదేశములలోనున్న గురుశిష్యులిద్దఱు నొకచోటికిజేరి, గురువు శిష్యునకు సర్వత్ర స్వతస్సిద్ధమై నిండియున్న బట్టబయలగు కేవలాత్మ యునికిని, మూలములేక యే నామరూప నటనలుగా తోచుచున్న ఎఱుకయొక్క స్వరూప స్వభావములను నిరీక్షించి, యటుపిమ్మట మూలము లేని యెఱుక యెప్పుడును లేనిదేయని తెలిపినప్పుడు గురుశిష్యులిరువురు నెఱుకను వీడియుందురుగదా! ఆసమయమున వారికిక మాటాడుట కేమియుండును? దీనిలోని భావము పూర్ణ జ్ఞానులైన మీకందఱకు తెలిసియుండును కావున నేను మీకు వేఱుగా చెప్పవలసిన పనిలేదు. గురువుబోధించుట, శిష్యుడువినుట దీనితో సరిపోయెను. మరలమాటాడుట కేమియు లేదుకదా! 289

కం॥ శరశాస్త్రస్వరహిమకర । పరిమితమైనట్టి కాలి - వాహన శకమం । దరయగ శోభకృదను వ । త్సరమార్గ

శిరంబు కృష్ణ - చవితి నాటికి ని*పద్యాల్నదిత - క్కావము
స్నూటికిని * ముఠియుచు జే స్తినె - వ్వరువిన్న చదివిన ।
పరిపూర్ణ మెరుకై లే - నెరుక లేకుండును । చవితినాటికిని *
పద్యాల్పది త - క్కావ ముస్నూటికిని * 290

భా॥ శాలివాహనశకము 1765 సంవత్సరమునకు సరి యగు చాంద్రమాన శోభకృతునామ సంవత్సర మార్గశిర బహుళ చవితినాటికి 290 శుద్ధ నిర్గుణత త్త్వ కందార్థదరువులను సంతోషముతో వ్రాసి ముగించితిని. వీని నెవ్వరు వినినను, లేక స్వయముగా చదువుకొనినను సర్వత్ర స్వతస్సిద్ధమై సంపూర్ణముగా నిండియుండిన పరిపూర్ణ బ్రహ్మముయొక్క యునికి యెఱుగబడి, మూలములేని యెఱుక యెచ్చటను లేక పోవును. 290

కం॥ ఏ పురుషుడు గురువర్యుని । శ్రీపాదముఁబట్ట
లేకొ - నేఱుగనాతం । డీ పుస్తకమును జూచిన । యేపట్టు
న నిల్వకేగు - నిదినిజమయ్యా * నరులార మీ - మది దె
లియరయ్యా * ఈపరమ గోప్యము - నెవరెరుగరోరయ్యా ।
నాపల్కు మదిలోన - నాటినవారికి । యిది నిజమయ్యా *
నరులారా మీ - మది దెలియరయ్యా * 291

భా॥ సద్గురుసార్వభౌముని శ్రీపాదపద్మములనుపట్టి, వారి వలన పరిపూర్ణబోధను పొందని పామరుడీ శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థదరువుల పుస్తకమును తాను స్వయముగా చదువనకు.

దాని నితరులు చదువుచున్న చోటను కూడ నిలిచి వినక నిర్ల క్ష్యముగా వెళ్లి పోవును. ఇది సత్యము. ఈ పరమరహస్యమైన పరిపూర్ణబోధను పామరులెఱుంగజాలరు. నామాటనునమ్మి సద్గురుని పాదపద్మములనుబట్టి, వారివలన నీ పరిపూర్ణబోధను విని, తాను స్వయముగా నీ గ్రంథమును చదువుకొనినవానికే దీనిలోని పరమరహస్యము తెలియగలదు. ఇతరులకు తెలియ బడదు. 291

కం॥ ఎరుక నెఱుంగని బయలులో । గురుడును శి ష్యుండు వారి - గొడవయు నే మీ । కెరిగించిన వన్నియు మీ । రెరిగిన వన్నియును మీర - లేను నుళ్లక్కి * ఉళ్ల క్కి తా - నెప్పుడుళ్లక్కి * మరియింక మాటాడ - మాట లేదాయెను । సరిపోయె సరిపోతె - సరిపోయె సరిమీర । లేను నుళ్లక్కి * ఉళ్లక్కి తా - నెప్పుడుళ్లక్కి * 292

భా॥ ఎఱుకనెఱుంగని బట్టబయలులో గురువును, శిష్యుడును ఆ గురుశిష్యులబోధ గూపమగు గొడవయు సర్వ మును కల్పించి నేను మీకెఱిగించితిని. నేనెఱిగించినదానిని మీరెఱింగితిరి. నేను మీకెఱింగించినదియును, మీరెఱిగిన దియును, ఎఱిగించిననేనును, ఎఱిగిన మీరును మూలములేని యెఱుకలోని వారమగుటచే నెప్పుడును లేనివారమే యగుదు ము. మననేలేనప్పుడు మనము మాటాడెడి మాటకూడ లేని దేయగునుగదా! కావున నేనును, మీరును, మనవిచారణ యును సర్వము హుళక్కియేయగును. 292

ఇది శ్రీమద్భాగవతోల కృష్ణ దేశిక ప్రభువిరచిత శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థ దరువులయందు గ్రంథసంపూర్తి యను ఏకవింశతి అధ్యాయమునకు, శ్రీమత్పరమహంస, పరివ్రాజ కాచార్యవర్య, స్వామి, శ్రీబ్రహ్మానందగిరి సద్గురు మహారాజ్ వారిచే వ్రాయబడిన భావార్థ దీపికాసహితముగా నీగ్రంథము పరిసమాప్తమైనది.



## అద్వైతగురుపరంపరా మంగళహారతి

జయమంగళం నిత్య శుభమంగళం,
జయా జయమంగళం మహోత్సవమంగళం ॥

1. వర సద్గురుడు వీర - బ్రహ్మేంద్రస్వామికిని,
సరవి సిద్ధప్ప స - ద్గురు వరునకు,
కరుణాల వాలుండ - మరలింగ దేశికున,
కరయ శ్రీ శేషరా - జాహ్వయునకు ॥ జయ ॥

2. చెంచురాజునకు శ్రీ - శేషాచలాఖ్యునకు,
నంచితమ్ముగ నృసిం - హ ప్రభునకు,
పంచభూతాత్మ ప్ర - పంచ ప్రకాశకుం,
డెంచ రంగయ దేశి - కేంద్రునకును ॥జయ॥

3. పరమహంసయు, పరి - వ్రాజకాచార్యుండు,
గురుడు బ్రహ్మానంద - గిరి ప్రభునకు,
గురుపరంపరకు స - ద్గురు వరేణ్యులకు స,
ద్గురుభక్తులిచ్చు క - ర్పూరహారతి ॥జయ॥

# అచలగురుపరంపరా మంగళహారతి

1. అరయ నచలగురుపరంప - రాఖ్యులారమంగళం ।
పరిపూర్ణాచలబోధక - ప్రభువులార మంగళం ॥

2. ఈశ విధి వశిష్ఠులార - భాసుర శుభమంగళం ।
వాసి జనక శ్రీశుకగురు - వర్యులార మంగళం ॥

3. సాందీపని కృష్ణోద్భవ - స్వాములార మంగళం ।
పొందుగ బ్రహ్మానంద సు - పూజ్యపాద మంగళం ॥

4. రామానంద కబీరు వి - రాగులార మంగళం ।
వేమనయోగీంద్ర ప్రభు - విమల విజయమంగళం ॥

5. వర శ్రీధరస్వామి పాద - వనజ నిత్యమంగళం ।
ధర శ్రీశివరామ దీక్షి - త ప్రభువర మంగళం ॥

6. ధీరరామకృష్ణయ గురు - దేవ విజయ మంగళం ।
వీరయ్య మహేశ్వరార్య - విమలశుభ సుమంగళం ॥

7. కోటయదేవర దేశిక - కొనుము దివ్యమంగళం ।
సాటిలేని శేషాచల - స్వామి నిత్యమంగళం ॥

8. నరసింహ ప్రభువరేణ్య - నవ్యభవ్య మంగళం ।
వర శ్రీరంగయదేశిక - వర్య దివ్యమంగళం ॥

9. శ్రీబ్రహ్మానందగిరి వ - రేణ్య విజయమంగళం ।
మాభ్రమలను దొలచుడు స - న్న్యాస్యులారమంగళం ॥

సీ॥ శ్రీమదీశ్వర సుర - జ్యేష్ఠ వశిష్ఠబ్ర
హ్మర్షి జనకులార - మంగళంబు
శ్రీశుక సాందీప - వాసుదేవోద్ధవ
మహితాత్ములార స - న్మంగళంబు
త్యాగి బ్రహ్మానంద - యోగి రామానంద
మౌని శేఖరులార - మంగళంబు
వినుత కబీరు వే - మన శ్రీధరస్వామి
మహనీయులార స - న్మంగళంబు
శ్రీశివరామ దీ - క్షిత రామకృష్ణయ్య
మాన్యచరితులార - మంగళంబు
మేటి వీరయగురు - కోటప్ప దేశిక
పుంగవులార స - న్మంగళంబు
శేషాచలార్య నృ - సింహ సద్గురువర్య
రంగయప్రభులార - మంగళంబు
వరలు బ్రహ్మానంద - గిరి యతీంద్రస్వామి
సంగపరిత్యాగి - మంగళంబు

మంగళము పూజ్యులార స - న్మంగళంబు
మంగళము సద్గురువులార - మంగళంబు
మంగళము శాంతులార స - న్మంగళంబు
మంగళము సాధువరులార - మంగళంబు

## సద్గురు స్తుతి

శ్లో॥ నమోస్తు దేశికేంద్రాయ, బ్రహ్మానందమహార్షిణే।
వేదవేదాంత వేద్యాయ, స్వామిపాద నమోనమః॥

# సద్గురు మంగళములు

శ్లో॥ బ్రహ్మానందగిరీశాయ, పూర్ణబోధప్రదాయినే।
సర్వమోహావినాశాయ, గురుదేవాయమంగళమ్॥

శ్లో॥ మంగళం దేశికేంద్రాయ, కేవలాత్మాయమంగళం।
మంగళం యతిచంద్రాయ, బ్రహ్మానందాయ
మంగళమ్॥

సీ॥ శ్రీమత్పపూర్ణ దే _ శిక సార్వభౌమ, స
న్మహిత శాంతోపేత _ మంగళంబు
పరమహంస ప్రభు _ ప్రవ్రజితాచార్య
సంగపరిత్యాగి _ మంగళంబు
యతిమహారాజ వి _ శ్వాతీత శాశ్వత
మాయావిభేదన _ మంగళంబు
సచ్చిత్సుఖాతీత _ స్వామి బ్రహ్మానంద
మౌనీంద్ర శేఖర _ ంగ ళంబు

మంగళము నీకు గురుదేవ _ మంగళంబు
మంగళము నీకు ఋషిచంద్ర _ మంగళంబు
మంగళము నీకు సుశ్లోక _ మంగళంబు
మంగళము నీకు సుస్థిర _ మంగళంబు.

## అభ్యర్థనము

తే॥ గీ॥ జననమరణాది ఘోర సం _ సారమునకు
నాదికారణమగు మాయ _ నణచి పూర్ణ
శాంతినొసగుము సద్గురు _ సార్వభౌమ
పూజ్యపాద బ్రహ్మానంద _ బుధవరేణ్య.